త్వరలో వచ్చుచున్నది!

# కాంచనద్వీపం

రాబర్ట్ లూయీస్టీవెన్సన్



అ వా
ంటాం రామోహనరావు

వెల రూ. 1 80
ఖర్చుల ప్రత్యేకం

## ఆంధ్ర గ్రంథమాల,

మద్రాసు 1.

# భారతి

[సచిత్ర మాసపత్రిక]

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



ఆంధ్రపత్రికా ముద్రాలయము

మదరాసు.

సంపుటము 29 ఏప్రెల్, 1952 సంచిక 4

విడిప్రతి వెల ఒకరూపాయి



# విషయా[illegible]క

## ఏప్రిల్


| | | |
|---|---|---|
| ఉగాది—కన్నెకంటి వీరభద్రాచార్యులుగారు | ... | 291 |
| ధరల తగ్గుదల—పి యస్ ప్రకాశరావుగారు | | 2[illegible]3 |
| ప్రపంచకథా బహూకృతి—శ్రీపాలగుమ్మి పద్మరాజు | . | 297 |
| యజ్ఞఫలము—భాసమహాకవి | . | 299 |
| సాత్త్వికభావములు—పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | . | 3 6 |
| ఆంధ్రసంస్కృతి—నోరి నరసింహశాస్త్రిగారు | .. | 319 |
| సంసారం—పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు | | 3 3 |
| [illegible]రాగరజ్యోతి—వేలూరి [illegible] | | 341 |
| ఉగాది వందనము—పెనుమర్తి కామేశ్వర రావుగారు | | 3 0 |
| జగన్నాథపండితరాయలు విద్వద్వాగ్గేయకారుడు—కోన వెంకటరాయశర్మగారు | .. | 351 |
| ఎన్నిక ఉబలాటం—జి యస్ సూరిగారు | | 359 |
| శూన్యానికి—భట్టిప్రోలు కృష్ణమూర్తిగారు | | 36[illegible] |
| ఏకాంకిక—పీసపాటి వెంకటేశ్వర్లుగారు | .. | 365 |
| ప్రయోజకత్వం—బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావుగారు | .. | 371 |
| పక్షిరాజ!—కందుకూరి రామభద్రరావుగారు | ... | 376 |
| కలగూరగంప— | | 377 |
| గ్రంథవిమర్శనము | . | 338 |


త్రివర్ణ చిత్రము—పితృహృదయం (హిమవంతుడు-గౌరి) చిత్రకారుడు:
ముక్కపాటి కృష్ణమూర్తిగారు




| | | |
|---|---|---|
| నందన<br>చైత్రము | **భారతి** | సంపుటము 29<br>సంచిక 4 |


# ఉగాది

★


శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు


మానస హంసమా! కదలుమా! అదిగో మన 'నవ్య నంద' నో
ద్యానవనంబు, కమ్మని లతా సుమపత్ర ఫలాననంబు,
మేధానిధులైన పెద్దలు సుధామధురోక్తులతో నొసంగు స
న్మానము లందికొన్నది సుమా? అనుమానము లేదు ప్రాలుమా!

తీయని నీరు పారెడి నదీతటిఁ జల్లని పిల్లగాలిలో
హాయిగ సేయవచ్చును విహారము, చిక్కని కల్ప భూరుహ
చ్ఛాయల విశ్రమించి విసఁ జాలెద వింపుగ గున్నమావిపై
కోయిల కన్నియల్ వలపుఁ గుల్కుచుఁ బాడెడు జాలిపాటలన్.

మేలి పసిండి వన్నియల మించిన మేనుల నాలుకాలముల్
రాలుచుఁ దేలుచుండు ఫలరాసులు 'రాసులు' గోచరించు-ఈ
వాలుగరమ్ము లెమ్ము తెలవారుచు నున్నది-రాజనాలు ము
త్యాలలరారు చుండును గదా? 'నవనందన' గర్భ సీమలన్

ఆరగింతువు గాక నోరూరు రుచులతో
నోల లాడెడి రాజనాల పంట
అనుభవింతువు గాక యమృత మాధురి మించఁ
జవులూరు కామధేనువుల పాఁడి
ఆనుచుందువుగాక నానాలతాపత్ర
సుమపరీమళ ఘుమం ఘుమల హాయి
విశ్రమింతువు గాక విమల గంగానదీ
సైకతస్థలముల౯ జల్లగాలిఁ

గాంచెదవుగాక కన్నుల కఱవు దీరఁ
గ్రమ్మికొని మేలుఁ గూర్చుయోగముల మహిమ
కదలు మెదురౌనదే శుభగ్రహ మయంబు
నవకళాసదనంబు, 'నందన' వనంబు

కోమలమై, ఫలసస్య
శ్యామలమై, సత్యశాంత శమదమ గుణ సం
ధామంబై, 'నందన' వన
సీమ, సమస్త ప్రజేష్టసిద్ధుల నొసఁగు౯



# ధరల తగ్గుదల



శ్రీ పి యస్ ప్రకాశరావు

ఈ నెలనాళ్లలో తలవనితలంపుగా దేశమంతటా అన్ని వస్తువులకు (కొన్ని కంట్రోలు వస్తువులను తప్ప) ధరలు పడిపోయాయి. కొంచెం ఎరిగి పడినంత తీవ్రంగా యీ ఒడుదుడుకు సంభవించడంచేత, హోలుసేలు వ్యాపారులనేకమంది హడలిపోయి ఐపీలు అన్నారు అనేకకోట్ల రూపాయల నష్టం సంభవించింది బట్టల, నూలు వ్యాపారం, దాదాపు స్తంభించిపోయింది బొంబయి కలకత్తా మొదలగు చోట్ల నుండి బంగారు మార్కెట్లు మొన్న మొన్నటివరకూ మూసి వేయబడే ఉన్నాయి మాట నమ్మకం మీద అప్పు సొప్పు తెచ్చి వ్యాపారం సాగించే పెద్దవర్తకులలో కొందరు ఆ అప్పు తెగగొట్టారు మరికొందరు నాయిదాపై సరుకు తీసుకుంటాననేసి, వ్యాపారనీతికి విరుద్ధంగా ఆ సరుకు కొనడం విరమించుకోవడమో, కొన్న సరుకు డబ్బు యివ్వలేకపోవడమో జరిగింది

ఈ విపరీత పరివర్తనకు మిగతా కారణాల సంగతి ఎలా ఉన్నా, వ్యాపారస్తుల ప్రధాన కారణమనడం నిర్వివాదం అంతర్జాతీయ రాజకీయ వాతావరణంలో వచ్చిన మార్పుగాని, వ్యాపార రంగంలో వచ్చిన మందగింపుగాని లెక్క చేయకుండా, కొరియాయుద్ధం నాటినుండి, లాభాలు గడించడం మరిగి ఆ అలవాటు ప్రకారమే సరుకులని నిల్వ చేశారు ఎంతకాలం ఓపికపట్టి చూచినా తాము కొన్న ధరకంటె ఎక్కువ ధరకు అమ్ముకొనే దారి కన్పించలేదు ఒక్కసారి గుప్పుమన్నది

కించిత్తు దూరదృష్టితో వ్యవహరించి ఉంటే ధరలు అమాంతంగా గాక, మిగతా దేశాలలో మాదిరి క్రమేపీ తగ్గడానికి అవకాశముండేది కొరియా యుద్ధంలో పెరగడం ప్రారంభమై 1951 ఏప్రిల్, మే నెలల్లో ఆకాశాన్నంటిన ధరలు 51 జూన్ నెలాఖరులో సోవియట్ రష్యా కొరియాయుద్ధవిరమణ ప్రతిపాదించిన క్షణంనుండీ కొంచెం తగ్గుముఖం చూపాయి ఈ ప్రతిపాదన వచ్చిన మరునాటికే, వివిధదేశాలలో యుద్ధావసరమైన ముడిసరుకుల ధరలు ఒక మెట్టు దిగాయి

నైజాపై దాడిచేసి ప్రపంచయుద్ధం తెచ్చిపెడతాడనుకొన్న జనరల్ మెకార్థర్ బర్తరఫ్ కావడం, ఆ తరువాత కొరియాలో యుద్ధవిరమణ జరగడం, ఫాన్‌ముంజా ఆన్ సంధిసంప్రదింపులు ఫలిస్తాయని పదేపదే అమెరికన్ నాయకులు ప్రకటిస్తూండడం వీటన్నింటివల్ల కొరియాలో తిరిగి యుద్ధం రగులుకోవచ్చునని, అసలు వచ్చినా మునుపటంత భారీ ఎత్తున జరగదని ఒకవిధమైన నమ్మకం యేర్పడింది. కొరియాయుద్ధమూ, దాంతోపాటు, అంతర్జాతీయ ఉద్రిక్తత సడలుకపట్టడంతో, యుద్ధావసరాల నిమిత్తం అయినకాడికి తెగబడి సరుకులు కొనటం అమెరికా తగ్గించింది ఆర్థిక చిక్కులవల్ల బ్రిటన్‌గూడా అమెరికాను అనుసరించింది పైపెచ్చు యీ ఉభయ దేశాలు, లోగడ తాము కొన్న ముడిసరుకులను, వస్తువులను, తిరిగి అమ్మివేయడం గూడా సాగించాయి. ఏ సరకైనా, ఎంత ధరైనా మిగతా దేశాలకు అందకుండా కొని నిల్వచేసే అమెరికా మార్కెట్ పోటీ నుండి తప్పుకోవడంతో సరకులకు గిరాకీ తగ్గటం సహజం దీనికితోడు ముఖ్యావసరమైన ముడిసరకుల ఉత్పత్తిగూడా హెచ్చింది 1950 - 51 కంటె 51 - 52 లో రాగి 5%, ఇనుము ఉక్కు 10%, బొగ్గు 10% తుత్తునాగం 5% సహజంగా లభించే రబ్బరు 150 వేల టన్నులు, కృత్రిమపు రబ్బరు 8 లక్షల టన్నులు అధికంగా ఉత్పత్తి అయినాయి అటు యూరప్‌లో ఫ్రాన్సు జర్మనీలు, యిటు దూరప్రాచ్యంలో జపాను పారిశ్రామిక దేశాలుగా తిరిగి తల ఎత్తుతున్నాయి కొరియాయుద్ధం మూలంగా బలపడిన జపాను ఉత్పత్తి, యిందుమించు రెండవప్రపంచ యుద్ధాత్పూర్వపుస్థాయికి వచ్చింది ఇలా ముడిసరుకుల సప్లై, పారిశ్రామిక వస్తూత్పత్తి పెరగటంవల్ల ఏ దేశానికాదేశం ఎగుమతి వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకోవడానికి దిగుమతులను తగ్గించుకోవడానికి మొదలెట్టాయి

అమెరికా బ్రిటన్‌లు సహా అనేక దేశాలు చీప్ మనీ పాలసీలకు స్వస్తిచెప్పి, బ్యాంకు రేట్లను పెంచటంతో, మార్కెట్లో పరపతి బిగిసిపోవడం, యూరప్ దేశాలలో వ్యాపార లావాదేవీల చెల్లింపు గడ్డు సమస్యగా తయారవడం యిత్యాదులన్నీ ధరల తగ్గుదలకు దోహదంచేశాయి

1951 ద్వితీయార్థ భాగంనాటి ధరలకు 1952 ఫిబ్రవరినాటి ధరలకు పోల్చిచూస్తే పత్తి ధర 21%

ఉన్ని 59% రబ్బరు 58% జనపనార 60% చొప్పున భాగా తగ్గిపోయినట్లు స్పష్టమౌతుంది ఈ తగ్గుదల క్రమేపీ సంభవించిందన్న సంగతి గమనించాలి

కాని మనదేశంలోమటుకు యిందుకు విరుద్ధంగా ఒక్కసారి అమాంతం పడిపోయాయి ఈ పడిపోవడానికి పైన పేర్కొన్న అంతర్జాతీయ వ్యాపార పద్ధతులేగాక, మన దేశపరిస్థితులు గూడా కారణం ఇంతవరకు మనదేశంలో చీప్ మనీ పాలసీ అమలులో ఉండి తక్కువ వడ్డీకి బ్యాంకులు ఎంతకావలిసే అంతా రిజర్వుబ్యాంకువద్ద తెచ్చి, లేక ఎప్పుడుబడితే అప్పుడు ప్రభుత్వ ఋణపత్రాలు అమ్మి వ్యాపారానికి మదుపుపెట్టాయి బ్యాంకులు విరివిగా అప్పులివ్వడంచేత తాహతుకుమించిన స్పెక్యులేషన్ దేశంలో తలెత్తింది ముడిసరకులలో మొనాపాలీ ఉన్నంతవరకూ అమెరికా భారీ కొనుగోలుదారుగా మార్కెట్లో నిలబడ్డంతవరకూ, యీ స్పెక్యులేషన్ నిరాఘాటంగా సాగింది అటు అంతర్జాతీయ వ్యాపారరంగంలో అమెరికా నక్కుతగ్గడం, యిటు రిజర్వుబ్యాంకు వడ్డీ రేటు పెంచి పరపతిని పరిమితం చేయడం స్పెక్యులేటర్లకు కొంత చిక్కు తెచ్చిపెట్టింది

1951 నవంబరులో రిజర్వుబ్యాంకువడ్డీరేటును 3% నుంచి 3½ % కు పెంచింది అనవసరంగా విరివిగా దేశంలో డబ్బు లభించకుండా చేయడమే యిందలి ఉద్దేశ్యం అవసరమైన వ్యాపారానికి మాత్రమే అప్పులిస్తు స్పెక్యులేషన్ తగ్గేట్లు చూడవలసిందని కూడా రిజర్వుబ్యాంకు షెడ్యూల్డుబ్యాంకులను ఆదేశించింది షెడ్యూల్డుబ్యాంకుల వద్దనున్న గవర్నమెంటు సెక్యూరిటీలను, యిదివరకులా కొనటం జరగదని కూడా రిజర్వుబ్యాంకు స్పష్టం చేసింది ఇక రిజర్వుబ్యాంకువద్ద తెచ్చి, సరకుల హామీపైనైనా, వ్యాపారస్థులకు అప్పులు పెట్టడం షెడ్యూల్డు బ్యాంకులకు కష్టమైపోయింది రిజర్వు బ్యాంకు రేటుతోపాటు బ్యాంకులు కూడా వడ్డీ రేట్లు పెంచాయి దీనికి తోడు, అమెరికా అప్పుగా యిచ్చిన 20 లక్షలగోధుమను అమ్మకంతో, మార్కెట్లో ధలావణినుంచి సుమారు 70 కోట్ల రూపాయలు ప్రభుత్వ ఖజానా చేరాయి ఈవిధంగా దేశంలో డబ్బుకు కటకట అయింది అటు అంతర్జాతీయ వ్యాపారంలో మాంద్యం ఏర్పడడంచేత మన ఎగుమతి వ్యాపారం స్తంభించిపోయింది ఇంతవరకు మనమొనాపాలీ అనుకొన్న ముడిసరకులలో గూడా విదేశపోటీ తలెత్తింది కృత్రిమపునారతో వస్తువులు తయారవడము, నారసంచులకు బదులు కాగితపుసంచులు వాడుతుండడంవల్ల నారవస్తువులకు గిరాకీ తగ్గింది నారవస్తువుల ఎగుమతిపై ప్రభుత్వం పన్ను తీసివేసినా యీ వ్యాపారం పుంజుకోలేదు నారవస్తువులకు గిరాకీ తగ్గటంచేత, ముడినారకు ధర పడిపోయింది పాకిస్తాన్లో నిరుడు మణుగు రూ 105 లు అమ్మిననార యివాళ 43 రూపాయలకు యిస్తామన్నా కొనే దిక్కులేక మురిగిపోతున్నది

చైనా అర్జంటీనా యీజిప్టు ఆఫ్రికాల పోటీవల్ల, నూనెల ఎగుమతులపై అమెరికా నిర్బంధాలను తొలగించడంవల్ల, నూనెగింజల వ్యాపారం దెబ్బతిన్నది అమెరికా ఈజిప్టు టర్కీ మెక్సికో మొదలైన దేశాలలో ప్రత్తి విస్తారంగా పండించడంవల్లనూ, ప్రత్తిధర పడిపోయి బట్టల ఎగుమతివ్యాపారం సనుకబట్టింది ప్రత్తి విషయంలో మరో విచిత్రమేమంటే, ఇండియా యేటా పాకిస్తాన్ నుంచి ప్రత్తి వచ్చే అవకాశం కన్పించనందున ఎక్కువధరకు అమెరికా ప్రత్తికోసం మన మిల్లులు ఆర్డరిచ్చాయి నిగూఢ అభిప్రాయాలతో వంటి మాత్రమే దిగుమతి అవడంచేత యీ యేడు కావలసినదానికన్నా రెట్లు ఆర్డరిచ్చాయి ఆర్డరిచ్చినంత దిగుమతి అయింది ఫలితం ఏ రేవులో చూచినా ప్రత్తి మురిగిపోతున్నది ఎగుమతి వ్యాపారానికి ఇలా దెబ్బ తగలడంతో యీ సరకుల స్పెక్యులేషన్కు అలవాటుపడి అనాయాసంగా కోటీశ్వరులం కావచ్చునని ఆశకొద్ది, అధికధరకే కొని నిల్వచేసిఉంచినవారి స్థితి యిరకున పడింది కొత్తబడ్జెటులో ఎగుమతి పన్నుల భారమేమైనా తగ్గుతుందేమోనని ఆశించారు కాని ఆ ఆశ నిరాశే అయింది ఒకవైపు వ్యాపారం పడిపోవడం, మరోవైపు అప్పు చెల్లించమని, లేదా యింకా ఎక్కువధరకు హామీగా ఉంచమని బ్యాంకులు చేస్తున్న వత్తిడిచేయడం, కొత్తబడ్జెట్ ఆశ నిరాశ చేయడం వీటన్నింటికీ తట్టుకోలేక, తమవద్ద నిల్వ ఉన్న యావత్తు సరకును ఒక్కసారి అమ్మకానికి ఎగవేసి తెగనమ్మజూచారు కాని కొనేదిక్కులేక ధరలు వేగంగా పడిపోసాగాయి ఈ దుస్థితి ముఖ్యంగా నూనెగింజల వ్యాపారానికి సోకి, వెండి బంగారాలువంటి వివిధవ్యాపారరంగాలకు ప్రాకింది వెండి బంగారాలు ధరలు తగ్గడానికి కారణం, అందులోను స్పెక్యులేషన్ విపరీతంగా ఉండడం, యీ దేశంలో ధర హెచ్చుగా ఉన్నందున విదేశాలనుండి దొంగతనంగా చాలా బంగారం (1951 సం॥లో 630 ఔన్సులు దిగుమతి ఐనట్లు) దిగుమతి అవడం బంగారం ధరతోపాటు వెండిధర తగ్గింది ఈ రెండింటి ధరలు పడిపోవడంతో, స్టాకులు షేర్లుపడిపోయాయి దేశమంతటా పెద్ద కలవరం బయలుదేరింది సహజకారణాలవల్ల కొన్నింటికి ధరలు పడిపోతే, కలవరంవల్ల మిగతావాటి ధరలు పడ్డాయి స్పెక్యులేషన్లో పుట్టిన కలవరం

# దేశోద్ధారక వర్ధంతి



ఈ ఏప్రియల్ 6 వ తేదీఖు (చైత్రశుద్ధ ద్వాదశి ఆదివారం) విశ్వదాత, దేశోద్ధారక, కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి వర్ధంతి ఆంధ్రదేశమంతటా జరుపబడింది కళాప్రపూర్ణుని సాహిత్యోపాసనకు ప్రత్యక్ష ఫలితము 'భారతి" ఆ తండ్రి దీవనలు నిత్యము భారతిని వృద్ధిపొందించుగాత!

సర్వత్రా వ్యాపించింది ప్రతిచోటా కొనుగోలు లేక ఎక్కడి సరకక్కడ స్తంభించిపోయింది కొనుగోలు లేనందున ఆహారధాన్యాల ధరలు, గూడా బాగా పడిపోయాయి

ఈ విధంగా విదేశీవ్యాపారమాంద్యం, మితిమీరిన స్పెక్యులేషన్, బ్యాంకువడ్డీరేటు పెరిగి పరపతి బిగిసిపోవడం అరిపోతున్నామనే కలవరం- ఇటువంటి సమష్టిప్రభావమే ధరల తగ్గుదలకు కారణం దీనికిది కారణమని విడదీసి చెప్పడం కష్టం

ధరలు తగ్గిపోతుండటం చూచి కొందరు ఆర్థికమాంద్యం వస్తుందని జోస్యం చెప్పారు

1951 సంవత్సరం ప్రమాదం నాటికీ, యిప్పటికీ పోల్చిచూస్తే ధరలు బాగా తగ్గినమాట వాస్తవమే గాని, అవి యింకా కొరియాయుద్ధపూర్వస్థాయికి రాలేదన్న సంగతి గమనించాలి స్పెక్యులేషన్ వ్యాపారులు విపరీతంగా పెంచిన ధరలు మాత్రం పడిపోయినమాట అదైనా హోల్ సేల్ స్థాయి సరకులకే గాని, చిల్లర వర్తకం సరకులకు తగ్గలేదు ఈ ఒడుదుడుకులలో యెందరో కొద్దిమంది వ్యాపారులు నష్టపడటం జరిగింది కాని జనసామాన్యానికి లాభించింది అట్టే లేదు

అంతర్జాతీయ పరిస్థితుల్లో మళ్లీ మార్పువచ్చినా అమెరికా తిరిగి సమరసామగ్రికొనడం ప్రారంభించినా, ఉత్తర అట్లాంటిక్ రాజ్యాల సన్నాహాలు తీవ్రతరమైనా మళ్ళీ స్పెక్యులేషన్ తలయెత్తటం, ధరలు పెరగడం తథ్యం ఇప్పుడు లభించిన యీ అవకాశాన్ని వినియోగించుకొని, కొరియాయుద్ధపూర్వపు స్థాయిలో ధరలను స్థిరీకరించడానికి ప్రభుత్వం గట్టిగా ప్రయత్నించాలి

ఆహారం విషయంలో లోటు భర్తీచేసుకోవడానికి గాని పారిశ్రామికాభివృద్ధికి కావలసిన యంత్రసామగ్రి దిగుమతి చేసుకోవడానికిగాని, అనేకకోట్ల విదేశద్రవ్యం అవసరం ఇందుకు ఎగుమతి వ్యాపారం శాశ్వతంగా ఉండి యితర దేశాలతో పోటీకి నిలవగలగాలి ఇప్పటికే, మనం తప్ప యింకెవరూ ఉత్పత్తి చేయలేరనుకొన్న ముడిసరకులకు ప్రత్యామ్నాయంగా కృత్రిమపు ముడిసరకులు తయారుచేస్తున్నారు జనుకను నీలిమందు వ్యాపారం యిలాగే పాడైంది వస్త్రాలవ్యాపారంలో గూడా జపాను పోటీ తీవ్రం కావటం తథ్యం

విదేశాలలో మన సరకులు అమ్ముడుపోకపోవడానికి ప్రభుత్వం ఎగుమతిపన్నులు విధించడం, ఒకాలంలో ఆయా దేశాలకు ధారాళంగా కోటాలు నిర్ణయించకపోవడము అని వ్యాపారస్థులు అంటున్నారు ఇందులో కొంత సత్యం ఉండవచ్చుననే, యిటీవల ప్రభుత్వం వేరుశనగపై ఎగుమతిపన్ను రద్దుచేసింది ఉన్నిపై పన్ను బాగా తగ్గించింది ఎగుమతి వ్యాపారాన్ని పోషించుకోడానికి, అవసరమైతే, మిగతా ముడి సరకులపై గూడా ఎగుమతిపన్ను రద్దు చేయటంతో పారిశ్రామికంగా బాగా అభివృద్ధిలోకి వచ్చేంతవరకూ ఆయా ముడిసరకులను మనం ఉపయోగించుకోలేక యితరదేశాల కొనుగోలుపై ఆధారపడి ఉండాల్సిందే కదా

వ్యాపారరంగంలో వస్తువుల సప్లై—వాటి గిరాకీనిబట్టి ధరలు నిర్ణయం గాకుండా మార్కెట్టులో యేవస్తు సరకూ ఒక్కసారిగా కొని ధరలు పెంచడం, ఒక్కసారిగా విడుదలచేసి ధరలు తగ్గించడం, యీ రకం స్పెక్యులేషన్— ప్రజలకు, మామూలు వర్తకులకు గూడా నష్టదాయకం కాబట్టి దేశీయవ్యాపారంలో గాని, విదేశీవ్యాపారంలో గాని యీ స్పెక్యులేషన్ను నిషేధించడం మంచిది

దేశంలో డిఫ్లేషనరీపరిస్థితులు పరిశ్రమాభివృద్ధికి దోహదం కావు నిరుద్యోగం ప్రబలుతుంది వ్యాపారం మందగిస్తుంది కనుక స్పెక్యులేషన్ నిమిత్తం గాక, యథార్థ వ్యాపారావసరాలున్నవారికి సులభంగా పరపతి పుట్టేట్లు చేయాలి ప్రధాని నెహ్రూ అన్నట్లు ఈ ధరల మాంద్యం ఉత్పత్తిపై దెబ్బదీయకుండా చూడాలి ఉత్పత్తి దెబ్బతింటే నిరుద్యోగం ప్రబలుతుంది సరసమైన ధరలకు సమాజంలో ఉన్నవారందరికీ సమానంగా వస్తువులు లభించేటట్లు చేయగలగాలంటే సరిపోయినంతగా ఉత్పత్తిచేయడం అవసరం ఇందుకు ధరలలో తీవ్రమైన ఒడుదుడుకులు లేకుండా, ఒక స్థాయిలో నిలకడగా ఉండడం ఎంతైనా అవసరం

---

# ప్రపంచ కథా బహూకృతి- ★

# శ్రీ పాలగుమ్మి పద్మరాజు

ప్రపంచ కథానికలపోటీలో పాలగుమ్మి పద్మరాజుగారికి ద్వితీయ బహుమానం వచ్చిందని గత మార్చి 16వ తేదీ ఆంధ్రపత్రికలో ప్రకటించిన వార్త ఆంధ్రజాతి కంతటికీ మహదానందం కలిగించింది. టాగూరు మహాకవి నోబెల్ బహుమానం అందుకున్న తరవాత మనదేశంలో వాఙ్మయంలో ఎవరికీ ఇంతటి బహూకృతి, గౌరవము లభించలేదు. బహుముఖాలుగా నిరుత్సాహంగా ఉన్న వర్తమానాంధ్రదేశ చరిత్రలో ఈ బహూకృతి ఆంధ్రులందరు గర్వించదగిన విషయం.

అసలీ ప్రపంచ కథానికలపోటీ న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రిక తలపెట్టి నిర్వహించింది. భారతదేశం తరఫున హిందూస్థాన్ టైమ్సు సంపాదకులీ పోటీ జరిపారు. ఆంధ్రదేశం తరఫున ఆంధ్రపత్రికా సంపాదకులీ పోటీ నిర్వహించిన విషయం తెలుగువారందరికీ తెలిసినదే. ఆంధ్రపత్రికా సంపాదకు లేర్పరిచిన నిర్ణేతలు తెలుగు కథల్లో నాలుగు ఉత్తమమైనవని నిర్ణయించి ఈ నాలుగూ మొదట భారతకథలపోటీకి పంపించారు. మొట్టమొదట ఈ కథకులకు నలుగురికీ ఆంధ్రపత్రికా సంపాదకులు నూరేసి రూపాయల బహుమతు లేర్పరచారు. పద్మరాజుగారి గాలివాన మొదట ఈ గౌరవం అందుకున్నది. ఇలాగ భారతదేశంలో అన్ని రాష్ట్రాల వారూ అఖిలభారత కథలపోటీకి నాలుగేసి కథలు పంపించారు.

హిందూస్థాన్ టైమ్సు సంపాదకు లేర్పరిచిన నిర్ణేతలు భారతదేశ కథలన్నిటిలోను రెండు కథలు ఉత్తమోత్తమమైనవని నిర్ణయించి ఈ రెండు ప్రపంచ కథానికల పోటీకి పంపించారు. అఖిలభారత నిర్ణేతలీ రెండింటిలోను 'కళ్లు' అనే కథకు మొదటి బహుమతీ ఇచ్చారు. పద్మరాజుగారి గాలివానకు రెండవ బహుమతీ వచ్చింది. రెండవసారిగా పద్మరాజుగారి కథకు మళ్ళీ వెయ్యి రూపాయల బహుమానం వచ్చింది.

న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ జరిపిన ఈ పోటీలో 28 దేశాలు పాల్గొన్నాయి. ఆయా దేశాలలోని ప్రధాన ప్రచురణసంస్థలీ పోటీ నిర్వహించాయి. మొత్తం దీనికి 59 కథలు వచ్చాయి. ఈ పోటీలో పాల్గొన్న దేశాల అధిక సంఖ్యాక నిర్ణయం ప్రకారం ప్రథమ బహుమతీ నిర్ణయించాలనీ, ఆ నిర్ణయాన్ని అనుసరించి మొదటి బహుమానం 5 వేల డాలర్లు ఇవ్వాలనీ హెరాల్డ్ ట్రిబ్యూన్ నిర్ణయించింది. ఈ పోటీ ఏర్పాటుచేసినది అమెరికా దేశమే కనక అమెరికా కథకులెవరు దీనిలో పాల్గొనకూడదని హెరాల్డ్ ట్రిబ్యూన్ నిర్ణయించింది. ఇదీగాక ఏ దేశము తన కథకు వోటు వేసుకోకూడదని కూడా ఒక నిర్ణయం జరిగింది.

అయితే 1951 సంవత్సరాంతంలో జరిగిన ఈ పోటీనిబట్టి ఏ ఒక్క కథకు ఉత్తమబహుమతి రాలేదు. అందుచేత రెండేసి ఓట్లు వచ్చిన నాలుగు కథలకు ఈ బహుమతీ సమానంగా పంచారు. 'ఎందుకు' అన్న కథకు ఐర్లండ్ జర్మనీలు ఓట్లు వేశాయి. ఇండియా హాలెండులు 'అయిదవరోగి' అనే కథకు ఓట్లు వేశాయి. 'ప్రేమ నా చిన్ననాటి కలలు చీల్చివేస్తుంది' అనే కథకు స్వీడన్ డెన్మార్కుల ఓట్లు వచ్చాయి. ఇజ్రాయెల్, గ్రీసులు 'నిద్రపోయే సంచీ' అనే కథకు ఓట్లు వేశాయి. ఇందుచేత ఈ కథలు నాలుగింటికీ 1050 డాలర్ల బహుమతీలు సమానంగా పంచారు. మిగిలినవి 14 కథలు. ఈ కథలన్నింటికీ ఒక్కొక్క ఓటు వచ్చింది. పాలగుమ్మి పద్మరాజుగారి కథకు ఆస్ట్రియా ఓటు వేసింది. ఈ పైన ఈ 14 కథలలోను మళ్ళీ ఉత్తమ కథ ఏదో నిర్ణయించవలసిందని మరి ఇద్దరు నిర్ణేతలను ఏర్పాటు చేశారు. మిగిలిన కథ లన్నింటిలోను పాలగుమ్మివారి 'గాలివాన' సర్వోత్తమంగా ఉన్నదని నిర్ణయించారు. అందుచేత మొత్తం 5 వేల డాలర్ల బహుమతిలోను మిగిలిన 8 వందల డాలర్లు పద్మరాజుగారికి బహూకరించడానికి నిర్ణయించారు.

ఈ నిర్ణయాన్ని గురించి పోటీనిర్వాహకులు ఒక ప్రకటనచేస్తూ 'గాలివాన' నిజంగా శ్రే

పరీక్షలో నిలబడి 14 గొప్ప కథలలో ఉత్తమోత్తమ కథగా నిర్ణయింపబడినదనీ, పై నాలుగు కథలకు గాను వేసిన ఓట్లు రావడంవల్ల పద్మరాజుగారి కథకు ప్రథమ బహుమతి పంచడానికి వీలులేకపోయిందనీ కేవలం ప్రజాస్వామ్యసూత్రాలనుబట్టి మాత్రమే ఇలాగ నిర్ణయించవలసివచ్చిందనీ అన్నారు. ఈ విధంగా పద్మరాజు 'గాలివాన' జాతీయాంతర్జాతీయాలైన గాలివాన లెన్నో గడిచి ప్రపంచ కథాభిమానుల హృదయాలు చూరగొన్నది.

## పాలగుమ్మి పద్మరాజుగారు

పాలగుమ్మి పద్మరాజు గారు ఆంధ్రపాఠకులకు చిరపరిచితులే. వీరి వయస్సు 36 సంవత్సరాలు. ఇప్పుడు వీరు భీమవరం కళాశాలలో కెమిస్ట్రీ లెక్చరరుగా పనిచేస్తున్నారు. బెనారస్‌లో ఎమ్. ఎస్‌సి. చదివారు. అటుతరువాత కొంతకాలం పిఠాపురం రాజా కళాశాలలో పనిచేశారు.

చాలాకాలంనుంచి వీరు కథలేగాక కవిత, నాటకాలు, వ్యాసాలు, విమర్శలు మొదలైన ఎన్నో రచిస్తున్నారు. వీరి ఖండకావ్యాలు కొన్ని సుప్రసిద్ధ సారస్వత పత్రికలు ప్రకటించాయి. పురిటిపాట, రాలి విమానం, చీకటి మొదలైనవి వీరికవిత రచనల్లో ముఖ్యమైనవి. చక్కని నిజాయితీ, విస్పష్టత, వీరి కవితలో ప్రత్యేక గుణాలు. వీరి కవితా రచన చాలా స్వతంత్రమైన పంథాలో నడిచిపోతుంది. అధునాతన కవితామార్గంలో వీరిది ప్రత్యేక వ్యక్తిత్వం ఉన్న కవిత. చాలాకాలం కిందటే వీరు అరవిందుని '*Love and Death*' అనే కావ్యం కూడా అనువదించారు.

ఇంతకుపూర్వం వీరు ఆంధ్ర వారపత్రికలో టర్గినీవ్ వ్రాసిన ఫాదర్స్ అండ్ సన్స్ అనే నవల తెలుగులోకి అనువదించారు. ఇల్లాగే ఇంకా ఒకటి రెండు చిన్న నవలలు కూడా వీరు భాషాంతరీకరించారు. ఇంతకుపూర్వం వీరు రచించిన కథలన్నీ 'హాలిజవం' అనే పేరుతో ఇంతకుపూర్వమే వెలువడ్డాయి.

ఒకసారి ఆలిండియా రేడియో వారు జరిపిన రేడియో నాటికల పోటీలో కూడా వీరికి బహుమతి వచ్చింది. ఈయన రచించిన నాటికలొకటి రెండు ప్రదర్శించారని కూడా తెలుస్తున్నది.

ఇలాగ వీరి రచన ఎక్కువగా బహుముఖాలుగా సాగినా నవలా, కథారచనలో వీరికి ఎక్కువ అభినివేశం ఉన్నట్టు కనబడుతుంది. పద్మరాజుగారు రచనలో ఎక్కువగా వాస్తవిక పద్ధతి అవలంబిస్తారు. వీరి రాజకీయదృక్పథం మానవతావాదం (*Human-ism*) వైపు బాగా మొగ్గుతుంది.

## గాలి వాన

దేశీయ విదేశీయ విమర్శకుల మన్ననలందుకున్న వీరి కథను గూర్చి వేరే ప్రత్యేకంగా వ్రాయవలసిన పనిలేదు. ఈ కథ పూర్వం ఆంధ్రపత్రికలోనే గాక ఇటీవల [illegible] 19 వ తేదీ ఆంధ్ర వారపత్రికలో కూడా పడింది. అందుచేత తెలుగు పాఠకులందరికీ ఈకథ సుపరిచితమైనదే.

ఈ కథలో రావు మనస్తత్వము ముఖ్యమైనదనే మనిషి మనస్తత్వము పాఠకులకు చాలా సునిశితంగా గోచరిస్తాయి. రావు ఒక సూత్రబద్ధంగా నడిచిపోయే వ్యక్తి. గాలివానలో ఇతని సూత్రాలన్నీ పటాపంచలైపోతాయి. ఇంతటప్పుడు ఇతనిలో మానవత్వం స్ఫుటంగా వికసిస్తుంది. కథ ముగిసేసరికి రావుతోబాటు పాఠకులకు కూడా [illegible] [illegible] ఈసడించే మనిషిగాడే ఎక్కువగా సానుభూతి కలుగుతుంది. గాలివానతాకిడికి మానవుల మనస్సులలో కట్టుకున్న బాహ్యసూత్రాలు తెగిపోయేవిధాను కథ ప్రారంభంనుంచీ మనకు వ్యంగ్యంగా స్ఫురిస్తూనే ఉంటుంది. ఈ కథలో కల్పన, సంఘటన, ప్రధానభావము ఒకేమూసలో కరిగిపోసినట్లు చక్కని సమన్వయంతో నడిచిపోతూంటాయి.

నేటి తెలుగువాఙ్మయం ఏ శాఖలోను తదితర భారత వాఙ్మయాలకు తీసిపోదనీ, కొన్నింటిలో ఇదే అగ్రస్థానం వహించగలదనీ బహు భాషావేత్తలైనకొందరు విమర్శకులంటున్నారు. పద్మరాజు గారి కథ భారత భాషల్లోనే గాక ప్రపంచభాషల్లో కూడా తెలుగుభాషకు గౌరవం సంపాదించింది.

దరిదాపుగా అర్ధశతాబ్దంనుంచి తెలుగులో వెలువడిన ఉత్తమకథలు కొన్ని ఆంగ్లభాషలోకి భారతీయ భాషల్లోకి అనువదించకపోవడంవల్లనే నేటి తెలుగు కథా స్వరూపం విదేశీయులకు స్పష్టంగా అవగాహన కాగల అవకాశాలున్నాయి. ఈ బహుమతి ఇటువంటి ప్రయత్నానికి బాగా ప్రోత్సాహం కలిగించ గలదని ఆశిస్తున్నాను.

పద్మరాజుగారింకా యువకులే. క్రమంగా వీరు ఆంధ్రులకు నోబెల్ బహుమాన గౌరవంకూడా సంపాదించగలరని ఆశిస్తున్నాను.

'శాస్త్రి'

# యజ్ఞఫలము

భాసమహాకవి సంస్కృతనాటకమునకు ఆంధ్రీకరణము

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

(గత సంచిక తరువాయి)

విష్కంభము!!!

(ముగ్గురు ఋషి శిష్యులు ప్రవేశింతురు)

మొదటి

"బ్రహ్మఋషి యైన కౌశికుక్రతువు వేడ
పూర్తియైనది కౌమ్యసంపూర్ణుడగుచు,
తత్ఫలంబున నిర్భయత్వంబుతోడ
మనము మనుచుంటిమి సత్తపోవనమునందు"

గంధవ మిత్రమా! శాంకాయనా! ఈ యజ్ఞఫలము శుభప్రదమే యైనది. నీ వన్నట్లిక నిర్భయముగా మనము తిరుగగలము

కాలం గాలవా! ఈ తపోవనమున మారీచుడు మున్నగు రాక్షసులు విశ్వామిత్రాదులను దక్క మన వంటివారి జోలికి రాకపోయినను మనకు మిక్కిలి భయముగా నుండెడిది

మూడవ విశ్వామిత్రాదులనే కాని యన్యులను వారేల పీడింపరైరి?

గాలవ కౌమార్యాయనా! విశ్వామిత్రుడు పూర్వము క్షత్రియుడు తపముచే బ్రాహ్మణత్వము నందెను అప్పటినుండియు వారతడు చేయు తపమును వారు సహింప జాలరైరి

కౌమార్య ఐనను, రాక్షసులు తపోవిఘ్నము కలిగింప గారణ మేమో?

గాల రాక్షసరాజైన రావణుడు విశ్వామిత్రుని తపోభంగమునకు వారిని నియమించి యుండెను

కౌమార్య రావణునకు విశ్వామిత్రునిపై గోప మేల?

గాల విశ్వామిత్రుడు బ్రహ్మతేజమున బ్రకాశించుచున్నాడని

కౌమార్య ఐన?

గాల ఏనాటికిని విశ్వామిత్రునకు గోపము రప్పించినచో తమ ప్రభావ మగు నాతని బ్రహ్మర్షిత్వము పొల్లుపోగలదని

కౌమార్య ఆయన శాపముచే నీ రాక్షసుల నివారింప లేదేమి?

గాల కోపించిన గాని శాపము రాదుకదా!

కౌమార్య ఎందరో ఋషులు శపించినవారు గలరు వారి బ్రహ్మర్షిత్వమునకు లోపము రాలేదే?

గాల పరంపరాప్రాప్త బ్రహ్మర్షిత్వమున వారప్పు డిచ్చిన శాపముల వలన లోపము కలుగదు ఇతని దచిరప్రాప్త బ్రహ్మర్షిత్వము కావున లోపము కలుగవచ్చును అందుచే విశ్వామిత్రుడు రాముని గొని వచ్చినాడు

కౌమార్య ఏమో! ఇంతటివాడే క్షత్రియ కుమారుని సాయ మపేక్షించినాడన నాతని తపోమహత్త్వమునకు లోపము కాదా?

కాలం కాదు కాదు వినుమ!

"యజ్ఞసంరక్షణంబున కౌశికముని
రామచంద్రుని గొని తెచ్చి ప్రేమతోడ
దివ్యములగు నస్త్రముల మంత్రదీపితముగ
నతని కుపదేశమిచ్చి కార్యంబు గాంచె"

ఇక, రాముడో

"హరిగిమవాన, బాలరవి
యందపు మోమున, వాణియాను-
క్ష్వరణిని, వార్ధికిడుగు బ్ర
కస్తగభీరత మన్మథుంను సుం
దరత, నలంఘ్యతన్ దుహిన
ధాత్రిధరంబు, మహాపరాక్రమ
స్ఫురణ నతండు దేవపతి
పూర్ణపరాక్రమ గర్వహేతియై."

“ఇతఁడు వచ్చినదాదిగా సిద్ధపోవ
వనమనోవర్తన కుతపోవనమ్ముగాఁగ,
కాంచఁగంటిమి కన్నులుగలఫలంబు
నితని ప్రాగ్జన్మకృతిని గాంచి యుంపుమీఁద”

గాల రాము మహోగ్రపరాక్రమ బలశాలి ఏలన, రాక్షసులు మాయారూపధరులై రాగా నాతఁ డొంటిగిగా నిలిచి యజ్ఞము రక్షించినాఁడు రాక్షసు లాతని జూడగనే పాఱిపోవుటచే వారికు వారి కందఱినీ జంపవలసిన పనియే లేకపోయెను మఱియు మారీచ సుబాహులు రావణాసురుని యను చరులలో మహాబలవంతులు వారు నిత్యము విశ్వామిత్రుని ద్వణసమానునిగా జూచెడివారు ఒక్క యస్త్రమున వారి నిద్దఱ వారిని కొట్టగా నది వారిని త్రిప్పి త్రిప్పి సముద్రమున పంచివేసెనట

శౌమ్య ఈతను తాటకి యను రక్కసిని జంపుట నిజమా?

గాల నిజమే

“సదయుండై సుమసన్నిభాస్త్రమున ర
క్తస్రుతిని గోనేయగా
నదిస్వేదంబును గ్రక్కుకొంచు బరమా
యాసంబునన్ రాగ ద
న్యదరున్ ద్రుంపగ రాము, డామె కర ఖి
న్నంబైన దేహంబుతో
విదితాక్రంబడికూలె రాక్షసులకున్
వెన్ భీతి వాటిల్లగన్

ఇట్లు

“మృదులమును గతినంబుగా మదిచెలంగు
మత్తమును రామచంద్రుడో మహాచేయ,
చిత్రచరితులు తలప విశిష్టులైన
మానవోత్తము లతిగూఢమతులు వ్రతులు”

కాలం కేవలము దయచేతను కార్యముచేతనే కాదు రామ లక్ష్మణులు పూజనీయులగుట ఋషిగణ విశిష్టమైన వారి ప్రతిత్వము ప్రశంసనీయము

శౌమ్య రాజపుత్త్రుల నందఱును స్తుతించు వారే వారి కప్పుడును చక్కని కమ్మని భోజనము, దాసులసేవ, తలిదండ్రుల లాలనము, వైద్యుల యుప చారములు, క్షేమతో గొట్టక తిట్టక విద్య నేర్పు గురు వులు, ఇంక వారికి జదువు వచ్చుటలో వింత యేమి? నేను రోగము వచ్చినను మానక గురుసేవ నిత్యము చేయుదును. భిక్షకై పోవుచు చేయుందును దానం బట నది కొంత లభించిన నంతలోనే జీవయాత్ర గడ పుదును గురువులు నన్ను గతినముగా శిక్షింతురు కేలమీద నే పసిక చదువుటకే యవకాశము లేని నిత్య కృత్యములు ఇట్టి నా దల్పవిద్య, అట్టివాని దధిక విద్య నా విద్య నెవరును స్తుతింపరు రాజపుత్త్రుల నందఱు స్తుతించువారే

గాల ఓరీ! మూర్ఖా! గురువుల నాక్షేపింప రాదు

శౌమ్య నిజమైనమాట చెప్పితినే కాని యాక్షేపింప లేదు

కాలం యథార్థ నిందాకరమైన వాక్యము సత్య మైనను బలుకరాదు వినరాదు గురువు లహాలోచిత గా నే పనియు చేయరు

శౌమ్య గురువులు స్వలాభ మపేక్షింతురే కాని గుణ మపేక్షింపరు

కాలం ఓరీ! మూర్ఖా! నీ మాటలు నాస్తిక ములు నే నిక వినజాలను.

శౌమ్య సత్యవచనములు నాస్తికవచనములని నిరాకరింతువా?

కాలం అజ్ఞానచేతస్కులు హేతువు మాపి నను నూరకుండిరు (చూచి) ఆహా! రామలక్ష్మణులు తిన్ననుసరింప విశ్వామిత్రు లిటకే విచ్చేయు చున్నారు

గాల (చూచి) ఔను విశ్వామిత్ర భగవా నుడే

“రాజపుత్త్రులతో గూడి పూజనీయ
బ్రహ్మమయులు విశ్వామిత్రపరమఋషులు
వచ్చుచున్నారు వేదతపః ప్రభావ
సమితి నాశ్రితభవించిన సరణితోడ”

(నిష్క్రమింతురు)

ఇది సిద్ధ విష్కంభము

## పంచమాంకము

[అంత రామలక్ష్మణులతో విశ్వామిత్రుడు ప్రవేశించును]

విశ్వా వత్సలారా! రామలక్ష్మణులారా! విద్యాస్త్రములు మీరు సాకడ గ్రహించి యజ్ఞమును

వ్వతి కెలువారు సూర్యుడు ఘ
నప్రతిరోధము బాపినంత స్వ
చ్ఛత వికసత్సరోజముల సంగతి
నొప్పు సరోవరంబు నీ
గతిని నిరోధ మీగిన ప్ర
కాశలుగాగ సమస్తవస్తువుల్ "

రాము: ఇంపలి స్వచ్ఛసరోవరజలముల దోము సూర్యబింబములవలె మానిమానసమురీతి హింసాహీనములై పక్షులు శాంతిసుఖమందును

లక్ష్మి:
"సరసులో నియగాధంపు జలములోన
మెసగు నుత్తమమానసౌకసము లొప్పు
సకలరసప్రాప్తి కలిచి తృప్తమగుచు
పరమముజ్జ్వల మూర్తిభావముల భంగి "

రాము:
"కేకరమణులు స్వాగతగీతి పాడి
మేఘరాజికి సంతోషమేదురలను
నృత్యములు సల్పుచున్న, ఘనీరదాళి
ద్రోలి రవి వెల్గ నేకిపచ్చి రాలె "

విశ్వా: వత్సలారా! ఈ శరత్కాలశోభ యింకను జూడుడు

"ప్రబలశత్రుఘనాంధకారమున మునిగి
యొరి చంచలదీప్తితో వెలిగి యున్న
నిర్మలంబగ నొప్పు నీలింగి యిపుడు
కాళరాత్రిగ్రసీదనంబున గంతుమిగిలి "

మఱియు
"మేఘపటలి ద్రుంచి మిన్ను చెల్వొందగా
పరప్రపక్షుల గెల్చి వజ్రల రాజు
ప్రజల నేలువురీరు పరమార్థిగా
సత్కృతితి నయనపర్వ మగును "

ఇట్లు మన కీతపోవనమున శరత్సమము సాక్షాత్కారమైనది అది నిత్యనూతనమముచున్నది తపోవనాంతికమున వన్యఘోష వినవచ్చుచున్నది నగరవ్యవహారము లిట కతిదూరములైనవి ఈ యరణ్యమున మృగసమానవృత్తితో గ్రామ్యజను లాత్మధర్మముల సెఱుంగనివారైనను సధర్మానుమాత్ర మాచరింపరు. పరస్పరవైరములు స్వైరవిహారములు వీ రెఱుంగరు గ్రామీణస్త్రీలు నిత్యమాతిథ్యపరలు అపకారము సైతము వీరతిశీఘ్రముగా మఱతురు మిమ్ము వా రభివందింపగలరు చూతురుగాని

రాము: వీరి కంటబడక మనము తప్పించుకొనలేము కదా!

లక్ష్మి: ఈవనశోభ మఱింగియీజీవనచిత్రము కూడ దూరబాధ నందపన్నవి ఇపుడు నిసర్గము, ఆర్థవామకృతము నవ తపస్వి చరితము భగవాను లన్నట్లు ప్రత్యక్షముగా జూడగందుము.

(అంపెలు నపితురు)

లక్ష్మి: (చూచి) ఆర్యా! చూడుడు
"సస్యభారనతం బయి స్వర్ణకాంతి
నొప్పుకలమపుసెన్నులు గుబ్బకొన్న
క్షేత్రభూమిని గన్గొన్నమాత్రమునను
పొందుచుంటి నపరిమితానంద మిపుడు"

విశ్వా: ఆ నుక గూర్చుండియున్నకృషీవలుల ంటిరా? క్షేత్రములు చక్కగా దున్ని చదునుచేసి యామునుల్లు పెంచి దగ్గరచేసి వర్షము కురియగా నూడ్చి పిదప గలుపు తీసి రేయింబవళ్లు కనిపెట్టకొని యుండి శ్రమఫలముగా లబ్ధసస్యముల గోసికొని క్షేత్రోపజీవులింత ప్రమోద మనుభవింతురు వారి కెవ్వరీడు రారు కష్టఫలము సుగిను ఘనులు, ఏవ్యాకుల్యలు విజయముగా వారే ఈరీతి బండిన సస్యములో

"దైవతపైతృకక్రియలు
ధార్మికబంధుజనాళి తృప్తి సా
ఖ్యాతవహా మాట భో ములు
సంచితరీతిని వారి కుంచియున్
గోవుల మేపువారలకు గొంత
త్యజించి యథోచితంబుగా
శ్రవసథంగి నాత్మజుల
భార్యల గూడి భుజింత్రు శేషమున "

లక్ష్మి: ఈ కృషీవలుల చరిత్ర మతిశ్లాఘ్యము

విశ్వా: మఱియు, వారు
"శ్రమ గణింపరు దైవవిశ్వాసమునను
దొరకినది తృప్తిగా దిని దోషభావ
రహితులై మిక్కిలి సుఖింత్రు రమ్యభంగి
సర్వజీవితహేతువుల్ సజ్జను లయి."

అంతేకాదు, వారికి

అజగనోర్మోహనాంగి నక్షార కుసుమ
పేశల సుగాత్రి నొవరించి విధి తలంప
గాంచి స్త్రీరూపనిర్మాణ కౌశలమున
కచ్చెరువు చెంది గర్వించి యుండె బోలు
 ఆహా! చిత్రము!

"ఒక్క పారి కనుంగొనియున్న మాత్ర
మఱచిపోయితి సర్వమ్ము మతి కలంగ
నింక నొకమాఱు కనుగొన్న నేమియాగు
నో? యెఱుంగను నిజము మనోహరాంగి

మఱియు

పరమానందముతోడ వత్సలతతో
 బాల్యంబునన్ దల్లి మ
త్పరయై స్తన్యమొసంగునాది దొలుగన్
 శ్రీపాదమున్ వీడి, నా
కరయన్ గానపలొల్ల మెన్నకును లే,
 దారాతిప్రశ్రేణి పెం
పఱజేయన్ జలియింప, నా కిపుడు సం
 ప్రాప్తించె నన్యక్తతల్"

యజ్ఞవిఘ్నకారు లగురాక్షసులను శస్త్రాస్త్రములచే నాశముచేసితిని కాని నాయాత్మశక్తిపై నాకుం దమ విశ్వాసము కోలుపోయి యెఱుంగను ఆమెను గనుగొన్నది మొదలిగి యంతయు బహుపంచలై పోయినది ఆహా! కాము మతిబలవంతుడుకదా! ఈ కామజ్వరము నా దేహమువంతయు దపింప జేయుచున్నది నాచే నేయకార్యము చేయించునో? ఏలన, ఇది ఋషి యాజ్ఞవలన చేయుకర్మ కాదు ఇది యకార్యము గురువులకు నివేదింపక చేయు నేపనియైనను గొంగపనియేకదా! మఱియు నరణ్యమున యుద్ధమున నెల్లపుడు లక్ష్మణ ద్వితీయుడనయియే కాని యొంటరిగా నుండియుండుగదా! నా పనుల లక్ష్మణునకు లేదు గురువులు లేరు ఇది న్యాయమా యన్యాయమా యని విచారణ లేదు అది పూతముకలె మానసమును గాఢముగా వశపఱచుకొన్నది ఇక రాముడు విషయములకు జలింపడనిన మాట పొల్లువోయినదికదా! కానిమ్ము, విశ్వామిత్రులకు దూరమున నుండుట మంచిది కాదు సమీపమున కేగెదను అవిజ్ఞాత కులాచార స్త్రీ దర్శన ప్రసంగమునుండి మనస్సును మరలించెదను కాని

"ఈమె జూచిక యానంద హీనమగును
నా మనస్సది, ఇక పైని నేమియయిన
బరమపావనమైన నా చరిత మెట్లు
విమల తత్తుంచె నపుడు నేరేఁ చేయు నేల!"

(పరిక్రమించును) ఆహా! అడుగు పడుటలేదు

"ఒక్కయడుగైన నిడజాలకున్న వ ప
గరము దృఢతరమాయె యీచరణ యుగళి?
ఆమె జూచిక యీ కన్నులౌర? గొంకు
చూడజాలక యున్నవి చోద్యమౌర!
"ఆమె జూడంగ దలపాని నంతమాత్ర
నవిరళానందమందు నాయంతరంగ
మామె తనువల్లి ముఖబింబ మరయగందు
మరల నానంద వార్నిధి మగ్నమౌదు"

(ఆలోచించి) ఇది కాదు కొంతసేపాగుదును. సందిగ్ధ ఫల విషయమున మతిమంతుడు శ్రమపడడు ఇట నందు టుచితము కాదు ఏలన, మహర్షులు బ్రహ్మచర్య నియమనములు వారికే కాదు మనస్సును నిరోధించుటయే సర్వజీవులకు బ్రథమ కర్తవ్యము మఱియు

"బ్రహ్మచర్య వ్రతంబున బరగరాము
డరయజాలను స్త్రీముఖ మన్న మాట
పొల్లువోరాదు మఱియు నిప్పుడు తలంప
నొంటి నుంటిని స్త్రీ గను టురవు కాదు"

(జయించుట నభినయించి) ఇటులేగెదను (ముందు చూచి) ఓహో! నా నేత్ర పద్మముల నానంద సరసిలో మునకలాడించిన యాసుందరి యీ తరుమూలమున గూర్చుండి యున్నది ఇట నేయుండి యామె దర్శన సుఖ మనుభవించెదను

(పరిశీలించి) ఇది గాలిచే గదలు మాధవీ లత చీ ఇది నన్నింత పరిహసించుచున్న దేల? లేక ఇది నామనోవికలతయా? ఔను కాముకులు వికలచిత్తులే

"ఆత్మవైభవమంతయు నవలద్రోచి
దేహ మతికామ తప్తమౌ తెఱుగగంటి
ధైర్యవంతులు శద్ధచేతస్కులౌట
నామెరూపంబు గెదనుండి యవలద్రోతు"

(ఆలోచించి) అట్లను టుచితము కాదు

"వ్యథితమనమున మోహమువాంఛియున్న
నన్ను గనుగొన్నదా యన్ను మిన్న తవద్ధ

పోముదమ్మిరి వటవాంచి పూర్ణముగను,
తలపనమ్మోహమైన సేవలుకసైతి ”

మఱియు :

“బొమముడిపనప్పుగా జూపుములికిగాగ
నాయెడంద లక్ష్యమ్ముగా నాతియేసె
బ్రణయ సాదకముగ నేను బరమమూర్ఛ
మతిని వ్రాలుండ నయ్యె నా యతివ గొనను ”

ఇపుడ జరిగినట్లే ముందును జరుగగలదు నేను వృథా విచారగ్రస్తుమంద నేల? పోదును

(తెరలో) “సఖీ! ఇటు, ఇటు ”

రాము (విని, చూచి) కాదు నా మతి భ్రమ కాదు సత్యము మమానంద నయనానందస్యంది శారద పూర్ణేందుముఖి మూర్ఛితుని నను నన్ను వన వదన శోభా పంక్తిచే జేయుకొనకేయ సఖులతో నిటే వచ్చుచున్నది

“నభమున పై మేఘమును జూచి నాట్యమాడు
నెమిలిరీతిని నీవచ్చు నిరుపమాన
సుందరీరత్న వదనారవిందము గని
మన్మనము నాట్యమొనరించు మహితభంగి

(అంత సఖులతో సీత ప్రవేశించును)

ఒకసఖి భర్తృదారికా! ఈ యుద్యానమున నెటగూర్చుండి మనోవినోదమును గావించుకొందము?

మఱియొకసఖి ఆ మాధవీలత దగ్గఱ అశోక వృక్షపు నీడ

సీత సఖీ! చంద్రకళా! భర్తృదారికా యని క్రొత్తగా పిలిచెదవేమి? ఇదివఱకెట్లు సఖీ యను దానవో యట్లే సఖీ యనుము

చంద్ర నిన్నటినుండి నీవట్లగపడుటచేతనే యట్లంటిని

సీత : మధురికా! నీవట్లందువేమి? మీరిరువురు కదా సీతకు ప్రియసఖులు.

మధు నీవు మఱియొకరి దానవుకాగ నవును చున్నావు చపలవు ధీతవుగాదువేమి? కనుల నైనత్తు. నీవు రాగమంచే నిద్రలేని దానవుకాజా లున్నావు ఏకాంతమున నీ మనసులో నేమో యను కొనుచున్నావు.

చంద్ర : ఇప్పుడీ వేగముగా వచ్చితివి కూడ.

మధు : నీలో యౌవన వికారము కనిపించు చున్నది ఏ యువకుడు నీ బాహులతిచే గంఠము నలంకరించుకొని ధన్యుడు కాగలడు?

సీత ఏమో తెలియదు

రాము ఈమె ఎవరి భాగ్యరాశియో తెలియదు ఎవరో బ్రహ్మర్షి కుమారునకో నాకు లభింప జాలదు అన్యవధువైన నలభ్యయే. అందుచే నీమె ముఖారవిందమును నీరెదలో దాచుకొని యుంచుట వ్యర్థమేయగునేమో (ఆలోచించి) అట్లు కాదు వినుడ

“పరవనిత యైన నీమె దుష్ప్రాప్యమైన
నామనమ్మెట్లు పరుగెత్తు నీమెపైకి?
మనసె కాదె! కృత్యాకృత్యమతి వివేక
మునకు నుత్తమ ప్రామాణ్యమున ధరిత్రి ”

సీత ఏ లోకో కాని నామనస్సీ యుద్యానమున నమకటివలె ప్రసన్నముగ లేదు శరీరమునకు జాల సంతాపము కలుగుచున్నది కదలనైన గదలజాల కున్నాను

మధు ఆ మణి శిలాతలమున గూర్చున్నచో భర్తృదారికకు బకుళ పరిమళముతో నుద్యాన వాయువు వీచి స్వస్థత చేకూర్పగలదు

సీత ఔను కూర్చుందము [(కూర్చుండును) దీర్ఘముగా నిశ్వసించి] సఖీ! నా శరీర సంతాప మధికమగుచున్నది

మధు (నలినీదళమున సీతకు విసరును )

రాము ఆమె శరీర సంతాపమున నేనును దహించుచున్నాను.

“కమలోద్యానసరో
వారితరంగ ప్రభూత వాయువు సుమన
శ్శౌరభము మందములయ్యెన
మారుడు నస్త్రము దొడగ మిక్కిలి నకటా!”

కారణ మేమైయుండును? సరే తెలిసినది.

“మానసదేశంబులలో
మానవ మది ధర్మమార్గమునేమా దలిర్పన్
మానసము వీడి దేహ ము
మానంబుగ దప్తమగుచు నుండగ బోలున్.”

సీత : నా శాంత మీ చల్లని గాలివలన కాంతించుట లేదు. మీరు శ్రమపడవద్దు.

మధు (జనాంతికముగా) చంద్రకళా! నేనను కొన్న సంతాప కారణము నిజమే. ఇది శరీర సంతాపము కాదు. మనస్సంతాపమే

చంద్ర రాముని మూలముననే యిది యని యామె సత్యము చెప్పదాయె

మధు : (జనాంతికముగ) అయ్యెడు రాముడు విశ్వామిత్ర పరవశుడై దృఢవ్రతము నవలంబించి యున్నాడు అతనిని లొంగదీయ సాధ్యమా?

రామ ఈ సంతాపము వలన నామె ముఖము తెల్లబడుచున్నను మఱియొక నూతనశోభ నే యందు చున్నది ఆశ్చర్యము!

"కాంచనగంటిని గన్నుల కఱవు తీర
వమృతనివ్యంది యూ నీమె యానవళి,
వివ దాపంబు మిక్కిలి యధికమయ్యె
విధికృతంబులు బహుచిత్ర విధములౌర!"

చంద్ర (జనాంతికముగా) మఱి యుపాయ మేమి? ప్రియసఖి భర్తృదారిక శోచనీయావస్థలో బడిపోయినది

మధు (జనాంతికముగా) సరే ధర్మవిరోధము కాని ప్రణయము పరిగణింపదగినదే యౌని విశ్వా మిత్రుల మతము అందుచే నీమె విషయమున నాయన ప్రసన్నుడేయగును

చంద్ర (జనాంతికముగా) ఏదో యుపాయము చూతము

సీత : సఖులారా! ఎండ చాల బాధించు చున్నది

మధు : ప్రియసఖీ! సీతా! చెట్టునీడనున్నావు ఎండయేమిటమ్మా!

సీత (లజ్జతో) ఇది నీకయా?

రామ

"చెట్టునీడను గూర్చుంటి జెరముపండి
పడయుచుంటిని జలిగాలి స్పర్శమైన
నతిశ్రధికమైన సంతాప మందుచుంటి
నేమి కానోవు గారణం బింతకెవుడు?"

"కామజంబైన తాపంబు కాంతకంటె
బురుషునకు మిన్న యానుగాబోలు—కాదు
స్త్రీల విషయము నాకేమి తెలియు? ఏల?
యింత గొడవ? నేనాడుగా మాంత్రుడను."

నేత్రానందదాయకుడగు నేయుత్తమునితోలో యీమె విరహ మనుభవించుచున్నది వాడెంత ధన్యుడో అహ్యాయ రక్తను గామింపకుండుట ధర్మ నియమము కాన నేనీవిషయమునుండి మనస్సును మరలింతును

"ఉత్తమవివేకఫలము వశ్నొందవలయు
నంతియే కాని యవివేక మందరాదు
పిరతరము సుఖమిచ్చు నేవిరుదనయి
ప్రాజ్ఞతను గోలుపోవుట పాడికాదు"

మధు : (జనాంతికముగా) నేను స్పష్టముగా ప్రియసఖిని జూచితిని

చంద్ర (జనాంతికముగా) ఔను

మధు ప్రియసఖీ! నీయీ సంతాపము మదన సంతాపమువలెనే యున్నది ఎప్పుడా రాము నీ యుద్యానవనమున నీవు చూచితివో యప్పటినుండి నీ సంతాపమారంభమైనది ప్రతి దినము వృద్ధి పొందు చున్నది ఇది నిజమైన చెప్పు ఏదో యుపాయము చూతము

రామ (విని హర్షముతో) ఏమి? నేనే యామె తాప కారణమైతినా?

"స్మరణమున గాఢసంతాపభరము కలుగ
జంచలాక్షులు హృదిలోన నుంచుకొంద్రు,
నన్ను సంతత్తు గావరించి ఖిన్ను జేయు
నామె పూర్ణేందువదనరమ్యత్వ మహహా!"

ఆహా!

"స్వార్థబుద్ధిని వస్యదుఃఖాదికంబు
నెవ డుపేక్షించువాడు మానవుడు కాడు,
దుస్సహంబైన తాపంబులో గలంగు
నామె బోధవింతు నానంద మవిరళంబు"

సీత . నా మనో వికారమునకు గారణమేమో మీ యిరువురకు దెలియదా?

మధు తెలియదు.

సీత (సిగ్గుపడును)

రామ . ఛీఛీ. కష్టము. నా గంధర్వ నగరము విధ్వస్తమైనది అలసులు దీనులు మూర్ఖులు కామ్య కర్మము లాచరింతురు. ఉత్తములు ఫలాపేక్షలు కాక ధర్మార్థమే కర్మమొనర్తురు. కావున నేను భలాభా యఫలమో యామె కలత బోగొట్టుదును.

మధు . ఏ కారణముననో తెలియని నీసంతాప మునకు నివారణోపాయమెట్లు మాకుముస్తా నీవు చెప్పనిచో?

సీత : చెలులారా! మీరు చెప్పిన కారణము నిజమే మీకు చెప్పనిదే మీచే నెట్లు చెప్పింప గలను?

రామ (సంతోషముతో) సంతోషము దైవ విహితమగు కర్మకర్తము శేకపోదుకదా! ఈమె యెవరి కూతురో!

మధు చెలీ! వెంటనే యీ వార్త మహారాజు నకు విశ్వామిత్రునకు అర్హుడగు రామునకు దెలుపు దుము

సీత (దీర్ఘముగానిట్టూర్చి) ఒక పెద్ద సంగతి మీరిరువురు మఱచిరి

మధు : ఏమది?

చంద్ర వాడు చెలియును శివుని విల్లెక్కిడిన వానికే తన కూతురినిచ్చెదనని మహారాజు నిశ్చయించి నాడు అది దుష్కరమగుటచే రాముని కది సాధ్యమా యని ప్రియసఖి జడియుచున్నది

సీత (దీర్ఘముగా నిశ్వసించి) ఔను

మధు రాముడెంత సుందరుడో యంత బల వంతుడెగుట శివధనర్భంగము గావింపగల సమర్థుడే

సీత కానివాడు నేను జీవింపలేను (మూర్ఛిల్లును )

చంద్ర : దేవతలారా! రక్షింపుడు సీత మూర్ఛిల్లి నది.

రామ : (నవ్వుచు తేరి) భయపడకుడు నేను బ్రియురాలి (అర్ధోక్తితో మానమూ వహించును)

మధు : అర్యునకు స్వాగతము. ప్రియసఖినిట్లు శోచనీయ సౌవర్పుట భావ్యము కాదు

రామ అంతయు వింటిని ఈ పుణ్యాత్ము రాలి తండ్రి యెవరు?

చంద్ర . బ్రహ్మజ్ఞాననిధి-జనక మహారాజు

రామ . (తనలో) ఏ కుల కన్యయో యను కొంటిని ఆ కులము పవిత్రుడగు జనకమహార్షిది వాకాలకైయామె పరితపించుచున్నది శోభాకృతిగా నా సుఖము కొఱకే విధి యీమెను సృష్టించి యున్నాడు (ప్రకాశముగా) ఈమె సఖుల మనో రథ కాగలదు కాని, నేనే యదృష్టహీనుడనని (అర్ధోక్తితో విషాదము నటించుచు దనలో) వివేక వినయాపేతుడనని జగము తలంచు నేమో?

చంద్ర (తనలో) తెలియవలసినది తెలిసినది

మధు మహారాజు మిగుల దుష్కరమగు పణమే యుంచినాడు

రామ అదియు నేను వినియే యున్నాను

"శివుని వింటిని సజ్యంబు చేయగలుగు
మానవుని శక్తి దుష్కరమానటంచు
రాజు దీని బణంబు నా మోజచేసె
ననుచు దలతును విఫల సుఖాశతోడ "

మధు నీకు బ్రియమే యగును

"పరమ వీరుడ వీవు దుష్కరముదైన
పని గలదె నీకు వని నేను ననుకొనెదను
నీవు మాష మహాశౌర్య నిధివి గాన
నీకశక్యంబు గలదె యీ లోకములను?"

చంద్ర ఆర్యపుత్రా! నీకు

"దేహమందున శౌర్యంబు దీప్తరూపు
అధిక దుష్కర కృతిరైన నగును సాధ్య,
మల్పకాయంబు గలదియే రైన సింహ
మధిక కాయము గలయేన్గు నణచుగాద!"

(తెరలో) మహారాజా! ఇటు ఇటు

రామ అహా! భగవానుడు

"రాజత్వంబున సుస్థితుండు నయ
దుర్గాహింబునా బ్రహ్మ స
త్తేజం బంది వెలుంగు రాజ ఋషి,
యుత్తీర్ణుండు జ్ఞానాంబుధిన్
బ్రాజిష్ణుండు విరక్తుడై మయిక
విజ్ఞానంబుచే సంస్మృతిన్;
రాజైయున్నను శాంతిమూర్తి
పరమప్రాజ్ఞుండితే డెచ్చటిన్ "

నేనిచట నుండదగదు పోయెదను. (నిష్క్ర మించును )

సీత : సఖులారా! ఇపుడేమి చేయుదము?

చంద్ర ఇపుడు క్రొత్తగా చేయవలసినదేమి! మహారాజు వచ్చుచున్నాడు కావున ఎదురేగుదము.

సీత. నా సంతాప వృత్తాంత మాయన వినలేదు కదా?

మధు నీవిట్లు శంకింపకు. ఆయన విన్నచో నీ సంతాప ప్రతీకారము చేయును

సీత. నాకష్ట సమయమున నన్ను బరిహాసించు చున్నావు.

మధు : నీ దుఃఖ శాంతి యగునులే

సీత మరల వేళాకోళమా?

మధు. వేళాకోళముకాదు విను రాముడు కానరానిచో నీవెంత సంతాపపడుచున్నావో నీవు కానరానిచో నాతడు నంత సంతాపమే యందు చున్నాడు

సీత : పోవే ఆయన పేరెందుకు చెప్పెదవు?

మధు ఆయన మనమిత్రుడు కనుక.

సీత (కోపముతో) నీకెట్లు తెలియును?

మధు (చెవిలో) ఇట్లు

సీత నిజమా?

మధు నిజమే

సీత · (లీలగా) ఏమే. అసందర్భ ప్రలాపము లాడెదవు? ఆ మాట నమ్మవచ్చునా?

(తెరలో) మహారాజా! ఇటు ఇటు
చంద్ర మహారాజా వచ్చినారు
(జనకుడు చేటులతో ప్రవేశించును.)

జనకుడు :

“అనుపమ సద్గుణాళి వలరారెడు
కన్యక గాంచి పెంచి యా
మెను విబుధుండు నిర్మలుడు
సుందర సద్గుణ శాలియైన యొ
క్కని కొస గంగ గాంచిన సుఖంబను
గాని యమోఘవర్తి కౌ
క్కని కొస గంగ గాంచుటెడ
గష్టపరంపర చెప్పశక్యమే!”

సీత (చేరి) నమస్కారము (నమస్కరించును.)

జన. వత్సా! సర్వగుణనిధియగు భర్తను బడయుదువు గాక!

సఖులు · ప్రియసఖీ! తండ్రిగారిని వరయాచనము ఆశీర్వచనము నిండని కోరుకో.

సీత. (కన్నీటితో) తండ్రి పెండ్లిచేసి నన్ను దేశాంతరము పంపి వేయును.

జన దేశాంతరమో జన్మాంతరమో ఏమైనను జీవికి స్వకృత్యములు తప్పవు కన్నవారెల్ల మిన్న లగు బంధువులని తలచి యాతడు పోనపోవును ఇట్లు పోనపోని జీవిరేయాయుండు

ఏది యెట్లు జరుగవలసియున్నదో యట్లే జరుగును నీవేగవలసిన చోటికే యేగదవు విప్రయోగ భావముచే నీవనవసరముగా హృదయమును బాధ పెట్టుకొనకుము.

“కలిగియున్న దుఃఖంబును దొలచుకొన్న
నాను మిక్కిలి యానందమట్లు కాక
సుఖమెఱుంగక దుఃఖంబు చొప్పగన్న
నొక్క కార్యంబు కూడను జక్కబడదు”

సీత· (కన్నీటితో) తండ్రి యున్న ధైర్యము తనయకెట్లు వచ్చును?

జన అవసరమునుబట్టి నీకును ధైర్యమదియే వచ్చును మగని ప్రేమ మెఱిగితివా మమ్ము వెంటనే మఱచిపోదువు

సీత తండ్రీ! అట్లనకుము

“ఎంతవఱకును సంస్మృతి యుండు నాకు
నంతవఱకును నాయనయందు దండ్రి
పరమపావన భవదీయ పాదపద్మ
యుగళి యెన్నండు మఱవంగనోప నేను”

జన వత్సా! మంచిదే అది సముదాచారమే నీవు భర్తతో వెడలిన వెనుక గలుగబోవు మా ఎడబాటును గూర్చి యాలోచింపకు.

“ముందు కాలంబునందు రాబోవు దుఃఖ
మెన్నడును గూడ దలపోయనెంచరాదు
గడచిపోయిన కాలాన గన్న దుఃఖ
మెంత త్వరలోన మఱచిన నంత సుఖము”

అందుచే నీవు సఖులతో నేగి యెడముందుభాగమున గల బుద్ధివర్ధన పీఠమున గూర్చుండి మనస్సును వినోదపఱచుకొనుము. (చేటులతో) మీరు విశ్వామిత్ర భగవానులతో సంతోషపూర్వకమైన విజయ సేను వచ్చినారు నివేదించినచెల్ల బరిపాలించెద నంటినని చెప్పి రండు.

అందఱు : చిత్రము. (జనకుడు తక్క అందఱు నిష్క్రమింతురు )

జన ఈ వేళ అటుగడియలకు నాకు సుశ్రాంత స్నానము పిదప అర్ఘ్యవిధానమున సీతను రాముని కిచ్చెదను విలన, కులమన్న

"పరమ విఖ్యాత మా రఘు వరకులంబు
రాముకు బుధుండు క్షాత్రవిరాజమాన
సుగుణ పుంజము సీతకు దగినవరుడు
ఆమె వలచిన దితని నింకేమి కలదు?"

ఇక శాంభవధనురారోపణ రూపమగు పణము నకు రాముడు నిలువగలవాడేయని విశ్వామిత్ర మహర్షి చెప్పియే యుండెను (ఆలోచించి) రాముడే యిది చేయలేనివాడు విశ్వామిత్ర భార్గవరాములను దన్పించిన నిక నిందులకు సమర్థుడెవడు? నా పణము సార్థ ఫలమునుగాని నిష్ఫలమునుగాని యొన్నడు నీయదు భగవానుడగు భార్గవరాముడు శాశ్వత బ్రహ్మచారి విశ్వామిత్రుడు తపవాని నా పణము విని యెందఱో వీరులు విభ్రమములో విచ్చేసి యది నిర్వహింపలేక నిందించిపోజొచ్చిరికదా! విశ్వామిత్రువచనమున విశ్వాసముంచి యీ మహాభాగుని కొఱకెదురు చూచు చుంటిని (పరిక్రమించి మరల నాలోచించి) నా పరమసఖుడగు దశరథ మహారాజును బిలువనంపెదను నా కోరిక పాటించి యాతడు తప్పక విచ్చేయును రాణులలోడను వసిష్ఠభగవానులలోడను కుమార మంత్రి భృత్య పరివారపురస్సరముగా విచ్చేయును మని కోరుచు నిప్పుడే దశరథుని కడకు దూతను బంపుదును మఱియు

"ఏ నృపులు వచ్చిన యీ వింటి నెత్తలేక
తమ నిరాసులౌచు పోవగనిరో వారి
నందఱను బిల్వనంపెద నరుగుదెంచి
వార లీ యుత్సవము జూడవలయు నేడు"

అంతేకాక.

"ఈ పణము దుష్కరంబని యెవరు నన్ను
నింద చేసిరో వారు వారందఱరయ
గలరు రఘురాము కీర్తిని, గాంచి మిగుల
సిగ్గుపడగాంత్రు తమ తమ చేత తెలిసి."

ఇంకను

పరముండౌ హితుడైన యా దశరథున్

భార్యాత్రయిన్ బిడ్డలన్
వరసంజాతుల నా గృహంబున
మహానందంబునన్ గాంచెదన్
చిరకాలంబునకిట్టు లాతడును
నిర్నిద్ర ప్రమోదంబునన్
వరపుత్ర ప్రకట ప్రతాపముగనున్
వహ్వా! యనన్ లోకముల్"

(నిష్క్రమించును )

ఇది షష్ఠాంకము.

## నిర్వహణాంకము

[అంత సూర్ప్పండి సదస్యులు, సభ్యులు, దశరథ మహారాజు కుమారులు, జనక మహారాజు, పరివారము, వసిష్ఠ భగవానులు, విశ్వామిత్రుడు, శతానందుడు, మంత్రులు, రాణులు, పరిజనులు, రాజులు ప్రవేశింతురు ]

జన (లేచి)

"తిమము నడచెడి జ్ఞానతేజమును గాంచ
బ్రహ్మమయముగ దోచు సర్వంబు ధర్మ
కర్మ మొనరించి లోక సౌఖ్యమ్ము కొఱకు
శాస్త్ర విజ్ఞత నెల్లరు వలరవలయు
కర్మపరము సమస్తంబు కాన నిర్మ
లివెవ రెత్తుండగా దెట్టి విజ్ఞుడైన
ధర్మ యుక్త కర్మంబు నిత్యంబు చేయు
సజ్జనుడు నిర్మలంబైన శాంతినెనయు
ఒక్కడయ్యును సూర్యుండు పెక్కుగతుల
గాంతి పుంజము పెదజల్ల గాంచునట్లు
ఒక్కటయ్యును నాత్మతా పెక్కుగతుల
వివిధ కృత్యంబు లొనరించి వెలయుచుండు
విధి విధించెను యజ్ఞంబు విజ్ఞులకును
యజ్ఞమున దేవతలు ప్రీతి నందు చంద్రు
యజ్ఞమున గొల్తు రీశ్వరు నఖిల జనులు
యజ్ఞమొసగును గామ్యఫలాళి నిజము."

నా యజ్ఞము సమాప్తమైనది ఇక అగ్నవిధి ననుసరించి రఘుకుల దీపకుడగు దశరథ మహారాజు జ్యేష్ఠ పుత్రుడు సకల క్షత్రకుల మలాంకారుడు, భుజ బలోద్దాపిత భగ్నా శేష మహాబల వీరాలిచాలితోగ్ర చాపుడు, ఖిమయాకుధాన వధనివారిత తపోవన భయ సంకటయుడు, సుకృతిజన మనః కుముద ప్రసాద

హేతు భూతుడు నగు రామచంద్రునకు భూజాతయగు సీత నిచ్చుచున్నాము. అను రక్తానురూప వరాభిలాషులు కుల్యగుణ ప్రీతిచే అపరిచ్ఛేద్యాభినందితులు నగువారికి కేవల వ్యవహారయాత్రకే వివాహము చేయవలయునని చెప్పబడినది

కావున, రామ కల్యాణరూపయగు సీతను రామునకు, భరత లక్ష్మణ శత్రుఘ్నులకు క్రమముగా వాయువ్యతులకు మాండవి ఊర్మిళ శ్రుతకీర్తి తగిన వారు వధూవరులు కుల్యగుణవంతులు, కుల్య రాజవంశ సంబంధులు నగుదురు దీనికి నా యందలి యనుమోదము నున్నతో నంద లొక్కటాని స్వస్తి వాచకములు పల్కుడు

అందరు స్వస్తి స్వస్తి స్వస్తి. (ఆకాశమున పుష్పవర్షము)

దశ (లేచి) ఆహా! ఏమి నా యదృష్టము

“జనకక్షీంద్రుడు దాత గాగ
గురువుల్ సాన్నిధ్యమందుండ నీ
జనపాలేంద్రులు సంతసింప
ఋషి లోకః పుంజమైనట్టి యీ
జననాథాగ్రణి బాంధవంబునను
వంశంబెల్ల ధన్యంబుగా
దనరెన్ దుల్య వయోను రూపగుణ
పుత్ర శ్రేణి కల్యాణముల్.

మరి
దశరథ పుత్రరత్నములు దాంతులు
శాంతులు శిష్యరత్నముల్
విశద వివేక శస్త్రబహు విద్యలు
నారద చేర్చి యాజ్ఞమన్
వసులయినట్టి వారిటు వివాహ
మహోత్సవ మందుచుండి స
ద్వశమును గాంచగాగనట
ధన్యత నైతి ముదత్తిదేలితిన్.

విశ్వా:
“తగిన సఖుండునా దశరథ
క్షితిపాలుడు శుద్ధశత్త్వుడీ
సుగుణ విదేహ భూపతి
విశుద్ధ మనస్కుత గొల్చువన్న, న
ద్యగణిత బుద్ధు లస్త్ర విదులైన
కుమారులు నాకు శిష్యులౌ ల
ట్లగుట వివాహ మియ్యది
ముదంబుధి దేల్చెను నన్ను మిక్కిలిన్”

శతా
“పరమ విశుద్ధ వంశమున
ప్రాభవమందిన రాజరాజిలీ
కరణిని సత్తమోత్తమము
గా జెలువారగ బాంధవంబునన్
బరగుసుఖంబు నా కొదవె,
పౌరజనంబుల సౌఖ్యలబ్ధికై
యిరువుర గూర్చ రత్నమును
హేమము గూడినయట్లు లింపగున్”

(తెరలో) “ఏమేమి! ఇంత మహోత్సవము నాకు దెలియకుండగనే రాజులు చేయబూనిరా?”

అని ఓహో! పరశురామభగవానులు భ్రూభంగమున భువనభయంకరముగా నిటు వచ్చుచున్నారు

(అందరు లేచి నతశిరస్కులై నమస్కరింతురు)

రామ (లేచి) భయపడకుడు భయపడకుడు

“శస్త్రయాలంబునకో లేక శాపమునకో
చంప వచ్చిన యీ మహాచరితు విప్రుడె
శాంతి నందగ జేసెద సత్యమైన
విప్రవరునకు దగునె యీ వికృతులిక?

(క్రోధవంతుని వలె పరశురాముడు ప్రవేశించును.)

పర (ఎవరిని జూచినట్లు నటించి)

“అలఘు బ్రహ్మవిఘాత దర్పిత బలా
హంకారులన్, వైదిక
క్షుల బాటింపని క్రూరభూపతుల నే
గ్రుద్ధుండనై త్రుంచితిన్
ప్రళయాగ్ని త్వరనెల్లరిన్; బరశు వ
న్నందున్ దదస్రంబు రా
వ రతిన్ జూపెడు సేటికిన్, బరసు శ్ర
స్తంబయ్యె బల్మాయమున్”

“ధర్మపరులైన విప్రుల దమపుచుందు
రెవ్వరెవ్వరు వారు వారెవ్వరైన
శాత్ర్వబలము నొసంగి నిరంతరంబు
ప్రోచుచుందును గరకాప్రవత్తార్థమితివి.”

రాము  దేవా! అట్లే చేయుదును

పర  ధర్మమార్గమున చేసె యే లోకముల జయించితినో యవియన్నియు నీకు తంత్ర పరంపరగా వచ్చునట్లిచ్చి చేసి నేను తత్త్వజ్ఞుడనై తపమాచర చేయుచున్నాను.

వసి  భగవానుడా! పుణ్యార్జితములైన లోకముల నీ వేల విడిచెదు?

పర :

"కాలవశమున బుణ్యంబు క్షయముగాగ
సారహీనంబులౌ పెట్టి సంపదలును,
దాని నైనంత దాక తిరమైన వాస్త
కావ నేను ద్యజింతు లోకమ్ములెల్ల"

"అకు చిదానందమయమైన యట్టి బ్రహ్మ
మరయ శాశ్వత, మది పరాత్పరము దాని
యందు నిత్యస్థితిని మహానంద మొసగు
నందు నేను బ్రహ్మానంద మందుచుందు"

విదూ (తనలో) ఈ ముసలి రొంపబంటి త్వరగా బోయిన మంచిది

పర  వేవేగి వచ్చెదను (శీఘ్రముగా నిష్క్రమించును)

జన  ఆహా! జామదగ్న్య షేమిత బలశాలికదా! ఈతనింత పరమ శాంతుడే! ఇక క్షత్రియులు సుఖింతురుగాక!

రాము  పరశరాముడాదేశించిన ప్రకారమిక నేను చాపవాశన ముపేక్షింపరాదు  పౌరులెల్లరిక బలాయమాన విద్రావుద్రితులు, కంపమాన మనస్కులు నౌదురు. (నిష్క్రమించును)

దశ  పరశురాము భగవానులు సర్వతేజో నిరాకరిష్ణులై బ్రహ్మత్వమందినారు

విదూ (తనలో) ఈ వృద్ధ బుక్కము పసిలి పోయినవిమ్మట వీరంద తాతనిని స్తుతించుమన్నారు ఉండగా స్తుతించుటకు భయమే

విశ్వా  ఔనౌను అతని పరాక్రమమున బహు క్షత్రియులు మరణించినారు అతని బ్రహ్మతేజో మహత్త్వమున నిక నెవ్వరికి నాపద రాదు మఱియు వసిష్ఠ భగవానుల బ్రహ్మత్వము మాదృశులకు నైతము నందరానిది దానిని దిరస్కరింప నే బలనముగా యము చాలదు.

వసి  అది యెప్పటి మాటయో

విశ్వా (పైకి జూచి) దివ్యాభినందన మంది సమస్తమువారై దశరథకులప్రదీపులు కుమారుల మహత్త్వమున గూర్చుండి యున్నారు

వసి  ఏల?

విశ్వా  అదిగో అందఱు పైకి జూడుడు

అందఱు (పైకి జూతురు)

విశ్వా :

"నలువయు నిష్ణువున్ శివుడు
నారద తుంబురు లింద్రుడున్ గుడూ
హాలులయి కల్పవృక్షకుసు
మాతతి చెల్లగ మంగళార్థమై
పలుతిరీతి జిమ్ముచును
సర్వసుపర్వులు జూచుచుండ్రి ని
స్తుల బహు వాద్యఘోషము
తో నిటనర్త్యకు పెంపెసగుచుండెటుల్"

దశరథ జనకులు (చూచి) నిజమ నిజము

[అంత నలువురు శిశువులు నలువురు వరుల ప్రక్కనిలిచి సపరివారముగా ప్రవేశింతురు దివ్య వాద్య ఘోషములతో నాకసమునుండి పుష్పవృష్టి కురియును ]

అందఱు  స్వస్తి స్వస్తి స్వస్తి

విశ్వా  సఖా! దశరథా! నీకింక నేమి ప్రియము కావలయునో కోరుకొనుము

దశ

"పుత్త్రులు లేని దుఃఖ మది
పోయిన దెప్పుడో మైథిలీశ స
త్పుత్త్రికలైరి నాకు బరి
పూర్ణ సుఖంబు లొసంగగా నున్నవల్,
క్షత్రియసంతతిన్ బరసు
శౌర్య నిధానము లన్న కీర్తితో
బుత్త్రులు నొప్పిరింక దల
పోయగ గోరిక లన్య మున్నదే?"

విశ్వా  వినవిట్లుగాక! రాజసింహాసనము నీవు పాలింప

"వర్ణాశ్రమ ధర్మంబులు
పూర్ణంబుగ వలయ ప్రజలు పొందగ బహుసం
పూర్ణ సుఖంబులు మఱి నిఖి
లార్ణవ మధ్యస్థ భూమి యేలుము శాంతిన్"

వసి  తథాస్తు

[అందఱు నిష్క్రమింతురు, తెరపడును ]

(సంపూర్ణము)

# సాత్త్వికభావములు



శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

స్తంభము, చెమటపోయుట, గగుర్పాటు, గద్గదిక భాషణము, వణకుట, వివర్ణత్వము నందుట, కంట తడిపెట్టుట, ప్రలయము ననువానిని సాత్త్విక భావములనుచున్నారు సాత్త్విక భావములకు, అనుభావములకు సామ్యము చాల కలదు ఇవి స్థాయి భావములకంటె విలక్షణములు వీటిని సంచారి భావములుగా కూడ గ్రహించరాదు

అభ్యంతరములుగా ననుభవింప బడునవి సంచారిభావములని, బాహ్యముగా ప్రతీయమానములగునవి స్వేదరోమాంచాది సాత్త్వికభావములని శృంగార ప్రకాశికారుడనువాడు బాహ్యముగా, అనగా శారీరకముగా, ననుభవించువానిని అనుభావములు, (*Sensations*) అని యందురు. ఇవి అంతర్గతమగు భావము ననుసరించి యుండునవి

రసానురూపములగు నాలాపములతో, నానాలంకార సంయుక్తములగు పద, వాక్య, శ్లోకములతో వాచిక రసము కల్గునని, కర్మ, రూప, వయో, జాతి, దేశ, కాలానువర్తులగు మాల్య భూషణ వస్త్రాదికముచే నేపథ్యరసము వచ్చునని, రూప, యౌవన, లావణ్య, స్థైర్య, ధైర్యాది గుణములతో స్వాభావిక రసమురాగలదని మాతృగుప్తుడను వాడు ఇందలి వాచిక రసమును వాచిక శృంగారముగాను, నేపథ్యరసము నాంగిక శృంగారముగాను శారదాతనయుడు చిత్రించినాడు ఇచట రస శబ్దము ననుభావములకు వరింపబడినది వాఙ్నేపథ్య క్రియాత్మకముగా శృంగారము, అంగనేపథ్య వాక్యాత్మకముగా హాస్య రౌద్రములు, త్రివిధములుగా గలవని భరతుడే చెప్పుచున్నాడు కాని ఈ వాదములో అను భావమును సంచారిభావముగా గ్రహించి, ఆపై స్థాయిభావముగా తీసికొనుట గలదు ఇట్లనుభావమును సంచారిగా స్వీకరించుట ప్రామాదికమని వివుల వివరించితిమి

అనుభావమనగా నేమి ? బాహ్యజగత్తులోని విషయముతో మనకు సంబంధము కలుగగా వాటిని గురించి కొంతవరకు తెలిసికొనగలుగుచున్నాము ఈ యనుభూతిలో విషయము వేరు, మనలో కలుగు మార్పులు వేరు. సూది గుచ్చుకొనగానే మనకు కలుగు అనుభావములో బాధకలదు. సూది యను విషయములో మనకు కలుగు సంబంధముద్వారా వచ్చు అనుభావమును సాక్షాత్తుగా, అపరోక్షముగా, బాధ యని తెలిసికొనుచున్నాము

శరీరమున జీర్ణకోశము మొదలగు వానిలో కలుగు మార్పులు, పరిసరములలో వచ్చు సంచలనములు, మన ఇంద్రియములను సంచలింప జేయుచున్నవి ఈ సంచలనములద్వారా ఫైదకులో మార్పులు రాగలవు ఈ మార్పు లనుభావములలో ముఖ్యముగా కన్పించును ఒక విషయమును మనసు చూచినపుడు మనలో కొన్ని పరిణామములు బయలుదేరును సాక్షాదపరోక్ష ప్రతీతిలో నంతర్లీనములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములకే పరిణామములు సంబంధించియుండును ఇచట విషయము, మన అను భావము అను రెండువిలక్షణ వస్తువులుకలవు ఈయను భావములు వ్యక్తి భేదముచే భిన్నములగుచున్నవి ఏవ్యక్తి అనుభవము ఆ వ్యక్తిదే కాని అను భావములు విషయ ప్రత్యక్షమున కలుగున వగుటచే మానసిక వృత్తులు కావలెను అనగా అనుభావముల స్వార్థబోధకము లైనను వస్తుతంత్రములగుచున్నవి జ్ఞానముచే నుపజీవ్యములగు అనుభావము లర్థవంతములుగా ప్రతీయమానమగుచున్నవి అతిక్రాంతత్వము, అన్యసుఖ ప్రేక్షకత్వముగల అనుభావములు మనస్సుతోను, బాహ్య విషయములతోను సంబంధము కలిగి యుండక తప్పదు అనగా వసమగ్రములు, పరతంత్రములునగు అనుభావముల ప్రధానము లగుటచే స్థాయి భావములు కావలెను, చిత్తవృత్తివిశేషములు గాక పోవుటచే నివి సంచారిభావములుకూడ కావలెను మన వృత్తు లుద్దీప్తములై ప్రవృత్తిపరములైనపుడు శరీరమున కన్పించు పరిణామములను అనుభావములందురు అనుభావతుల్యములైనవి సాత్త్వికభావములు వీటిని స్థాయిభావములుగా గాని, సంచారి భావములుగా గాని స్వీకరింపరాదు

ఇంద్రియార్థ సంయోగవశమున స్థాయి భావము సంచారి భావముతో నన్వితమై ప్రవృత్తమగుచున్నది. సంచారిభావము నుద్దీపింప జేయగల శక్తి బాహ్య వస్తువున గలదు. ఇట్టి యుద్దీపనము మానసికముగా జరుగుచున్నను, శారీరకముగా నభివ్యక్త

మొలుచున్నది. కేవలము శరీరముగాని, కేవలము మనస్సుగాని బాహ్య వస్తువును గ్రహించుట లేదు మనోదేహములతో కూడిన వ్యక్తియే బాహ్యవస్తువు నవగతము చేసికొనగలుగుచున్నాడు

చేతనమైన వ్యక్తియొక్క అనుభూతులు ప్రయోజనసహితములు ప్రవృత్తి భేదముచే ప్రయోజనభేదము వచ్చును మనముచేయు ప్రయత్నముయొక్క తీవ్రతాద్యధికము నాధారము చేసికొని ఈ భేదము వచ్చుచున్నది మనము కొంచెమేమరి యున్నచో మన ప్రయత్నమున నీ యేమరిపాటు కన్పించగలదు సంచారిభావ మతితీవ్రరూపమున నుద్దీపితమైన నుద్దిష్టార్థమును గూర్చిన ప్రయత్నము కూడ తీవ్రత నందగలదు ఈ తీవ్రత యున్నపుడు అన్యకార్యాపేక్షగాని, విశ్రాంతిగాని యుండవు ఇట్టి తీవ్రత ప్రధానముగా మానసికమై, శారీరకముగా నభివ్యక్తమగును సంచారిభావము నుద్దీపించిన సన్నివేశము కొనసాగునంతవఱకు తీవ్రత తగ్గదు అనగా సంచారిభావానుభూతి మనోదేహ సంవలితమైన ప్రవృత్తి ఈ సంచారి భావములో కన్పించు శారీరకములగు మార్పులద్వారా ప్రవృత్తమగు స్థాయి భావమునకనుగుణముగా శరీరమును సిద్ధపఱచుకొనుచున్నాము

శారీరకములగు మార్పులు రెండు విధములుగా వచ్చుచున్నవి శరీరమందలి గ్రంథుల సంచలనముల ద్వారా శరీర స్పందనములు సంభవించుట యొక విధము వీటిని సాత్త్వికభావము లందురు ఇవి సంచారిభావములవలన బయలుదేరు బాహ్యము భావములు భయముద్దీప్తమై పారిపోవుటకు యత్నము జరుగునపుడు నరములద్వారా గ్రంథులు కదలబారుచున్నవి ఈ గ్రంథులనుండి యొకానొక ద్రవము రక్తనాళములోనికి ప్రవహించును. రక్తనాళముల నీ ద్రవము ప్రకోపింపజేయగా కాలేయమున చక్కెరవంటి పదార్థముద్భవించును రక్తమీ పదార్థమును కండరములకు తీసికొనిపోగా కండరములు శక్తివంతములై పరుగెత్తి పోవుటకు తోడ్పడుచున్నవి భయక్రోధము లుద్దీప్తములైనపుడు శారీరక పరిణామము లతి త్వరగా, అతి తీవ్రముగా నీరీతిగా జరుగగలవు ఈ విధమగు శారీరక పరిణామములలో ముఖ్యమైనవి ఎనిమిది గలవు స్తంభమున కదలిక యుండదు భయము, వ్యాధి, అమితానందము మొదలగువానిద్వారా నిది వచ్చును. క్రోధ, భయ, హర్ష, లజ్జా, దుఃఖ, శ్రమ, రోగ, తాప, ఘాత, వ్యాయామాదులద్వారా చెమట పోయును శీత, భయ, హర్ష, స్పర్శ, క్రోధ, రోగములవలన గగుర్పాటు కల్గును భయ, హర్ష, క్రోధ, జరా, రోగ, మదములవలన స్వరభేదము బయలుదేరును. శీత, భయ, హర్ష, రోష, జరా, స్పర్శములవలన వణకుట కల్గును శీత, క్రోధ, భయ, శ్రమ, రోగ, క్లమ, తాపములద్వారా వైవర్ణ్యము రాగలదు ఆనంద, అమర్ష, ధూమ, అంజన, జృంభణ భయ, శోక, అనిమేష ప్రేక్షణ, శీత, రోగములనుండి కన్నీరుకారును శ్రమ, మూర్ఛ, మద, నిద్ర, అభిఘాత, మోహములు ప్రలయమును తెచ్చుచున్నవి మనోగతభావము లుద్దీప్తములైనపుడీ మార్పులు శరీరమున కన్పించగలవు

సత్త్వమనగా సజీవమగు దేహము ఈ దేహమునకు సంబంధించినవి సాత్త్విక భావములు సాత్త్వికాద్యను భావములు సంచారిభావ జన్యములుగా కన్పించుచున్నవి, జేమ్సు (*James*), లాంగే (*Longe*) అను మనస్తత్త్వ శాస్త్రజ్ఞులొక విపరీత వాదమును లేవదీసినారు శారీరకమగు మార్పువలన, అనగా అనుభావమువలన, జనించునది సంచారి భావమని వీరి వాదము మన మేడ్చుటచే శోకమను సంచారి భావము, కొట్టుటచే క్రోధమను భావము, వణకుటచే భయమను భావము వచ్చుచున్నవనుట లౌకిక ప్రతీతికి విరుద్ధముగా పల్కుటయే కాని శారీరకములగు అనుభావములు లేనిచో సంచారి భావము లర్థరహితములు కాగలవను ఈ వాద సారాంశము పరమ ప్రామాణికమే

ఒకానొక వేదనను (*Feeling*) తెల్పునది సంచారి భావము వేదన బాహ్యవిషయము నాధారముగా చేసికొని వచ్చునది ఈ బాహ్యవస్తువు కన్పించగానే సంచారి భావ ముద్దీపితమగుచున్నది. స్థాయి భావమును ప్రవృత్తి పరముగా చేయు సంచారి భావమునకు, స్థాయి భావమునకు గల భేదమును జేమ్సు గమనించలేదు. ప్రతి సంచారిభావములోను వివిధాంశములు గలవనియు, ప్రతి అంశము శారీరకమగు దేహముద్వారా ప్రవృత్తమగుచున్నదనియు, కాగా సంచారి భావము కేవలము శారీరకమేననియు జేమ్సు వాదము. అనగా సంచారిభావము (*Emotion*) నకు అను భావ (*Sensation*) మను నర్థమును చెప్పవలసి యుండును. విషయ దర్శనవలన కలుగు మార్పులు ప్రవృత్తిపరమగు మనశ్చేష్టి యంత్రితములై గ్రహింపబడునవి సంచారి భావమును భావరహితమైనచో అర్థరహితమే యగును కాని అనుభావములకంటె విలక్షణమైన సంచారి భావము లేదనుట పొరపాటు శరీరము మొద్దుబారినచో సంచారి భావము ననుభవింపజాలని మాట వాస్తవమే. కాని అనుభావములు, సంచారి భావములు అవినా భావ సంబంధము కలవని గుర్తించవలెను.

అనుపహితమగు మనస్సును సత్త్వమందురు. ఇట్టి మనస్సునుండి భావములు జన్మించుటచే భావము లన్నియు సాత్త్వికములే యగునని శృంగార ప్రకాశి కారుడనినాడు. కాని సమస్త భావములు సత్త్వమూల కము లగుటచే సాత్త్వికము లైనను, స్తంభస్వేదాదులు కేవలము సత్త్వమునుండి జన్మించుటచే వీటికే సాత్త్విక భావములనుపేరని సింగభూపాలుడు నిర్ణ యించినాడు. మనః ప్రభావమైనది సత్త్వము. సమా హితము మనస్సునుండి వచ్చునది సత్త్వము. మనస్సు సమాధిలో నున్నపుడు సత్త్వ నిష్పత్తి జరుగును. ఈ సత్త్వము రోమాంచాది రూపమున వ్యక్తమగుచు న్నది. ఒక వ్యక్తియందే వ్యక్తీకరణమెట్లు జరుగుచు న్నదో దాని నితరులనుకరించగలరే గాని, తదభిన్న ముగా జూపలేరు. అనగా సాత్త్విక భావములు మూల వీక వృత్తులవలన సుత్పన్నములగు అనుభావము లగుట చేత వ్యక్తి భేదముతో భిన్నములుగా భావించగలవు. సాత్త్విక భావానుగతములు సంచారి భావము సుఖ దుఃఖాది హేతుక మగుచు స్థాయి భావమును ప్రవృత్తి పరము చేయుచున్నది. సంచారిభావ సుద్దీపితము కాగా తదభివ్యక్తిలో నేర్పడు శారీరక పరిణామములే సాత్త్విక భావములని తాత్పర్యము.



'సంజవేళ'

చిత్రకారుడు: శ్రీ పేరి సుబ్బారావు, అమలాపురం.

# ఆంధ్ర సంస్కృతి



శ్రీ నోరి నరసింహశాస్త్రి

ఆంధ్రరాష్ట్రము అవతరింపవలెనను ఆందోళనము ఎక్కువగుచున్న కాలమునుండియు తరచుగా 'ఆంధ్ర సంస్కృతి' యను పదము వినబడుచున్నది. ఆంధ్రులకు ప్రత్యేకముగా నొక సంస్కృతి కలదా? ఉన్నచో నది ఏమి? దాని స్వరూప మెట్టిది? — నిష్పక్షపాతముగా విచారింప యత్నింతము.

ఒక ప్రత్యేక సంస్కృతి యున్నప్పుడది వారి శిల్పమునను చిత్రకళలోను వాఙ్మయమునందు సంగీతమున, గృహవాస్తువు గ్రామనిర్మాణము పుర నిర్మాణము నావా నిర్మాణము, మతము, తత్త్వవిచారము, వేషము, ఆచారములు, సాంఘిక వ్యవస్థలు, ప్రకృతి సిద్ధ సంస్థానము, చరిత్ర—ఇత్యాది సమస్త విషయము లందును ప్రతిబింబించును. అట్టి ప్రత్యేకత ఏమైనను ఆంధ్రులకున్నదా?

ఆంధ్ర శిల్పము ఆంధ్రుల చిత్రకళ యని పలుమారులు పత్రికలలో చదువుచుందుము, ఉపన్యాస వేదికలనుండి వినుచుందుము. ఆంధ్ర శిల్పమన్న వెంటనే అమరావతి నాగార్జునకొండ ఉదహరింతురు. చిత్రకళ యనగానే అజంతా యందురు. పుర నిర్మాణ మన్నంతనే హంపి విద్యానగరము పేరెత్తుదురు. ఇందులో నేవి నిజముగా ఆంధ్రుల సొత్తులు? వాని ప్రత్యేకత ఏమి?

మనమెంత కాదన ప్రయత్నించినను, అజంతా గుహాలు తెలుగు దేశము మధ్యములో లేవు. అవి మహారాష్ట్రము కన్నడము తెలుగు మిశ్రమైన భాగములో నున్నవి. అందును తెలుంగక్కడ చాల తక్కువ. అజంతా గుహాలు తొలుచుటలోనను అక్కడి గండారములు మలచుటలోనను అందలి చిత్రములు వ్రాయుటలోనను ఆంధ్రదేశములోని పనివారు గూడ తప్పక పాల్గొనియే యుందురు. కాని అజంతా ప్రత్యేక ఆంధ్రులదనుట బుద్ధిమంతు లంగీకరించుమాట కాదు.

అటే విధముగా విద్యానగరము! విద్యానగర సామ్రాజ్యమును తరచుగా కర్ణాటక రాజ్యమనువారు. శ్రీ కృష్ణదేవరాయలు ఖ్యాతి చెందిన పిమ్మట కలిగిన యంతఃకలహములను పురస్కరించుకొని గజపతి విద్యానగర రాజ్యములోనికి దండెత్తిరాగా, అల్లసాని పెద్దన కోపించి ఒక సీసపద్యము వ్రాసి గజపతికి పంపినట్లు చెప్పెదరు. అందులో 'కన్నడంబెట్లు చొచ్చెదు గజపతీంద్ర!' అని ఉన్నది. శృంగేరి విరూపాక్ష పీఠాధిపతుల బిరుద గద్యములలో గూడ వారికి 'కర్ణాటక సింహాసనాధీశ్వరు లను' నామము కలదు. అంతమాత్రమున విద్యానగరము కేవలముగా కర్ణాటకుల దని చెల్లదు. మొట్టమొదట నెట్లున్నను దాని యంత్యకాలలో తెలుగు నాయకులు మంత్రులు కవులు ఆ సామ్రాజ్యములో ఎక్కువ పలుకుబడి సంపాదించుకొనిరి. ఏది ఎట్లున్నను మొత్తము మీద కన్నడులు ఆంధ్రులు తమిళులు కొంచెముగా కేరళులు కూడ యథాశక్తిగా దాని స్థాపనకును అభివృద్ధికిని కుదరు నిచ్ఛిత్తికిని గూడ తోడ్పడిన మహారాజ్యమది! అందుచే హంపిలో ఆంధ్రుల ప్రత్యేక సంస్కృతి కొరకన్వేషించుట వృథాశ్రమ.

ఇక మిగిలినవి అమరావతి, నాగార్జునకొండ—కాకున్న భట్టిప్రోలు, ఘంటసాల, గుడివాడ, జగ్గయ్యపేట ఇత్యాదులను చేర్పవచ్చును. ఇవి యన్నియు నిస్సందేహముగా ఆంధ్ర భూమి మధ్య భాగమున నవతరించినవే. మరి దానిచో వాని శిల్పములో నొక ప్రత్యేకత యున్నదా? వానిని గూర్చి విచారణచేయు సందర్భములో నవి యన్నియును చైత్యము లన్నమాట మరువక జ్ఞప్తియం దుంచుకొనవలెను. స్తూపమనుమాట సరియైనది కాదు. అది సింహళమునుండి ఎరువు తెచ్చుకొన్న క్రొత్త పదము. చైత్యమనగా చితి సంబంధమైనది. గౌతమ బుద్ధుని యొక్కయూ అర్హతులయొక్కయూ దేహములను

దహనము చేసి శోషించిన బూదియో ధాతు ఖండమో— దంతమో శల్యమో—భద్రపరచి యా స్థానమును పూజించి ప్రదక్షిణము చేయు నిమిత్తము ప్రధానముగా నవి యవతరించినవి. ఆ ప్రదేశములను చైత్య నిర్మాణమునకు పూర్వమో పరమందుననో భరత దేశము నానా భాగములనుండియే గాక విదేశములనుండి కూడ భక్తులను శిల్పులను ఆకర్షించి యుండినవి మహోత్కృష్టుల దేహశేషములపై అద్భుతమైన కట్టడములు కట్టి పూజా ప్రదక్షిణము నొనరించుట ఆంధ్రుల ప్రత్యేక సంస్కృతి లక్షణ మందురూ? అట్టి సంస్కారము మనలో బహుశతాబ్దములుగా లోపించి పోయినది అటు కానున్నను అమరావతి నాగార్జునకొండ ఇత్యాదుల చైత్య నిర్మాణమునకును విగ్రహ లక్షణములకును ఇతరాంధ్ర శిల్పములకును సాజాత్యమేమైన నున్నదా? ఉన్నచో నేమి? సాంచీ చైత్య నిర్మాణమునకు వీనికి భేదమేమి? ఉన్న స్వల్పభేదములను ఆంధ్రుల ప్రత్యేకతను ప్రదర్శించునా? అట్టిది నిరూపించిన వారిప్పటికి లేరు ఏది యెట్లున్నను తెలుగు దేశములో ఈ చైత్య నిర్మాణ మాగిపోయి ఎన్నో శతాబ్దములైనవి దాని శాఖ లిప్పటివియు గనబడవు అందుచే వానిలో నాంధ్రత్వమున్నదని పొంగిపోవుట నిష్ప్రయోజనము

ఇక నేటి కాలపు చిత్రకారులున్నారు వారిలో కొందరు శ్రీ ప్రమోద కుమార ఛటర్జీ శిష్యులు పెక్కురు శ్రీ దేవీ ప్రసాదరాయ శిష్యులు కొలదిమంది శాంతి నికేతనము వెళ్లి యభ్యసించిన వారున్నారు అంతకంటెను కొద్దిమంది బొంబాయిలో స్కూలు ఆఫ్ ఆర్ట్సులో ఆంగ్లేయ చిత్రకారుని యొద్ద నేర్చినవారు చివరి తరగతిలో కథామాత్రశేషుడైన దామెర్ల రామారావు ముఖ్యుడు అందరును బుద్ధిమంతులే చక్కని చిత్రములు వ్రాయుచున్నవారే! కాని వీరిలో ప్రత్యేకాంధ్రత్వమున్నదా? ఆంధ్రశైలి యనదగినది వీరు నిర్మించినారా? వారు వాడుచున్న యాంధ్రత్వము పూర్వము నుండి అనుస్యూతముగా వచ్చుచున్నదా? తద్విదులైనవారు అట్టిదున్నచో దానిని స్థూలముగానైన నిరూపింపగలరా?

ఇక సంగీతమున్నది త్యాగరాయల వారి పేరు చెప్పుకొని మనము మురిసిపోవుచుందుము. కాని వారితో సహా మన సంగీతవిద్వాంసులకు అభిమానమైనది 'కర్ణాటక సంగీతము' కదా! త్యాగరాయలు స్వచ్ఛముగా తమిళ దేశ మధ్యమున పుట్టి పెరిగినవారు ఆయన సంప్రదాయమును పోషించుచున్నవారిలో తమిళులే అగ్రగణ్యులు; కర్ణాటకులను ఆంధ్రులను వారి తర్వాతనే గణింపదగినవారు. త్యాగరాయ లున్న ప్రాంతములో ఆ కాలమున తెలుగు రాజభాషగా నున్నందుననో మరి యే కారణముననో ఆయన తెలుగులో కృతులు చెప్పుట తటస్థించినది. ఇక తరంగ కాలక్షేపమునని మహారాష్ట్రుల అభంగములను మన వారనుకరించుటచే వాడుకలోనికి వచ్చినట్లు తోచును మరి మిగిలినది తాళ్లపాకవారి పదములు అధ్యాత్మ సంకీర్తనములు క్షేత్రయ్య పదములు ఇట్టివి వీనిలో నైన విలక్షణమైన ఆంధ్ర సంగీతమున్నదనగలమా? సంగీతశాస్త్రవిమర్శకు లింకను అట్టిది విశదపరుపవలసి యున్నది

మరి పురనిర్మాణము గ్రామ నిర్మాణము, గృహ నిర్మాణము—వీనిలో నాంధ్రుల ప్రత్యేకత యున్నదా? పూరిళ్లు దక్షిణదేశమంతటను ఒకటే తీరు వాస్తుశాస్త్ర మనుసరించి కట్టబడుచుండిన మండువా ఇళ్లును అంతట నొకటే పద్ధతి నేటి కాలములో పాశ్చాత్యానుకరణముతో వెలయుచున్న మందిరములు పదేళ్లకొకసారి మారిపోవుచున్న క్రొత్తక్రొత్త తీరులతో నవతరించుచున్నవి ఇందులో నే సంస్కృతి కనిపించుట లేదు గ్రామ నిర్మాణము పుర నిర్మాణమందును సంతే! ఆంధ్రుల ప్రత్యేకత ఏమియు వానిలో కనబడదు

ఆంధ్రనౌకలు ఒకానొకప్పుడు తూర్పు సముద్రమునకే కాక పశ్చిమ సముద్రమునను దక్షిణ సముద్రమునను పసిఫిక్కు అట్లాంటిక్కు మహాసముద్రములందును నిరంతర సంచారములు చేసియుండెను నేను చూడగా తూర్పు సముద్రతీరమందంతటను నౌకలలోను నావికులలోను సాజాత్యమున్నది కళింగులకును తెలుగువారికిని తమిళులకును భేదమగపడదు ఇప్పటికిని బర్మాలో తెలుగు వారిని క్లింగులని వ్యవహరింతురు. ఆంధ్రనౌకలలోను నావికుల లోనను విశిష్టతయున్నచో విదేశీయులైన నది గమనించియుండరా? పూర్వము మోటుపల్లినుండి ఆంధ్రనౌకలు ప్రబంధ సంచారముచేసి 'సప్తద్వీప సమస్త

సందోహంబుం దనకిచ్చు నెచ్చెలి సముద్రుం డ్రీతి గావించిన దినములలో నెట్టిదైన ఆ శాఖలకు విశిష్టత యుండెడిదో! అదియును మనమింకను త్రవ్వి బయలు పెట్టవలసి యున్నది.

ఆంధ్రులకు ప్రత్యేకమత మొకటిలేదు ప్రత్యేకముగా నాంధ్రాచారములును లేవు ఒక్కొక్క కులమునకు ప్రత్యేకమైన యాచారము లున్నవి, వస్త్రాదిధారణ విధానము లున్నవి కాని కట్టులోగాని బొట్టులోగాని ఇది యాంధ్రమైనదని వేరుగా నేమియు లేదు

తత్త్వవిచారణలోగూడ ఆంధ్రులకు ప్రత్యేకత లేదు భరత ఖండములో వ్యాపించిన సమస్త తత్త్వ విచారణలకును ఆంధ్ర విజ్ఞానవేత్తలును యథా శక్తిగా సహాయపడినారు

ఎంతదూర మట్లు విచారించుకొనిపోయినను సర్వతోముఖమైన ఆంధ్ర సంస్కృతి ప్రత్యేకముగా నొకటి యున్నట్లగపడదు ఆంధ్రులకు ప్రత్యేకముగా నున్నది భాష యొక్కటే! అందులో నెన్ని యవాంతర భేదములున్నను ఇది యాంధ్రభాష యని చెప్ప దగినది విస్పష్టముగా నొకటున్నది అందుచే నాంధ్రుల ప్రత్యేక సంస్కృతి యేమైన నున్నచో అది ఈ భాషా పరిశ్రమయందే ఉండవలెను ఏమిటది?

ఆంధ్ర వాఙ్మయ కర్తలలో పూజ్యులగువారు మొదటినుండి ఇప్పటివరకు ఆసేతు హిమాచలభూమిని ఏకముగా సంధానము చేయుచున్న సంస్కృతభాషా ప్రభావము కలవారు సంస్కృత భాషాపాండిత్యము లేని యాంధ్రకవి కొక విషాణమువంటివాడే యన్నయనుండి శ్రీ విశ్వనాథ వరకు నంతే! సంస్కృత భాష నుండియే ఆంధ్రము పుట్టినదనువారి వాదము సత్యము కాకపోయిన నేమి! ఆంధ్రకవుల చేతులలో ఆంధ్రభాష సంస్కృతభాషా సంప్రదాయములలో నడచినది. ఆంధ్రకవులలో కేవల లౌకికపరులు లేరు శివమెత్తి మైమరచి ప్రలాపించు కాముకులకు వారిలో పూజ్యస్థానము లేదు వారందరు నొక పరిపూర్ణత కలవారు, ఆత్మనిగ్రహము కలవారు వారు వాఙ్మయోపాసకులు, అక్షరరమ్యతా వేదులు. అనంతమైన విశాలవిశ్వమును అందున్న ఊహాతీతమగు వైలక్షణ్యము లక్షించుచునే తమ యాత్మలోనికి, కూర్మమువలె తమ యింద్రియములను సంకోచము చేసి కొనగల యోగీశ్వరులు. వారి యభిమానమునకు పాత్రమైనది భరతఖండమే. అయినను అది భరతవర్షములో నొక భాగమనియు, అది మరల జంబూద్వీపములో నొక భాగమనియు నిత్యము ముప్పూటల స్మరించు నాచారము కలవారు. వా రే కాలములో నున్నవారైనను కాల మనంత మని దాని ప్రభావ మెరిగినవారు ఒక కాలములో ఒక దేశములో ఒక ఉపాధి చేకొని ఈ వాడు జన్మించియున్నను, కాలాంతరమున దేశాంతరమున ఉపాధ్యంతరము చేకొని జన్మించి యుంటిమనియు, ముందు జన్మింపగలమనియు వారెరుగుదురు శ్రేయోమార్గము వారి కెరుక అభ్యుదయము వారి కభిమానము తెలుగు కవులు ప్రత్యేకముగా సంపాదించినది శ్రీకారము శ్రీకారము ఆంధ్రకవుల సంస్కృతి చిహ్నము పూర్వకాంధ్ర నౌకలు ద్వీపాంతరములకు శ్రీకారము చిత్రింపబడిన ధ్వజములు స్తంభములపై నాట్యము చేయుచుండ సప్తసముద్రములలో ప్రయాణములు చేయుచుండెడివని చరిత్రకారులు చెప్పుచున్నారు ఆంధ్ర కవులు అద్యులైన ఋషుల సంతతిలోని వారు ప్రత్యేకముగా నాంధ్ర సంస్కృతి యేమైననున్నచో నది యాంధ్ర కవులు వాఙ్మయరంగములో ప్రదర్శించిన ఆర్షదృష్టియే!

ఆంధ్ర సంస్కృతి ఇతర రంగములలో లేక పోవుటకు ముఖ్య కారణములు రెండు. ఒకటి ప్రకృతి సిద్ధమగు సంస్థానము. రెండవది చరిత్ర

ఆంధ్రదేశము ప్రకృతి సిద్ధమగు స్వరూపము గమనించినచో వైవిధ్య మెక్కువ కనిపించును కొంత పర్వతమయమైన భూమి, మరికొంత తీర భూమి, కొంత మైదానము, కొంత తృణ జల సంపూర్ణము, కొంత నిర్జలము ఇంతే కాదు. దీనికి స్వభావ సిద్ధమైన ఎల్లలు లేవు తూర్పున మాత్రము సముద్రమున్నది. ఉత్తరమునగాని దక్షిణమునగాని పశ్చిమమునగాని దానికి నైజమగు హద్దులు లేవు. సరిహద్దులు నిర్ణయించుట యందుచేతనే మనకు కష్టతరమగుచున్నది ఆంధ్ర వాఙ్మయ సంస్కృతి దాని స్వీయపటుత్వమువల్లనే దక్షిణమున కావేరీ తీరమును గూడ దాటి విజృంభించినది. తంజాపురమే కాక మధురకూడ దాని నిర్మాణయంత్రశాల యైనది.

పశ్చిమమున కల్యాణకటకమే కాక భూపాలాంబయాలు కూడ దాని క్రీడాస్థానములైనవి. ఆంధ్ర వారపత్రికయు సంవత్సరాది సంచికలను ప్రథమములో బొంబయినుండియే వెలువడి యాంధ్రదేశము నారు మూలలకు ప్రసరించిన వని మనము నిరంతరము స్మృతిలో నుంచుకొనవలెను. ఉత్తరమున నది మహానదితో సమీపించి నాగపురము కటకము కూడ నది ప్రవేశించినది. ఇప్పటికిని ఓఢ్ర కవులు తెలుగు కవిత్వము కూడ చెప్పగలుట తమ ప్రతిభకు నిదర్శనముగా భావింతురు. ఆ పైకి మగధములోనికి గూడ మున్ముందు నది దారులు చాపినది. ప్రకృతి సిద్ధమైన ఎల్లలు లేకుండుటయే నిరాఘాటముగా నది దూర ప్రయాణములు మున్ముందు చేయగల్గుటకు కారణము.

మరి యాంధ్రుల చరిత్ర విచారించినచో నట్టిదే ఇంకొకటి తేటపడును. ప్రస్తుతము తెలుగు భాష ప్రధానముగా జనులు మాట్లాడుచున్న భాగమంతయు ఎన్నడును ఒక్క ప్రభుత్వముక్రింద లేదు. కాకతీయులలో గణపతి దేవుడు రుద్రమ ప్రతాపరుద్ర దేవుడు — ఈ మువ్వురి కాలములో మాత్రము ఆంధ్ర దేశములో చాల భాగము ఒకే ప్రభుత్వముక్రింద నుండుట తటస్థించినది. అప్పుడే 'ఆంధ్రోర్వీశ'లను పేరు వారికి లభించినది. కాని యదియంతయు నొక శతాబ్దము కంటె నించుక తక్కువగు స్వల్పకాలమే. అది జరిగి ఏడు శతాబ్దములు దాటినవి. అంతకు పూర్వముగాని ఆపిమ్మట కాని ఆంధ్రులకు ఒక దేశముగాని ఒక ప్రభువుగాని ఒక రాష్ట్రముగాని ప్రత్యేకముగా నుండలేదు.

భరత ఖండము స్వభావసిద్ధముగా వింధ్య పర్వత శ్రేణిచే రెండు ప్రధాన ఖండములుగా విభజింపబడుచున్నది. ఈ రెండు ఖండములును ఎప్పటికైనను వేరయిపోవు నవకాశము లున్నవి. అట్టిదానికి సూచన లిప్పుడే కనబడుచున్నవి. హిందీని రాష్ట్రభాషగా చేయ నిశ్చయించినప్పటినుండియు ఇది పరి పరి విధములుగా తల చూపుచునే యున్నది. అదిగాక ఈ రెండుఖండముల సంస్కృతిలో కూడ విస్పష్టము విశేష భేదమున్నది. విదేశీయుల దాడులు ఎక్కువగా ఉత్తర ఖండమును తగిలినవి. అందుచే నక్కడ ప్రాచీన భారతీయ సంస్కృతి విచ్ఛిన్నప్రాయమగుచున్నది. దక్షిణ ఖండమో? అది యంత యలజడి పొందలేదు. అందుచే పురాణసంస్కృతి ఇంకను కొంత యక్కడనే శేషించియున్నది. ఉత్తర ఖండములో తొందరపాటెక్కువ. దక్షిణ ఖండములో జాప్యమెక్కువ. ఈ రెండు ఖండములను ఎప్పటికి చీలిపోకుండుట భరతఖండమునకు శ్రేయస్కరము. కాని తప్పని సరియై చీలిపోయినను ఒకరి గొంతు ఒకరు కోసికొను శత్రు ఖండములుగా గాక తండ్రియాస్తి మైత్రితో పంచుకొను నిద్దరు సోదరుల విభాగముగానైన పరిణమింపవలసియున్నది. ఈ భారము ఎవరిపై నున్నది?

దక్షిణ ఖండములోని సంస్కృతియంతయు కలిపి ఉత్తర ఖండమునకు మిక్కిలి సమీపముగా నున్నది మనము, తెలుగు దేశములోనివారము. ఈ భాగ్యము మనతోపాటు మహారాష్ట్రులకును గలదు. ఆంధ్రులకును మహారాష్ట్రులకును అనాదిగా సన్నిహిత సంబంధమున్నది. ఈ రెండు భూభాగములే భరత భూమికి మధ్య భాగములో నున్నవి. అది కీలక స్థానము. శాంతి సుఖేచ్ఛులైన ఆంధ్ర మహారాష్ట్రములు శాంతి సుఖేచ్ఛుపైన భరతఖండమునకే పునాదులు. కృష్ణా గోదావరీ నర్మదానదులే గంగా సింధు నదుల పవిత్ర వారిని కావేరీ తామ్రపర్ణి పుణ్య తోయములతో ఏకము చేసి వింధ్య పర్వత గర్వమును నిర్మూలింప సమర్థమైనవి. అఖిల భారత సామరస్యము సాధించు భారము ఆంధ్రులపైనను మహారాష్ట్రులపైనను ప్రధానముగా కలదు.

ఇది చేయుటకై క్రిందట తెలిసికొనిన నాదాంధ్ర కవి నన్నయభట్టారకుడు! ఆంధ్రరాష్ట్ర మవతరించినతో ఆంధ్ర కవులు వాఙ్మయ రంగములో ప్రదర్శించిన విశాలదృష్టిచే సమస్త రంగములలో విజృంభింప చేయుదురుగాక!

# సంసారం



శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ

'అహోబలరావు' ఆ కాలేజీకి క్రొత్త లెక్చరరు. అతను ఉదయం లేస్తూనే ఒక అఫీయిర్కు పనిచేశాడు. తత్పర్యవసానంగా పంతొమ్మిది సైకిళ్లు, పాతిక కారులు, పావు డజను లారీలు, ఒక గ్రోసున్నర రిక్షాలు ఎక్కడి వక్కడనే సడెన్ బ్రేకులు త్రొక్కుకుని స్తంభించిపోయినై.

అక్కడికి కొంతమంది కార్యశూరులు పోగయ్యారు. వాళ్లు ఉపన్యాసాలు దంచి సందేశాలు యిచ్చే రకంగాదు. ముఖ్యంగా ఆ వాళ్లకు అందులో వయసులో చిన్నవాళ్లకు ఏదన్నా ఆపద వస్తుందా మనం సేవచేద్దామా అని కాసుక్కూర్చుంటారు. ఈ అవకాశం ఎట్లా లభించిందంటే—

నర్సరావుపేట జంక్షనులో—రైలు కూడా అంగీకృతమే రావటంవల్ల పెద్ద స్టేషనునుంచి వచ్చే ప్రయాణీకులు, మామూలుగా కోర్టువారీ పనులమీద తిరిగే జనాభా, చిన్నచిన్న సందుల్లోంచి 'కూలీ-నాలీ' కోసం ఎప్పటికప్పుడు నిగుడ్కుంటూ తిరిగే బీదా సాదా, వాహనాధిపతులు అందరూ కలుస్తున్నారు అక్కడ ఆ వుదయం ఎనిమిది గంటలప్పుడు.

అటువంటి మాంఛి యమరద్దీలో, పోలీసు కనిస్టేబు తెల్లబోతున్నాడో, అభయహస్తమిస్తున్నాడో తెలియని పరిస్థితిలో, ఓ కాలేజీ భామిని, అగోడు సుకు—కను మూసి కను తెరిచేలోగా—రెండువందల డెబ్భై డిగ్రీల ప్రదక్షిణాన్ని పూర్తిచేసి, అపర సత్యభామాదేవిగా త్రొక్కుకుపోతున్నది సైకిలును.

అహోబలరావు అప్పుడే కాఫీనిమిత్తం బయల్దేరి వస్తున్నాడు. స్థానిక, దినపత్రికా సాంప్రదాయిక వారపత్రికా విలేఖరులు కూడా చూస్తున్నారు 'న్యూస్' దొరక్క దిగాలుపడి. అవిధ జార్జెట్ నీలిక్క చీర రెపరెపలు సైకిలు పెడలుతో సరాగాలాడ్డం అహోబలరావు చూశాడు. ఆతని డబల్ బ్రెస్ట్ కోటు గుండీ 'ఫట్' మని తెగింది.

'ఆ హా !!!' అంటూనిస్తుబోయి రోడ్డు కడ్డం బడ్డాడు.

ఇక ఆ నవీనాంధ్ర యువతి అహోబలరావు ఆశ్చర్యార్థకానికి గుండె చెదిరి, అమాంతం చెదిరి, త్రొక్కుతూ త్రొక్కుతూన్న సైకిల్ని ఎదురుగుండా వస్తూన్న రిక్షాకు రాసి, ప్రక్కనే రోడ్డు వారగా పెరుగుతట్ట నెత్తిన పెట్టుకొని తనదారిని తాను పోతూన్న ఓ నడివయస్సు గొల్లమనిషిని అమాంతం నవికనుంచి ఢీకొన్నది.

ఒకడు ఆ అమ్మాయిని లేవదియ్యబోయాడు 'నవుమొట్టకు మట్టకు మని కురుజనంబుల లోనికి దూరిన ద్రౌపదియుంబోలె' లేచి దూరంగా నిల్చొని, ఆ చక్కటి విశాలమైన నేత్రాలలో కన్నీటి కదలికల వాసరపేర్పడగా, పిండుకోసాగింది చీరను. మరొకడు ఆ లేడీ సైకిలు హాండిలును వంకర్లు సాగదీశాడు. ఇంకొకడు దూరంగా దొర్లి బురదలోపడ్డ పుస్తకాలు ఏరి, స్వయంగా తుడిచి, చేతి కందిచ్చాడు. వేరొకడు ప్రాప్తకాలజ్ఞుడు 'టించర్ యోడిన్' కోసం పరుగెత్తాడు.

తరువాత ఆ అమ్మాయి రిక్షాలో కూర్చుంది.

ఒక పెద్ద మనిషి ఆవంకర సైకిలును ఎట్లాగో నడిపించుకుని వెనక్కాలే వెళ్లాడు.

ట్రాఫిక్ రూల్స్ తెలియని అహోబలరావు 'గప్ చిప్'గా కాఫీహోటల్లోకి దూరాడు.

ఏపాప మెరుగని పెరుగుతట్టలమనిషి, చెల్లా చెదరైన పిడతల్నీ, ముంతల్నీ ఏరుకుంటూ 'పదుగురుచే గుంటలకి మొగదేసాలు, ఎదవ కాల మొచ్చిపడింది.' అని గొణుక్కుంటోంది.

## 2

అహోబలరావు కాలేజీ దుర్దినం ఒకటి వెంటొకటి అవకతవకలు, పొరపాట్లు, తుడుపులు కొట్టివేతలూ దిగాలుపడి కూర్చుండిపోయాడు హోటలు కొచ్చాక గది తలుపులు తెర్చుకుని కూర్చున్నా అతనికి అలివేలు, అలివేలు వ్రాసిన ఉత్తరాలు, తన చేత అన్ని పనులు సక్రమంగా చేయించగల ఆమెలోని చైతన్యశక్తి, అన్నీ ఒక్కటొక్కటే గుర్తుకు రాసాగినై జేబులోంచి యిదివరకు ఆమె వ్రాసిన ఒక ఉత్తరాన్ని తీసి చదువ నారంభించాడు

'నాకు మిమ్మల్ని ఎట్లా కాపాడుకోవాలో ఎవ్వరూ నేర్పలేదు కనీసం కొన్ని సూచనలన్నా చేసివుండలేదు మా నాన్న నాకు కొద్దిచదువే చెప్పించాడు మా అమ్మ కుంపటి అంటించటం అంట్లు తోముకోవటంలాటి యింటిపనులన్నీ నేర్పింది నేను నా స్నేహితుల్తో ఆటీ పాటీ, సంగీతను ముగ్గులు, చింతపిక్కలు, గచ్చకాయలు, త్రాడాట, త్రొక్కుడు బిళ్ళలతోటే వ్యర్థంగా గడిపేశాను నా చిన్నతనమంతా నాకున్న మిడిమిడి జ్ఞానంతోనే 'అది అట్లా కాదు యిట్లా— యిది యిట్లా కాదు అట్లా—' అంటూ వేధిస్తున్నాను దాన్ని మీరు నన్ను సంస్కరిస్తున్నారనే పెద్ద ముక్క వేసి నాపరంగా వాడుకున్నారు 'నాకేమి తెలుసును? నేను చాలా అప్రయోజకురాల్ని' అనకండి, ఎవరికున్న ప్రయోజకత్వం వారికుంది అంతా మీకన్నా ఎన్నో అంతస్తులు పైనవున్నట్లు మీరు గణించుకుని భావించకండి ఎవరైనా పరిహాసిస్తూ మాటలంటే, అవన్నీ మనస్సుకు పట్టించుకుని బాధపడ్డం భావ్యంకాదు '

ఇవన్నీ ఒకటినొంటొకటి జ్ఞాపకాని కొస్తున్నై జరిగిన విషయాలను అక్షరాల్లో పొదిగి అర్థాంగికి తెలియపర్చటాని కతని కేదో సిగ్గనిపించింది కాని వెంటనే ఆ అమ్మాయి విన్నపం గుర్తు కొచ్చింది 'సమర్థురాల్ని గాకపోయినా అప్పుడప్పుడు మీరు పొందే సుఖదుఃఖాల్ని యీ చరణదాసికి తెలియ జేస్తూవుండండి అందువలన ఎక్కువ ఫలితం వున్నట్లు కనుపించక పోయినా, ఎంతో కొంతమా కథ గుర్తుకొచ్చి ఒక రకమైన తృప్తి కలుగుతూంటుంది. నేనుకూడా ఏమైనా చేయగల్గు అవసరం వస్తే మీకు' అని.

అతనిక వుండబట్టలేకపోయాడు సొరుగులోంచి కాగితాలు కలమూ లాగి బల్లముందు కూర్చున్నాడు బలవంతాన కళ్ళలో నీరు తిరుగుతున్నా అపుకుంటూ యెట్లాగో కలంతీసి వ్రాయ నారంభించాడు

'నీకు వ్రాయకుండా యీ నా అసమర్థతవల్లా తెలివితక్కువతనంవల్లా కలిగే ఫలితాలను నేనే అనుభవిద్దామనుకున్నాను కాని నీకు ఏ వాగ్దానమైతే యిచ్చానో దాన్ని ఉల్లంఘించే శక్తి నాకు లేదు క్లుప్తంగా చెప్పాలంటే నువ్వనుకున్నట్లుగానే జరిగింది మొదట్నుంచీ జాగ్రత్తగానే వున్నాను బలహీనతలెక్కడా బయల్పడనివ్వలేదు కాని యీ బెజవాడ ప్లాటుఫారంమీద అడుగుపెట్టిన మరుక్షణంనుంచి అంతా మారిపోయింది ఏ పనులు చేయకూడదనుకున్నానో అవే చేస్తున్నాను వేటిని గూర్చి ఆలోచించి మనస్సు పాడుచేసుకోకూడదనుకున్నానో వాట్ని గూర్చే ఆలోచిస్తున్నాను

నేను 'గాబరా' మనిషినవటం వల్ల ప్రతీదీ ముందే విపరీతంగా వూహించుకుని పప్పులో అడుగు వేస్తూంటాను ఈ ప్రిన్సిపాలు నన్నెరుగును ఇదివరకు నేనీయనవద్ద చదువుకున్నాను కాని పూరా రూములో కెళ్ళగానే నాకు ఆసనమిచ్చి చాలా మర్యాదచేశారు నా పేరుచెప్పి 'ఆర్డరు' చేతిలో వుంచాను ఆయన ఆశ్చర్యపడి నోరు తెరిచాడు కాస్సేపటికి నవ్వి కరచాలనం చేస్తూ—'మిస్టర్ అహోబళ్' నువ్వు చాలా మారిపోయావే' అని నా ఆర్డరు అందుకుని రెండేరెండు ఖాళీలు యింగ్లీషు డిపార్టుమెంట్‌లో ఏర్పడ్డాయనీ, ఒకదాంట్లో ఒక అమ్మాయి చేరిందనీ, రెండవది ఖాళీగా వుందని చెప్పారు నేను సరే అని తలూపాను ఇక్కడో విషయం వ్రాయటం మర్చిపోతున్నాను నే నివ్వాళ ఉదయం జంక్షన్లో ఓ అమ్మాయి సైకిలు మీదనుంచి పడిపోవటాన్ని చూశాను న్యాయంగా చెప్పాలంటే ఆ పడిపోవటానికి నేనే కారణమైనానని వ్రాయటానికి నాకు చాలా సిగ్గుగా వుంది. ఆ మొదటి తెల్లవారు ఆమె కాలేజీకి సైకిలుమీద వస్తూ పోతూంటుందని విన్నాను కాని ఆవిడను నేను చూడలేదు

అట్లా అనల్యాక్త్రీ ఎవరో తెలుసుకోకుండానే యీ సైకిలు మీద నుంచి పడ్డ అమ్మాయే ఆ మాటోటి లెక్చరరు అనుకున్నాను అట్లా ఎందు కనుకున్నా నంటే నేనేమీ చెప్పలేను అపోహపడ్డం మాత్రం జరిగింది.

నాకు రోజుకు సుమారు మూడు గంటల పని తరిమ్మ సమయాల్లో కాంపోజిషన్ గ్రంథాలు సంస్కరించాలి నన్ను మొదటి సంవత్సరానికల్లి 'గద్యం' క్లాసు తీసుకోమన్నారు అది సులభమే— నాకు బాగా వచ్చు కాని యీ గాబరా పోక టారము—కసుపులోంచి దేవేస్తున్నది వినా నేనెన్నడూ పది మందిలో ఉపన్యాస మిచ్చిన వాడ్ని కాదు నాలుక పిడచ కట్టింది గొంతుపొర్లు కాబోలు కాఫీ త్రాగాను ముచ్చెమటలు పోశాయి ఒణుకుతూన్న కాళ్లతో ఎల్లి కుర్చీలో కూలబడ్డాను అనేక జతల కళ్లు నావైపు తిరిగాయి. చాలా తిలకా యాలు అలుముకున్నట్లు చెట్టి పిసతల దొంతరలాగున అగుపించాయి ఎల్లాగో ఆ ఓటెండెన్సు వేసుకున్నాను దాని, తగలేస్తే అప్పుడే అవాంతరం రావాలా! మొదటి పాఠం తెరిచి వ్యాసకర్తను గూర్చి గొంతు మార్కులు వెలుడామని గొంతు విప్పబోతున్నా న

ప్రొద్దున్న సైకిలు మీద నుంచి పడిన ఆ అమ్మాయి పుస్తకాలు ఒక — అరోపుచ్చుకుని, గుమ్మందాకా వచ్చి నన్ను చూసి ఆశ్చర్యపడి అడుగు జొనక్కు చేసి నిల్చినట్లుగా, నాకు తోచింది

నేనిక్కడే తవ్వుకున్న గోతిలో పడ్డాను అప్పలామెను పల్కరించక పోయినా బాగుండే పోయేది.

'ఇది మీ క్లాసా?' అని అడిగాను

'అవును క్లాసే ' అంది మాంథి పొగరు బోతు తనంగా చద్మా! ఈ అమ్మాయి లెక్చ రరు—యీ క్లాసు అవిపదేకాబోలు ఎరక్కపోయి చిక్కడ్డాను యిందులోనని, తెవుల్చుకుండామనే పుస్తకంతో—

'సారీ! ఇది నాక్లాసనుకున్నాను టైం టేబుల్లో అల్లానే వుంది పొరపాట్లు జరుగుతూం టాయి. మీక్లాసైతే మీరే తీసుకోండి' అని మృదు వచనాలతో పుస్తకం మూసి యివతలకొచ్చి తేరుగా 'బ్రిన్సిపాలు' రూములో కెళ్లాను. యీ అవకతవకం సంగతి ఏదో గట్టిగా కనుక్కుందామని

బ్రిన్సిపాలుగారు నా అవివేకానికి విసుక్కున్నారు 'నీలో ఏదో మార్పు వచ్చిందనుకున్నాను. నవ్వ్ర మునపట్లానే వున్నావే' అని తరువాత తెలిసింది—ఆ అమ్మాయికూడా విద్యార్థి నేనని. నే ననుకున్నట్లు లెక్చరరు కాదని

నాకిప్పు డిల్లు కదలటానికే సిగ్గుగావుంది కదిలి బయటకొస్తే అంతా పకపకా నవ్వుతున్నారు. ఆసపిల్లలు నేను వస్తుంటే, 'లెఫ్ట్! రైట్!' అని కదం తొక్కుతూ పాడుతున్నారు. నే నందరికీ లోకువైపోయాను తోటి లెక్చరర్లు నన్ను కోలాహలం పట్టిస్తున్నారు ఈ బాధకు పొట్టను పోషించుకోవటానికి వచ్చినవాణ్ణనే 'దరూ-జాలి' యీ కాలేజీపుర వాళ్ళలో, కోసినా ఏ ఒక్కడికీ నామీదలేదు

ఏం చెయ్యను అలివేలూ? అంతా నన్నూ నా బ్రతుకునీ హేళన చేసేవాళ్లే

నీ

అహోబలం వు

# 3

క్లబ్బునుంచి పెందరాళే వచ్చిన ప్రసాదరావు టెన్నిస్ రాకెట్ను వూపుకుంటూ కిటికీ వస్తున్నవాడల్లా ఎప్పుడూ లేని యీ యింట్లోని నిస్తబ్ధతకు కొద్దిగా ఆశ్చర్యపడుతూ, బయటే పేము కుర్చీని జాజిపందిరికి దగ్గరగా లాక్కుని అందులోకి ఘటాన్ని జారవేశాడు

ఈ సమయానికి యిల్లంతా మార్మ్రోగించే కేకలూ పలకటం లేదు మనుష్యులంతా ఎక్కడా కదలటంలేదు చివరకు యింట్లో ఎవ్వరూ లేరా అని అనుమానం వేసింది క్షణంలో జాజిపందిరిమీదనుంచి వచ్చే సువాసనకు అతను యీ అనుమానాలన్నీ కట్టి కట్టి ఒకమూలత్రోక్కి విశ్రాంతి ననుభవిస్తూ కూడను కుర్చీమీద బ్రేలాడేసి కళ్లు మూసుకున్నాడు. కళ్లుమూసుకోవడ మేమిటి? ప్రసాదరావుకి పిలిస్తే నిద్రాదేవివచ్చి వాళ్లోవ్రాలుతుంది. అతడట్లానే నిద్రపోయాడు.

వరండాలోని ప్రసాదరావు వరండాలోనే నిద్రపోతున్నాడు. హాల్లోని దమయంతి విసుక్కుంటోంది—

'ఆక్లబ్బునుంచి యీ పాటికేనా తిరిగివస్తే బావుండును, డాక్టరుకు కబురు చెప్పేవాళ్లు లేరు ఇక నేనైనా వెళ్తాను ' అని విజయ వుడుకుపోతు తనంగా అంది

'నువ్వు ఆ డాక్టర్ని వాళ్లనీ తీసుకొచ్చావంటే బావగారు వొట్టే అక్కా ఏతే నా సంగతి వలుగుర్లోనూ పెట్టి నవ్వేడిపించాలని వుందన్నమాట మీకు ' యీ చివరి ముక్కలంటూన్నప్పుడు విజయ నిజంగా ఏడుపుముఖమే పెట్టిందల్లే వుంది

దమయంతి విజయకు దగ్గర సావచ్చి చేతుల మీదరాస్తూ—

'ఈవేళ ఎంతగంపం గడిచి బ్రతికేవే— చెప్పు ఈ ప్రపంచంలో ఎవరైనా నవ్వుతారని వైద్యం మానుకుంటారా? గోటితో పోతే పోయేది ' మాటకు మధ్యలోనే అడ్డంవస్తూ 'వీల్లేదే అక్కా, నీకు పదివేల నమస్కారాలు యీ కళంతా నాచేత అష్టమైన వాళ్ళదగ్గిరా వాగిం చాలనుందా మీకు '

దమయంతి టేబిలుమీద ఫ్లాస్కుని కెల్లెలిముఖంలోని రోషానికీ, అభిమానమనే ముబ్బు తెరల్లో మునిగిపోయిన ఆమె ముఖబింబానికీ, తన కర్తవ్యాన్ని కానసాగనివ్వకుండా ఆమె అనే అర్థం లేని మాటలకీ గొలుసు కట్టుకోలేక లంకెలందక చివర కిలా అనేసింది

'బావ వచ్చాక యీ సంగతి విని అయనే మంటారో—అప్పుడు నీచేత ఒప్పించి నీ సమ్మతం తీసుకునే డాక్టరికి కబురు పంపుతా రంటావా అయన?'

విజయ ఒక్కమాటు వెనక్కు వార్లబడ్డ దిండు x లేబుతు ఎసెమచేత్తో సర్దుకుంటూ—

'నీకు పుణ్యముంటుంది అక్కయ్యా జరిగిందేదో జరిగింది ఇప్పుడైనా నీవు ఎరక్కపోయి చెప్పావు బావకీ సంగతి తెలియనివ్వొద్దు. అసలే నవ్వుతాలు పట్టిస్తాడు '

విజయ కేమీ పాలుపోలేదు ప్రపంచమంతా తన్ను వేళాకోళం పట్టిస్తూన్నట్టు యీ ముప్పు ఒకరి చేతుల్లోంచి ఒకరికి అందరికీ అందుతూన్నట్టు అందరూ అదేపనిగా నవ్వుతూన్నట్టు తోచి 'అబ్బ!' అని కళ్లు గట్టిగా మూసుకుని ముఖం చిట్లించింది

దమయంతి లేచి 'రికార్డులు వచ్చే టయిమయింది పెట్టమంటావా విజయా?' అంది విజయ రేడియోకేసి చూసి 'పోనీ పెట్టు ' అనేసి యీజీచైరులోంచి లేచి, తన గదిస్తైపు కుంటుకుంటూ ఎల్లాగో నడిచి వెళ్లాలనుకుని గెంతుకుగులు వేసింది

అప్పుడే వరండాలోంచి కళ్లు నులుముకుంటూ హాల్లోకి వస్తూన్న ప్రసాదరావు 'అరే! ఇవ్వాళ విజయ ఎక్కడో బోస్టాకొట్టినట్లుందే? గెంతువందల యూ ఫైరూపాయల సైకిలు ఇటలీనుంచి తెప్పించాను స్పేరు పార్ట్సు కూడా యిక్కడ దొరకవు '

దమయంతి 'చాల్లెండి!' మీరు యిప్పటిగా దయచేశారు ఈవాళ దాని కంతగం తెప్పింవని ,

'అందుకే ఆనందిస్తున్నాను '

విజయ చర్రున వెనక్కు తిరిగి,

'కాలుజారి పడేవాళ్లు పడుతూవుంటే నవ్వే వాళ్లు నవ్వుతూంటారు సంస్కారంలేని మనుష్యులు '

ప్రసాదరావు ప్రతివేషం విప్పుతూ—'ఈవేళ క్లబ్బులో అష్టమైన గాడిదా నా ప్రక్కకు చేరి 'సారీ' అనేవాడే లేను గావయ్యా పడిందినా మరదలు— నా కెందుకు కండో లెన్సని ప్రతిమాలుకుని యిక తల కొచ్చి ఎవరికీ నా తలప్రాణం తోకవరకూ వచ్చిందంటే నమ్మ '

దమయంతి కళ్ళతో ముక్కుతో చేతుల్తో ఎన్ని విధాలుగా అభినయించి వారించాలో అన్ని విధాలుగా వారిస్తూ—

'మీకు పుణ్యముంటుంది అప్పకే దానికి ఊర సంత అభిమానం మీ రూరుకోండి వేళాకోళాలకి కూడా సమయాసమయా లుంటై '

విజయ తన గదిలోకి వచ్చి ఫకేలు మనేలా గదితలుపులు వేసి ప్రక్కమీద బోర్లా పడుకుని తల గడలో తలదూర్చి వెక్కివెక్కి ఏడవ నారంభించింది

'దుర్మార్గా! నే వద్దన్నంతపనీ జరిగింది' అంటూ దమయంతి కొరకొరా ప్రసాదరావుకేసి చూసింది

ప్రసాదరావు రేడియో ట్యూను చేయబోతున్నాడు దమయంతి నెత్తీ నోరూ బాదుకుంటూ — 'మీరు యివ్వాళ ఏమి టిల్లాగ ప్రాణం పీకి పిండేస్తున్నారు? దాని ఒంట్లో ఏమీ బాగులేదు ఆ రేడియోని కాస్సేపు వాగించకండి'

ప్రసాదరావు ఆగి 'నేను సంస్కారంలేని మనిషినిగా మీ చెల్లెలు యింత క్రితమే చెప్పింది' దమయంతి 'ఆఁ' అని వెళ్ళి తువ్వాలు తెచ్చియిస్తూ స్నానానికి లేవండి మీరు నేనూ భోంచేస్తే దానికి యిన్ని వోవల్టీను నీళ్ళన్నా కలిపియిస్తాను'

'ఓహ్హో! ఆ తరువాత మెషిన్లో వేసుకుని చిచ్చికూడా గొట్టవద్దూ నిద్రపడుతుందో పట్టదో అమ్మగారికి పోనీ ఆ పని నేను చేసిపెడతాను'

దమయంతి కోపంగా చూసి—'మీ దగ్గర మంచితనం లేదు ఆ సైకిలు యిటలీనుంచి తెప్పించాను. ఈవాళ క్లబ్బులో అంతా కండోలెన్సు చెప్పారు ఎత్తుకుని చిచ్చిగొట్టు ఇట్లాటి మాటలాడక పోతే, ఆ ఎకిలి పీనుగుతో కనుక్కోగలిగారు? దారికడ్డంపడి ఎకిలిగా నవ్వి అడుక్కొన్నా చెదర గొట్టాడూ యిదేనా చదువు? సంస్కారంలేని మనిషి?'

కన్నీళ్లు చిన్నీళ్లు పాళాలుగా తోలుపుకుంటూ 'కొత్త వీపుతోము మైడియర్ ఏమన్నావు? సంస్కారం లేదనా—వాడూ నాకు తమ్ముడల్లేనే వున్నాడు క్రొత్తగొడ్డు మీ చెల్లెలి విసవిసలకు బెదిరిపోయి దారికడ్డం పడివుంటాడు'

ఓప్రమాదనుంచి చేతుల్ని తీసివేస్తూ పరుషంగా

'ఐతే మీ కేమీ కలగచేసుకోరన్నమాట— ఇవ్వాళ యిట్లా జరిగింది రేపు రెక్కపుచ్చుకు లాగుతాడు మనమంతా చూస్తూ ఊరుకోవలసిందేనా?'

'ఒళ్లు దూసుకుంటాం నేను చిన్నప్పుడు నువ్వు ఆటాయిటూ తిరుగుతూంటే రెక్కపుచ్చుకు లాగితే ఏం చేసేదానివి? అంతే. ఏదో ప్రణయకలాపమను కుని తృప్తిచెందాలి.'

'ఛీ! ఛీ! ఛీ! రామ రామా మీ నోటికి సుద్ధీ బద్ధం లేదు' అంటూ ఆ గదిలోంచి చరచరా వెళ్ళి పోయింది.

ప్రసాదరావు పట్టుపంచె చుట్టుకుని భోజనాల సావిట్లోకి నడుస్తూ, విజయగదిదగ్గర ఆగి 'కొంచెం తలుపు తియ్యవే అమ్మాయీ! పెద్ద అద్దం యిలాగియ్యి —నేను రేపు కనుక్కుంటాను ఆ మహానుభావు డెవడో వాడికోసమని నువ్వు భోజనం మానుకో వడమేమిటి? యిలాగయితే యివ్వాళే తాతయ్యకు కబురుచేసేస్తాను'

లోపల 'విజయ' మాట్లాడకుండా ముఖాన్ని ఎర్రబర్చుకుంటోంది ప్రసాదరావు తలుపునుంచాతూ 'ఇదుగో నువ్వు వాడికోసం బెంగ పెట్టుకోవడం ఏమీ బాగా లేదు రేపు ఉదయం వాణ్ని తీసు కొచ్చి నీ ఎదట పెడ్తాను నీ యిష్టం వచ్చినట్లు చేసుకో—తెలిసిందా యిక రా వచ్చి అన్నం తిను

తలుపు ధళ్లున తెర్చుకుంది విజయ కస్సు మంటూ—

'ఏమిటి నువ్వనేది? ఆ కోతి కోసం నేను బెంగపెట్టుకుంటున్నానా నువ్వు వాడ్ని తెచ్చి రేపు ప్రొద్దున్న నాకప్పగిస్తావుకదూ అప్పగించవు మరి? ఇదుగో యీ అద్దం తీసుకుపో నన్నవనస రంగా యేడిపించకండి నాకు అన్నయ్యా అక్కర్లేదు అర్ధాన్నమూ అక్కర్లేదు' ప్రసాదరావు విజయ అలిగిందని గ్రహించాక మెల్లగా ఉపక్రమిం చాడు

'ఇదుగో అమ్మాయ్ నువ్వనవసరంగా ఉద్రేక పడి లాభంలేదు నన్ను పది తిట్టి నిన్ను పది తిట్టు కుని కాలేజీ మానేసి గొడవ చేస్తే జరిగి పోయింది కలిసిరాదు నేను అన్నంత పనీ చేసి తీరతాను— నాకా సన్యాసి ఎవరో తెలవాలి మరి నేను వాణ్ని ఏ ఉపాయాన్నయినా వెంటపెట్టుకు రాగలను ఆ పైన మీ అక్క యిష్టం నీ యిష్టం—వాడికి ఏ శిక్ష వేసినా మీ యిష్టం కాదనను సరేనా—'

విజయ ఉరుముల్లోంచి మెరుపుల్లోంచి దిగి చల్లబడి

'అతను పాపం క్రొత్త లెక్చరరు. '

ప్రసాదరావు 'చచ్చాను. నువ్వే పాతమంటే కథ అడ్డం తిరిగినట్లే. మీ మాట నమ్ముకుని ఏ పాపా

సం చెయ్యలేరోయిణా చివరకు గాడిదలయేది మగవాళ్లే అవునా!'

విజయ అక్కడ్నుంచి చల్లగా వంటయింట్లోకి జారుకుంది. బయటివరండా చీకట్లో నిలబడి పొంచి వింటూన్న దమయంతి—

'మీ రిక్కడ ఏమిటిచేస్తున్నారు?' అంటూ రొక్కించింది. ప్రసాదరావు 'వుండు డైలమాలో పడి కొట్టుకుంటున్నాను. వన్ టూ త్రీ ఈ రెండు వ్రేళ్లా పట్టగో'

దమయంతి ఒక వ్రేలును చప్పున పట్టుకుంది. ప్రసాదరావు చప్పున గంతి 'డామిట్! మీ చెల్లెలు నన్నే మోసం చేయాలనుకుంది'

'ఏమిటా మోసం?' అంది ఏమీపాలుపోక

'దీన్నే మొదటిమాపులో ప్రేమ-లవ్ అట్ ఫస్ట్ సైట్-అంటారు. విజయ ఆ క్రొత్తశేఖరరుటా వాడ్ని ప్రేమిస్తోంది'

దమయంతి చప్పున నోరుమూస్తూ— 'మీకు మతిపోతున్నదల్లే వుంది. ఆ పాడు నవలలు చదవకుండా వుండలేరు గదా' ప్రసాదరావు ఏమరుపాటుగా వున్న దమయంతి రెండు బుజాల్నూ గిరుక్కున తనవైపుకు త్రిప్పుకుని ముఖంలో ముఖం పెట్టి—'ఈ మీ ఆడవాళ్లు యింతేగావల్ను పైకి ద్వేషిస్తున్నట్లే వుంటారు. లోలోపల ప్రేమ మరగకాగుతూంటుంది. ఈ రోజుల్లో కాలేజి అమ్మాయిల ప్రేమ కాఫీహోటళ్లలో పాలు లాంటిది. దానికి మరగకాగటమే గాని పొంగి పొర్లటమంటూ వుండదు. ఎందుకంటే గంటగంటకీ చెంబెడునీళ్లు కలుపుతూనే వుంటారుగా'

ఈమారు దమయంతి పొట్టచేత్తో పట్టుకుని నవ్వు నాపుకోలేక 'ఇంక మీరు మాట్లాడకండి. చచ్చిపోతున్నాం యింట్లోవాళ్ళం. మీవన్ లాక్ హోంస్ మీరూను' అంటూ వంటయింట్లోకి వెళ్ళింది

ప్రసాదరావు పీటలమీద కూర్చునేసరికి రెండు కంచాలలోను పదార్థాలు వడ్డించబడివున్నై.

లోపల దమయంతి విజయ చేతిలోని గరిటను లాక్కొవాలనే యత్నంలో విఫలురాలై వచ్చి ప్రసాదరావు ప్రక్కను చతికిలబడిపోయింది. ప్రసాదరావు 'ఈ మాస్టారేం? కలువు ' ఇద్దరూ అన్నాలు కలిపారు. విజయ మొదలకుండా వడ్డన చేస్తోంది. ప్రసాదరావు పెదిమ కదిపి ఒక్క అక్షరం ముక్క కూడా మాట్లాడలేదు. దమయంతి లేచాక చూస్తే వాన వెలిసిన ఎండ కాసిన సాయంత్రానికి మల్లే వుంది విజయ ముఖం.

## 4

క్రొత్త శేఖరరు ఆహోబలరావుకు అన్నీ క్రొత్త సమస్యలే. ఉదయం ఏడూ ఎనిమిదీ గంటల మధ్య ముక్కు ముఖం యేకమయ్యేలా ముసుకపోతే ఎవరేమనుకొనిపోతారో అన్నట్లుగా కొట్టి కురిసింది వాన

హోటలుకు పోయి పెందరాళే రెండు మెతుకులు నోట్లో వేసుకుని క్లాసుకు తయారవుదామంటే వీల్లేకుండా టికట్ల ఫుస్తకం మాయమైంది. సిద్ధమైన దుస్తు లేసుకుని నీటుగా పోదామనుకుంటే నేలంతా ఎక్కడా అడుగుదీసడు గట్టడానికి శక్యంగాకుండా చిలిపతలాడుతోంది. పిన్నా పెద్దా, ఆడా మగా, అంతా ఆ రొచ్చుర్రొంపి దాటడంకోసం లాగుల్ని ధోవతుల్ని చీర కుచ్చెళ్ళను కొంత పైకెగబట్టకొని ఎత్తిఎత్తి వేస్తున్నారు అంగలు

డాబామీంచి చూస్తూంటే, పెద్ద మనుష్యులు కొంతమంది ఏ కూరలకనో మరోపనిమీదో బయలుదేరి వీధిలోకొచ్చి గొడుగుల్నెత్తి పట్టుకు నడుస్తూండగా దారిలో ఎరిగున్నవాళ్లెవరైనా ఎదురుపడ్తే 'ఆముదం' మ్రింగవలసిన వాడిలా ముఖం పెట్టి పల్కరించినదాని కేదో జవాబులిచ్చి వొదుల్చుకొంటూ ముందుకు సాగుతున్నారు

అహోబలరావుకి వానకోటు కొనాలన్న విషయం అప్పుడే తట్టింది. పర్సు తీసుకుని జేబులో వేసుకుని గబగబా మెట్లమీంచి దిగి వీధిలో కొచ్చి పడ్డాడు. ఆ తొందరలో అతను అడుచెప్పు లేసుకొచ్చాడు. రోడ్డుమీద నడుద్దామంటే 'బంయ్' మంటూ అట్నుంచి ఒక బస్సు యిట్నుంచి ఒక బస్సు, పోనీ పేవుమెంటుమీద ఎల్లాగో జర్రుకుపోదామంటే అక్కడక్కడ చెప్పులుగుట్టే వాళ్లు, గొడుగులకు ప్రాత కలాలకు టోపీలు పాళీలు అమర్చి, కళ్ళజోళ్లూ తాళంచెవులు మరమ్మతు చేసి తిరించే చిల్లర

వ్యాపారులు, వేరుశనక్కాయ లమ్ముకునే ముసలమ్మలు, పిల్లలతో నానా అవస్తగానూ వుంది.

ఇక యీ పట్టణాల్లో ప్రతికటమే ఒక అవస్త. ఇట్లాటివానలో ఒకరి మడమలొకరు త్రొక్కుకుంటూ పరుగెత్తుతున్నారు జనం. బట్టలబజారులోని ఫ్యాన్సీ గుడ్డ షాపులోకి అటువైపునుంచి అహోబల రావు యిటువైపునుంచి ప్రసాదరావు ఒక్కసారే ప్రవేశించారు.

షాపులో జనం గొడుగుల్ని చేరవాడుతున్నారు. అక్కడకూడా నేల తేమగానే వుంది. తీరావాన కోటు కొందామనుకుని వచ్చిన అహోబల రావుకు గొడుగుల్ని చూడ్డంతోనే అదీ—యిదీ ఏది కొనటమనే డైలమాలో పడిపోయాడు.

ప్రసాదరావుని చూడగానే కొట్టు యజమాని 'దయచెయ్యండి సార్!' మాస్టారేరా వెగవా, పంతులుగారికి కుర్చీ వేయ్ కుర్చీ వేయ్' అంటూ జనాన్ని వొత్తిగించుకుని 'ఏమిటి యిలా దయ చేశారు? కాఫీ పుచ్చుకుంటారా? బోయ్ టిఫిన్ ఒక కప్పు కాఫీ పట్రా చప్పున' అంటూ అతి మర్యాద చేశాడు.

'కాఫీ ఏమిటి? ఏమీ అక్కర్లేదు ఇప్పుడే పుచ్చుకొచ్చాను నన్ను నవసరంగా చంపకు' అన్నాడు ప్రసాదరావు క్రొత్తరకపు ఫ్యాన్సీకళ్ళ జోడుతీసి విలాసంగా చేత్తో పుచ్చుకుని రెయిన్ కోటు వేసుకున్న ప్రసాదరావును అతని జేబులోని పార్కరు పెన్ను, వెంటిక్స్ చైనుతో వున్న వెస్టెండ్ క్రొత్తమోడలు వాటర్ ప్రూఫ్ రిస్ట్ వాచీని చూచిన అహోబలరావు వుండబట్టలేక ప్రక్కవాణ్ని పొడిచి 'ఎవరీయన' అని అడిగాడు.

'ఎక్కడో పశ్చిమ గోదావరి జిల్లాలో పంచ దార ఫ్యాక్టరీ కడుతున్నారు దానికి మేనేజింగు డైరక్టరు. ఇంకా మనవూళ్ళో చాలా కంపెనీల్లో ఆయనకు షేర్లున్నాయి' ఇది విన్నాక 'పశ్చిమ గోదావరిజిల్లాలో పంచదార ఫ్యాక్టరీ పెడుతూంటే యీ మేనేజింగు డైరక్టరు యీ వూళ్ళో ఎందుకు వుండటం' అనుకుని పోనీలే మన కెందుకని అకొట్టు యజమానిని 'వాటర్ కోట్లు' చూపించమని అడిగాడు.

అప్పటికి అహోబలరావుకు కాలేజీ కెళ్ళటానికి గంటవ్యవధే వున్నది.

ప్రసాదరావు కాఫీ తాగుతూ 'చూడవోయ్ ఓవల్టీను డబ్బా ఒకటిన్నూ, థర్మాస్ఫ్లాస్కు పగిలి పోయింది అదొకటీ యివ్వు!'

'చిత్తం.' అని ఆసరుకుల్ని స్వయంగా తెచ్చి అందిస్తూ 'ఏం బాబూ యింట్లో అంతా కులాసా?' అన్నాడు కొట్టు యజమాని. ఈ ప్రశ్నకు ప్రసాద రావు సమాధానం నోటినుంచి పెగిలి బయటకురాక ముందే, సైకిలుషాపు డీలరు బంగారయ్య 'పంతులు గారూ లేడీ సైకిలు తీసుకున్నారు. ఇంకా కొరవ మిగిలిపోయింది కొంచెం యిబ్బందిలో వున్నాను లేకపోతే తమ బోటివారి దగ్గర సొమ్ము ఖజానాలో వున్నట్లే ' అంటూ లోపలికొచ్చాడు యితడిరాక పనిగట్టి

అవతల కొట్లో చిన్నచిన్న బేరాలన్నీ గుమాస్తా చూసుకుంటున్నాడు ప్రసాదరావు కొంచెం విచారంగా 'అసైకిలు ముక్క ముక్క యిందోయ్ కుర్రాడ్ని పంపిందు యిచ్చేస్తాను మళ్లీ అమ్మేసి తెచ్చినడబ్బు నాకిచ్చేద్దుగాని ' అన్నాడు కళ్లు తేల్చి పైకి చూస్తూ బంగారయ్య 'ఏమిటి అలా అంటున్నారు ఏం జరిగింది?' అంటూ కుతూహలంగా ప్రశ్నించాడు ప్రసాద రావు కొంచెం దుఃఖంగా 'అది కొన్న వేళా విశే షం మంచిది కాదోయ్ నిన్న మా మరదలు దాని మీంచి పడిపోయింది ఆక్సిడెంట్ సీరియస్ కాదు గాని దెబ్బలు తగిలాయి'

అహో బలరావు గుండె చప్పున ఆగిపోయింది చచ్చాన్రా యిక్కడికొచ్చిపడ్డాను. ఆ క్రొత్త సైకిల్ని వేసే అని తెలిస్తే యీ మేనేజింగ్ డైరక్టరు నాముఖం చోర్లేస్తాడు గాబట్టి ఎట్లా యిక్కడనుంచి తప్పించుకోవడమనే భయంతో గబ గబా బిల్లు చెల్లించి వీధిని పడ్డాడు. అతని కళ్లు చీకట్లు కమ్మాయ్ పట్టుగోండి 'పట్టుగోండి! అని ఎవరో అరుస్తూ వెంబడిస్తున్నట్లు తోచింది

## 5

గోదావరి స్టేషన్లోకి మెయిలు వచ్చి ఆగీ ఆగటం సుందరరామయ్యా కోలాహలంలాటి పెట్టెను దాటిం

సహాయంతో కిటకిటలాడ్తూ కిక్కిరిసివున్న ఆడవాళ్ల పెట్టెలోకి ఎల్లాగో నెట్టి ముఖంమీది చెమటను తుడుచుకుంటూ—'ఎక్కడమ్మా యిది ఆడవాళ్ల పెట్టె ఎల్లాగో రెండు గంటలసేపు కళ్లు మూసుకున్నావా బెజవాడ స్టేషను వొస్తుంది' అని సామాన్తో నింపిన గోనుసంచిని ఎక్కడ వుంచటమా అన్న ఆలోచనతో పెట్టెలోకి తొంగిచూశాడు

అలివేలు క్రొత్తచీర కట్టుకుంది కాళ్లకు రాసుకున్న పసుపూ స్టేషనుకు వచ్చే ఆదరాబాదరా తొందరలో వాళ్ల అమ్మ ముఖాన పెట్టిన కుంకుమా చేతిలోని చలిమిడీ పసుపుకొమ్ముల సంచీతో లోపలికి ఎక్కబోతూ చేయి పట్టుకుని పూచకు తగలటం వలన రెండు గాజులు చిటికాయి లోపల ఎవరో స్త్రీ సానుభూతిగా 'అయ్యో! చిట్లేయమ్మా గాజులు చిటికాయే—' అంటూ సర్దుకుని చోటిచ్చి గుమ్మని కష్టంగా వేయిస్తున్న సామానుసంచిని విమర్శిస్తూ 'దారి కష్టమయ్యా—ఎక్కేవాళ్లకూ దిగేవాళ్లకూ ఎల్లాగా' అని గొణిగి 'ఇల్లెమ్మా మీ పుట్టిల్లు ఏ వూరు' అంది అదే వరసలో అలివేలు ఆవిడ దయారసానికి కృతజ్ఞతగా 'ఈ వూరేనండీ' అని 'నాన్నా ఆ సామాను లోపల సర్దిండు దారి కష్టం లేకుండా పాపం ఎక్కేవాళ్లకూ దిగేవాళ్లకూ' అని అనటం ఆ స్త్రీ మర్యాదగా 'ఫరవాలేదమ్మా ఆ సామాను సీదా అత్తగారింటికి కాబోలు నర్సుతున్నావు ఆయన మీ నాన్నగారా' అంది 'అవునండీ' అని అలివేలు కిటికీలోంచి తండ్రికేసి చూసింది సుందరరామయ్య లోపలికొచ్చి సామాన్ను దారి కష్టం లేకుండా సర్ది—'మర్చిపోయాను యిదిగో టిక్కట్టు జాగ్రత్తమ్మా అతను స్టేషనుకు వస్తాడు ఇప్పుడే టెలిగ్రాము యిస్తాను అమ్మా కొత్తమా అమ్మాయి బెజవాడ స్టేషన్లో దిగుతుంది. చూస్తూండండి' అని ఆ స్త్రీకి వప్పగించాడు

రైలు కదిలింది అలివేలు పెట్టిలోంచి ఆకాశంవైపు మరొకసారి తండ్రి వైపుచూసింది ఆకాశం స్వచ్ఛంగావుంది ఎక్కడా మబ్బులు లేవు ఎండ బంగారంలా వుంది తండ్రిముఖం దిమ్మిడి కావంత యింది తండ్రి చెంగుతో కళ్లు తుడుచుకుంటూ 'ఉంటానమ్మా' అంటున్నాడు అలివేలు తెల్లబోతూ కలను పెట్టెలోకి లాక్కుంది. పెట్టెలో

తొడ త్రొక్కిడిగావున్నది రైలు గోదావరిని దాటుతోంది. గోదావరిని చూడ్డంకోసం దంతావళంలాటి మనిషి అలివేలుమీదనుంచి త్రోసుకుంటూ కిటికీలోకి మొహము దూర్చాలని ప్రయత్నిస్తోంది ఆవిడ కూర్చున్నచోటు ఒక చదరపు గజం మేర అందులో చుట్టూ అరడజను బత్తాయికాయల తొక్కలు నొల్చి పారబోసింది వేరుశెనక్కాల పల్చటి దిండు ఆనుకుందుకు వేసుకుంది ప్రక్కనే ఒక యింగ్లీషు పత్రిక రెండుమూడు కథల పుస్తకాలువున్నై మీద కొక్కెకి ట్రాన్సిస్టర్ వేలాడుతోంది బహుశా ఆ కథలు చదువుతూ మధ్య మధ్య ఆవిడ అందులోని పానీయాన్ని కొద్దికొద్దిగా అరగిస్తూ వుండాలి అలివేలు కావిడధోరణి నచ్చలేదు పెట్టెలో యింకా రకరకాల ఆడవాళ్లు నిల్చునే పిల్లల్ని ఎల్లాగో పూరడించుకొంటున్నారు ఆవిడ ఎక్కువ తన సుఖం చూసుకునే మనిషిగా కనుపించింది అట్లాటి వళ్లంటే అలివేలు కస్సలుకోపం పైపెచ్చు ఆవిడ తన వస్తుల సేవన్ని తనమీదుగా పోనిచ్చి గోదావరిని చూసి ఆనందిస్తోందంటే చిరాకు వేసినమాట మాత్రం నిజం

రైలు నవా నవా ముందుకొంది వంతెనమీద అలివేలుకి తలనొప్పి ఆవిడ వక్షఃప్రదేశం అలివేలు ముఖానికి రాసుకుంటూ ఉక్కిరి బిక్కిరిచేయటం వలన 'ఊపిరాడ్డం లేదండీ' అంది విసుగ్గా కంపెలు తిరిగి ముసలమ్మ పడ్డ ఆమె మొహము అలివేలుకేసి త్రిప్పుతూ 'ఇప్పుడేనా ఎక్కావు ఈ మాత్రానికే యింత చిరాకా—నేను ఎక్కణ్ణుంచి వస్తున్నానో తెలుసునా నిన్ననగా ఎక్కాను'

'అదంతా అనవసరమండీ మీరు ఎప్పుడెక్కితేనా కేందుకు? నాకు ఊపిరాడ్డం లేదంటున్నాను దయచేసి మీ సీట్లో కెళ్లి కూర్చోండి' అని ముఖం చిందుకుచేల చేసింది.

ఇంతవరకూ ఆవిడ నిన్నటినుంచీ ఆ పెట్టెలో ఏకఛత్రాధిపత్యంగా పరిపాలన సాగిస్తోంది కాని యిటువంటి అవమానం జరగలేదు అదీగాక అలివేలు చాలా చనువుంగా అన్నమీదట ఆవిడ కెందలకంఠా సీట్లో కెళ్లి తన చదరపుగజం మేరనూ తిరిగి ఆక్రమించుకుని ఒక బత్తాయితొనను కోపంగా కొరికి

నోట్లో వేసుకుని గింజల్ని తుపుక్కు తుపుక్కున ఊస్తూ కథల పుస్తకం తీసి ముఖాని కడ్డంగా లాక్కుని కోర చూపులు చూడసాగింది

కొవ్వూరు స్టేషను వొచ్చింది. అక్కడ కో పచ్చి బాలెంతరాలు రెండునెలల గ్రుడ్డును తీసుకుని ఆ పెట్లోకి ఎక్కింది ఎక్కడా చోటు లేదు ఈ దంతావళం చక్కగా బాసింపట్టు వేసుకు కూర్చొని వుంది ప్రక్కనే ఒక మనిషి కూర్చునే చోటులో పత్రికలు పుస్తకాలూ పర్చింది ఎవరూ ఆమెను ఆ చోటు ఖాళీచెయ్యమని అడగరు ఆ పచ్చి బాలెంతరాలుకు నోరు లేదు అట్లానే నిలబడింది ఆ పరిస్థితిలో ఆవిడ ఉక్కుకష్టంగా నుంచోటటం యీ దంతావళం చూసింది చూసినా చలించలేదు మళ్ళీ అలివేలు కలుగచేసుకోవాల్సి వచ్చింది

'ఇదుగో ఏమండోయ్ మిమ్మల్నే ' ఆవిడ ఉలక లేదు పలక లేదు తిన్నా కానట్లు ఊరుకొంది

'ఆ పుస్తకాలు కొంచెం తియ్యండి అక్కడ కాస్త చోటుంది ' అంది మళ్ళీ అలివేలు ఈమారు ఒకమాటు తలకెత్తి చూసి మళ్ళీ నిర్లక్ష్యంగా పుస్తకం చదువుకో వారంభించింది అలివేలు లేచి ఆ బాలెంతరాలు చెయ్యి పుచ్చుకుని లోపలికంటా నడిపించుకొచ్చి ఆ పుస్తకాలను చేత్తో తీసింది ఆ దంతావళం 'అవి అక్కడ పెట్టు ముందర ' అంటూ గర్జించింది అలివేలు ఆ బాలెంతరాలు చేతిలోని పసిగుడ్డు నందుకుంటూ 'మీ రిక్కడ కూర్చో' మని ఆ పిల్లతల్లిని ఆజ్ఞాపించింది 'కూర్చోటానికి వీల్లేదు ' అంటూ దంతావళం చేత్తో ఆ తల్లిని నెట్టి వేయటానికి సాహసించింది అలి వేలు కళ్ళ వెంట నిప్పులు కురిపిస్తూ 'ఇదుగో బాగా చూడండి మీరు కనుక ఆమెను కూర్చోనియ్యకపోతే యీ చేతిలోని పుస్తకాలను కట్టగా కిటికీ లోంచి అవతలకు గిరాటువేస్తాను ' అని చేత్తో పుస్తకాల దొంతరను ఝళిపించింది పెట్టెలోని తతిమ్మా ఆడవాళ్లు గొల్లుమన్నారు. ఆ ముక్కలన్న తరువాత అలివేలు అంతపని చేసేదాని లాగునే వుంది. ఆవిడ దవ్వన నోరు తెరచి పెట్టెలో అందర్ని వంకా చూస్తూ— 'నేను ఎప్పుడెవగా బయల్దేరానో ఎక్కడున్నించి వస్తున్నానో తెలుసా ?' అంది. అంతా మళ్ళీ గొల్లుమన్నారు. ఈమారు అలి వేలు కూడా నవ్వింది బాలెంతరాలు చేతిలోని పాపాయి కూడా నవ్వింది. ఈమారూ పరాజయందంతావళా నిదే ఆ బాలెంతరాలు కూర్చుని ఓపిగ్గా దంటపిల్లకు పాలు కుడుపుతూ 'పదికాలాలపాటు చిరీ పంపత్తి కలిగి పసుపూ కుంకుమా పెట్టుకుని బతుకు తల్లీ !' అంటూ దీవించింది

దంతావళం ఊరుకో లేదు. నసుగుడు ఆరంభించింది 'పారేస్తుందిట' పుస్తకాలు పారేస్తే పోలీసులకి కబురు చేసేదాన్ని ' అంది పెట్టెలో ఒక మూలనుంచి ఒక తూర్పువిడ చుట్టనోట్లోంచి తీసి— బాలింతరాలు కూర్చోటానికి సోటెట్టమని ఆ మాతల్లి అడిగితే పెద్ద నా పరాయిలా ఒల్ల పంగాని కొట్టించుకుని, నొగమంటే పిలుస్తాదిట పోలీసుల్ని, ఎదవపుత్తకాలు ఎన్ని సదిగితేం ఆమాతల్లి కున్న గ్యానం సెదు చీరామ చీరామ కలికాలం' ఈలోగా గ్రుడ్డిబిచ్చగాడు రైల్లో కెక్కి—

'నిజము కల్లవుతుంది కల్ల నిజమవుతుంది.
నిజము నిలకడమీద తెలవాలి బ్రహ్మనో—
భజగోవింద ! గోవింద !' అంటూ పాట

లంకించుకున్నాడు దంతావళానికి ఓపిక చచ్చి 'బ్రూటస్ట్'అనేసి ప్లాస్కులోని కాఫీ గిద్దెడు పోసుకుని చప్పరిస్తూ కథల పుస్తకం పేజీలు తెర్చి, బలవంతాన చదవటం పటించ సాగింది రోషంతో. తాడేపల్లిగూడెం స్టేషన్లో యీ దంతావళానికి మరొక పరాభవం ప్రోగయింది అలివేలు వాళ్ళ సంభాషణలనుంచి తెలుసుకున్న దేమిటంటే 'యీవిడ అల్లుడుగా రింటికి బెజవాడ వెళ్తోన్న దనీ— అక్కడ తన చిన్నకూతురు కాలేజీలో చదువుకొంటున్నదనీ— ఆ అల్లుడు పంచదార ఫ్యాక్టరీ మానేజింగ్ డైరక్టరుట ఈ సంగతులు ఆవిడ చెప్పటంలో ఎంతో దర్పం, గొప్పతనం, అభి నయిస్తూ చెప్పింది

కొంతసేపు యీ దంతావళమూ ఆ పరాభవమూ యింగ్లీషులో అలివేలుకేసి కొరకొర చూస్తూ ఏదో మాట్లాడుకున్నారు. తరువాత బెజవాడ స్టేషనొచ్చే వరకూ అలివేలుకు యీ రెండు జంతువులే కాల క్షేపం.

బెజవాడస్టేషను వస్తున్న దనగానే పొంగిపొర్లే ఉత్సాహంతో అలివేలు ప్లాటుఫారంకేసి చూస్తూ

ల్లోకి పరీక్షగా ఆదుర్దాగా చూడసాగింది దూరాన్ని రంగురంగుల లైట్లతో స్టేషనంతా దీపాల్తో జగజ్జేగీయమానంగా వుంది

ఆ దండోరవళం అలివేలు పెట్టెను కొంచెం అడ్డంగా వున్నదనే సెరంమీద 'శాల్లకష్టం పెనక పెట్టి!' అని కసిదీర తిట్టింది. అలివేలు పూరులో సేగు 'జెనకపెట్టి గిరక పెట్టి అనబోకు పోలీసుల్ని పిలుస్తాను' అంది మళ్ళీ అంతా గొల్లుమని నవ్వారు రైలు ఆగింది అహోబలరావు కిటికీదగ్గర్నుంచి అలివేలు బుజంమీద తట్టాడు ఉలిక్కిపడి 'మీరా ' అంది 'వచ్చాకా—' అన్నాడు కళ్లు మిలమిలా మెరుస్తూండగా యింత చేసుకున్న ముఖంతో 'వచ్చాను' అంది అలివేలు

ఆ దండోరవళంకోసం వచ్చిన విజయ, తల్లిని ముందు పలకరించకుండా 'బావా! బావా! ఆయనే మా క్రొత్త లెక్చరరు' అని ప్రసాదరావుకు అహోబలరావును చూపెట్టింది

## 6

చేలకడ్డంబడి పొలాల్లోంచి రెండెడ్లబండిని త్రోలుకెళ్లినట్లుగా దంచుకున్నాడు ఉపన్యాసం అహోబలరావు విషయం సత్యాగ్రహింసలు – గాంధీ, గౌతమ బుద్ధుడు పాఠం అక్కర్లేనివాళ్లు బందరు లైనుమీద బల్లిలా పాకుతూన్న గూడ్సు రైలు పెట్టెలను లెక్కపెడుతున్నారు ఉపన్యాసం డొంక తిరుగుడుగా వుంది అవసరమైన విషయాల్లోంచి అనవసరమైన విషయాల్లోకి దాంట్లోంచి దీంట్లోకి దీంట్లోంచి దాంట్లోకి కప్పదాట్లు కుప్పిగంతులు వేస్తున్నది ఐనా యేదో సమర్థతతోనే చెప్పుకుపోతున్నాడు. కొందరు కుర్రవాళ్లు కబుర్లు ప్రారంభించారు. కొంతమంది మెల్లమెల్లగా గోడవారల్నుంచి జారుకొంటున్నారు. ఇంకా మరికొందరు ఉండుండి 'చుట్టా బీడీ సిగరెట్'—'చా! చా! గరం చా' అని కేకలేస్తున్నారు అహోబలరావు దవ్వున నీరసించి యిట్లా గన్నాడు—'మీ కెవరికీ విషయం పట్ల ఆసక్తి వున్నట్లు కనుపట్టంలేదు. ఐనా చదువుకోటానికి వచ్చినట్లు లేరే ' అని. వెనుక బెంచీలోంచి 'చాలా చక్కగా గ్రహించారు.' అని – యింకొక చప్పట్లనుం 'బాగుబాగు' అని. వెరొకచోటనుంచి 'ఈవాల్టికి చాల్లెండి మాష్టారూ!' అని పలపోలు సందేశాలు ఆదేశాలు వచ్చినై అడపిల్లలు నవ్వుతున్నారు వాళ్లు ఎందుకు నవ్వుతారో వాళ్లకే తెలియదు అహోబలరావు మళ్ళీ పట్టుపలకొద్దీ ఉపన్యాసాని కందుకున్నాడు తరువాతి విషయం 'ప్రపంచ శాంతి'తో ముడిపెట్టబడింది. ఆర్థికశాస్త్రానికి సంబంధించిన, రాజకీయాలకు సంబంధించిన ప్రశ్నలు లేచి తిలోక్కరూ వేయసాగారు చివరకా క్లాసు పరపెరాం లైన్ సర్కస్‌గా మారింది అహోబలరావు కుర్చీ వదిలి బెంచీల మధ్యకొచ్చి గర్జించాడు 'మీరు గొడవ మానుతారా లేదా?' అంటూ ఒకటికి రెండు సార్లు పోలోమంటూ అంతా లేచి 'క్రొత్త మాష్టారికి జై! క్రొత్త మాష్టారికీ జై!' అంటూ యువతుల కొచ్చి పడ్డారు

ఖిన్నవదనుడై అహోబలరావు యువతులకు రాగటం చెట్ల దగ్గర బయాలజీహాల్లో జూ అలజీ ప్రాక్టికల్ చేస్తున్న విజయ చూసింది చూసి ప్రక్కనున్న స్నేహితుల చెవిలో ఏదో చెప్పింది అంతా అహోబలరావు సమీపాన్నుంచి పోతుండటాన్ని కనిపెట్టి పకపకా నవ్వారు హాలు హాలంతా పక పకలతో ధ్వనించింది అహోబలరావు కోపంగా విజయకేసి చూశాడు విజయ కటువైన మంచి హాసాన్ని విసిరింది

'చాల్లేవే—ఏమిటా విసురుడు!' అంటూ వచ్చింది ఒకతె.

'అదికాదే—క్రొత్తవాళ్ళనంత బెదరగొట్టాలేమే విజయా!' అంది మరొకతె అంతా నవ్వారు.

బల్లమీది కప్పకు నాలుగువైపులా మేకులు దిగగొట్టి వెల్లకిలా పడుకోబెట్టబడిన కప్పకు రక్త ప్రసార మెట్లా జరుగుతుందో చెప్పి, గుండె చలనం గూర్చి చెబుతున్నాడు విజయ పరధ్యానంగావుంది సన్నటి చాకులు చిన్నచిన్న సూదులు వీళ్ళలోంచి తీసి కుడుస్తూ 'మూసే యిందిరా' అని పిలిచింది ఇందిర నోట్సు వ్రాయటం ఆపు చేసి 'ఏమిటే అంత అర్జంటు?' అంటూ వచ్చింది.

'లేడీస్ కల్చరల్ అసోసియేషన్ ప్రారంభోత్సవం ఎప్పుడే?' అంది విజయ

'అవిషయం యిప్పుడెందుకే?' అంది ఇందిర.

'పడుందన్లే చెప్పు. ఎప్పుడు ప్రారంభిం చటం?' మళ్లీ రెట్టించింది

'ప్రిన్సిపాల్నడిగాలే. ఇవ్వాళే మధ్యాహ్నం పోయి అడుగుదామా?'-విజయ ఆలోచించి 'సెక్ర టరీని పిలకేవ్వ' అంది సెక్రటరీవచ్చి 'ఎందుకే విజయా అవతల టేబిల్ దగ్గర సగం సగం ప్రాక్టీ కలు చేస్తూవచ్చావు చెప్పు'

'మన అపోనిరుమున్ 'షో' ఎప్పుడు చేద్దామే' అంది విజయ 'ఇప్పుడెందుకే ఆ చర్చ?' అంది సెక్రటరీ

'ఆఫీసు శేంర్ గా నేను ప్రొత్తి లెక్చరర్ను నూచిస్తాను మీరంతా వోట్లెయ్యాలి'

'ఎందుకే—పాపం అతన్ని యేడిపించటం?' అంది ఇందిర సెక్రటరీ అందుకుంది 'పాపం అంటూ వెనకేసుకొస్తోంది దీనికేమన్నా కేవలకొడుకేమో నే వాడు.'

విజయ 'అల్లానే వుంది కాకపోతే యేమిటి?' అంది హేళనగా ఇందిర కోపంగా—'ఆ దగ్గర వరసలన్నీ ఐతే మీకవాలి? నాకేం—నేను నా వోటు వయ్యను'

'ముడిచిరల్లో పెట్టుకో' అంది సెక్రటరీ ఇందిరకు కోపమొచ్చి లివ బల్లదగ్గరకు వెళ్లి ప్రాక్టీకలు చేస్తోంది విజయచాకులు మాదులలో బల్లమీది కప్పను పైపైన కోస్తూ సెక్రటరీ చెవులో ఏమేమో చెప్పి నూరిపోస్తోంది ఇద్దరూ మధ్యమధ్య నవ్వు కుంటున్నారు విజయకు ప్రాక్టికల్ మీద దృష్టి లేదు సెక్రటరీ బల్లమీదకువంగి విజయ ముఖంలోకి చూస్తూ మాట్లాడుతోంది ఈలోగా సగంసగం తెలివిలోకి వస్తూన్న కప్పపోయే ప్రాణంకోసం పెనగులాడుకూ నాలుగుకాళ్లను కుంచించి తిరుగుబాటు చేసింది క్లోరోఫారం పట్టుతప్పి కప్ప నాలుగుకేకుల్ని ఎగర తన్ని సెక్రటరీ ముఖానికొచ్చి గుద్దుకుంది.

'అమ్మ బాబోయ్' అని సెక్రటరీ భయంతో కెవ్వుమని కేకేసి దూరంగా పరుగెత్తింది విజయ తెల్ల బోయి చూస్తూ నిలబడిపోయింది నాలుగువైపు ల్నుంచి విద్యార్థులు అధ్యాపకులు, అటెండర్లు ఏమిటి ఏమిటి అంటూ పరుగెత్తుకొచ్చారు.

భయపడిపోయిన సెక్రటరీ యేమన్నా అంటుందేమో నుంచి అధ్యాపకుడు అటెండర్ని కేకవేసి అతను 'పారబాటు తుడిపించాలి క్లోరోఫారం సరిగా యివ్వలేదు కాబోలు' అని నవిగాడు విజయ సెక్ర టరీని నడిపించుకుని వైటింగురూంలోని కెళ్ళ బోతూంటే అందరూ యీ అమ్మాయి ముఖంనిండా బట్టలనిండా యీ నెత్తురేమిటి మరకలేమి టని అడిగేవారే? అడిగి తెలుసుకున్నాక పొట్ట చెక్కలయ్యేలా నవ్వేవారే? ఇందిర ఆమె కోసంకోసం కాచుకు కూర్చున్నది విజయ, సెక్ర టరీ, బట్టల్లో ఎక్కుతూండగా 'ఏమే—యీనా గలేవూ 'షో' ఎల్లాగుందేం?' అంది సెక్రటరీ ముఖ మంతా వలుపు చేసుకుంది విజయ 'ఇప్పుడా, యిదా వేళాకోళానికి సమయం' మన్నట్లు చూసింది

ఇందిర మాటలో మాట కలిపింది—'జరిగిం దేదో జరిగింది కాని—యింకెప్పుడూ అనవసరంగా మనకు సంబంధంలేని విషయాల్లోకి దిగి యితరుల్ని అవ మానించటానికి పన్నాగాలు పన్నకండి' దీంతో సెక్రటరీ దబ్బిపోయింది విజయ వుసుకుమోతుతనం గానే అంది—'నీకు మహ బాగా తెల్సులేవే— అందర్నీ వెనకేసుకొచ్చి మాట్లాడుతున్నావ్ ఇవాళ ఏదో ఆ వెధవ క్లోరోఫారం సరిగ్గా యివ్వనందుకు ఆ కప్పకు తెలివొచ్చి మేకుల్ని ఎగరగొట్టిందని దానికి దీనికి ముడిపెడుతున్నావు వాడెంత రోగ్గో నీకు తెల్సా—నన్ను సైకిలుమీదనుంచి పడేశాడు నిన్న మా అమ్మ కలకత్తా నుంచి వస్తూంటే రాజమండ్రిలో ఎక్కిందట—యీయనగారి భార్యామణి మాట్లాడే వంటే నీ తూటా మళ్లీ కిటికీలోంచి గోదావరిలో పారేస్తానని బెదిరించిందట ఇద్దరి కిద్దరే వీడికి వీడి పెళ్లానికి యిద్దరికీ బుద్ధి చెప్పాలి' అని

సెక్రటరీ మళ్ళీ అంది—'ఒసే ఇందిరా—నీ వన వసరంగా దీంట్లో జోక్యం కలుగజేసుకోకు వాళ్లిద్దకీ బుద్ధి చెప్పందే మేం నిద్రపోయేది లేదనుకో'

ఇందిర మళ్ళీ కప్ప సంగతి సుర్తుకు తెచ్చుకుని పకపకా నవ్వుతూ 'నా కెందుకు జోక్యం—నేను కలగచేసుకుంటే ఆ కప్ప ఎగిరి నామీదే పడివుండేది యిందాక' అంది. ఇంతలో సిటీబస్సు వచ్చింది ఇందిర బస్సులోకి వెళ్లింది 'ఇదేమిటే యింత చెత

నవంగా చెప్పే పింతలి తీరూ నా లేకుండా మాట్లాడుతుంది' అంటి కిక్రటికి. చెల్నా కోలు 'భళే' మంది. కొడు వోరగా 'బంయ్' మంది

# 7

రోజులు గడుస్తున్న కొద్దీ చిత్రవిచిత్రమైన సంఘటనలు జరుగుతూ వచ్చాయి. ప్రపంచంలోని ఒకరకపు అసందర్భపు మనుష్యుల్లో ఒకడైన అహోబలరావు 'భాగ్యజీవితం' దినదిన గండం, నరవ్యో ళ్లాయుష్షుగా మారిపోయింది. ఉపన్యాసాలివ్వటం మొదట్లో క్రొత్త అనిపించినా క్రమంగా కొన్నాళ్ళకు మామూలైపోతుంది అందరికీ. ఇతడి విషయంలో అట్లా కాలేదు. చిన్న చిన్న అద్దంకులు సంఘటనలు వచ్చి వ్యక్తిని నిరుత్సాహపరిచాయి. తరువాత స్నానంటే భయం దడ ఎక్కువవుతూ వచ్చింది కాని తగ్గలేదు. చక్కగా కష్టపడి అవీ ఇవీ చదివి మరీ ఐశ్ళవాడు—కాని నోరు విప్ప నివ్వరే! ఖర్మ!

ఇంటి కొచ్చాక పెద్ద పెట్టునరాగా లెట్టా లనిపించేది అతనికి. ఎవరితో మాట్లాడకుండా దిగాలు పడి కూర్చుండి పోయేవాడు. అర్ధరాత్రి నిద్రలోంచి ఉలిక్కిపడి లేచి 'భయం' అనేవాడు. 'నా చేయి మీమీద వేస్తాను మీరు సుఖంగా నిద్రపోండి మీ కెందుకు భయం' అనేది అలివేలు.

ఒక రోజున గదిలో కూర్చుని కాంపోజితను పుస్తకాలు సంస్కరించటానికి బదులుగా రెండు చేతుల్లో తలగట్టిగా పట్టుకుని పక్కి పక్కి ఏడవటాని కారంభించాడు. అలివేలు వంటయింట్లో కాఫీ కాచటంలో మగ్నురాలై వుంది.

'మరో పది నిముషాలకు కాఫీ కప్పు బల్లమీద వుంచుతూ—'కళ్లు ఎర్రగా వున్నాయేమండీ?' అంది దగ్గర వదనరా. అహోబలరావు ఉత్తరీయంతో కళ్లద్దుకుంటూ 'ఏమీ లేదు' అని కాఫీ కప్పు నందుకుని రెండు గుక్కలు పీల్చి ముఖాన్ని ప్రక్కకు త్రిప్పి కిటికీలోంచి ప్రొద్దుగ్రుంకటాన్ని తిలకించ సాగాడు. వదలక కుర్చీ దగ్గరకు వచ్చి నిల్చొని 'నామీద వొట్టే. ఏమీ లేదూ?' అంది గోకాయిస్తూ అలివేలు.

ప్రక్క వాటాలోవాళ్లున్నాయి రాత్రి ఫూరాం చేస్తాంటే—ఉల్లాల్లా హాయీ! యేడుంటూ యేడుంటూ వెర్రి నాగన్నా! యేడిస్తే నిన్నెవరు యెత్తుకుంటారు? అని తల్లి వోదారుస్తోంది. అలివేలు కాస్సేపు నిశ్శబ్దంగా నిల్చొని 'దీపం వెలిగించుకొస్తాను. ఆవల చెయిదురుగాని లెండి అన్నం పెడతాను' అని గిరుక్కున వంటయింట్లోకి వెళ్ళింది.

అహోబలరావుకు వెనుకటి సంగతులు ఎంత వద్దనుకున్నా జ్ఞాపకానికి రాసాగినై. అలివేలు తన్ను యేరికోరి పెళ్ళి చేసుకుంది. చెంపకు చేరడేసి కళ్లు—పిల్లా అహోబలరావు కివ్వడ మేమిటి అన్నారంతా. ఆచార్యులైతే చదువుకున్నాడు గాని, ఎక్కడా ప్రాపంచికజ్ఞానం, తెలివితేటా, అందం, మనిషిలో నాగరీకం గాని లేవు. కోతి ముక్కుకి దొండపండు కట్టినట్లు ఏమిటిది? అంటే అలివేలు సమాధానమిచ్చింది 'నాకు అందం అక్కర్లేదు ఎక్కువున్నా అందాన్ని కొరుక్కు తింటామా? అది యివ్వాళ వుంటుంది రేపు పోతుంది. ఈనాటి నలకూబరులాంటి వాణ్ణి తెచ్చి కడతారు. రేపు ప్రొద్దున్న వాడికే మశూచికమన్నా రావచ్చు. అప్పుడా అందమంతా పోతే - అటువంటి అందాన్ని చూసి పెళ్లి చేసుకున్న నా గతేం కాను?' అంది పెళ్లికూతురు.

ఇవి మాటలు నేర్చిన పక్షి యిక్కడ ఉంటే యిక్కడ ఉంటుంది అన్నారంతా. తల్లి అడిగిందట—'అస్తి మాటో—లక్షణమైన బంగారపు బొమ్మలాటి పిల్లనిస్తే, తిండి బట్టా యిచ్చి సుఖపెట్టే చోటు అవునో కాదో కొత్త మాయలో వక్కాల్తే దుకే.' అని అప్పుడు కూడా అలివేలు కొంటె మాటలు మానలేదు.

'డబ్బు కూడా అట్లాంటిదేగా అమ్మా. అది యివ్వాళ వుంటుంది రేపు పోతుంది. రోజూ మనం ఎంతమందిని చూడ్డంలేదు లక్షాధికారులు భిక్షాధికారులు కావటంలే—'

తల్లికి ఆ తర్వాతలో కారం వేసి రాచినట్లైంది. దాన్తో ఆవిడ చిరాకుపడింది.-'ఈ అడ్డదిడ్డం మాటలన్నీ చెబుతున్నదానిని మువ్వ నిజానికి మొగుడితో కాపురం చేసేదానివేనా?' అని

అహోబలరావు అనుకున్నాడు—యిలాంటి బంధం వుంటేనేకోట అన్ని మనస్సా త్రెంపుకుంటా

మన్నా తెగవు. లేనిపోట ఎంత అణుక్కుందామని భగీరథప్రయత్నం చేసినా అతను ఆ ఆశలు గగన కుసుమాలుగానే వుంటాయి. ఎవరి చేతిమెతుకులు ఎవరికి ప్రాప్తో, ఏపిట్ట యేపిట్టతో కలిసి గూడు కట్టుంటో చెప్పటానికి నిజంగా యెవరికి తెలుసు ?

ఎలిమెంటరీ స్కూల్లో చేరినప్పట్నుంచి ఆనర్సు క్లాసు పూర్తయేవరకూ యీ పదిపది హేనేళ్ళలోనూ ఒకే ఒక రకపు మనస్తత్వాన్ని పెంపొందించుకున్నాడు అహోబలరావు జీవితం పొడుగునా అపహాస్యాలకు, స్నేహితుల చీత్కారింతలకు, వేళాకోళాలకు బలియౌతూ వచ్చాడు అంట కత్తెరలోంచి క్రాఫింగ్ వరకూ వచ్చినా డబల్ బ్రెస్ట్ కోటు వేసినా, ట్వీడుసూటు వేసినా అతనూ అతని నడకనూ కతియోజనాల దూరంనుంచి దుర్భిణీ వేసి చెప్ప వచ్చు ఇంటర్మీడియేటువరకూ అతను హోస్టల్లో త్రికాలాలూ సంధ్యావార్చేవాడు అక్కడికి మెస్ రెండుమైళ్ళదూరం వుండేది ఈ రెండుమైళ్ళూ పెద్దాపురం పట్టుపంచె బిళ్ళగోచీపెట్టి కడితు తరీయాన్ని బుజాన్నేసుకుని చేతిలోని రాగిచెంబుతో భోజనానికి శ్రీ మల్లవరపు వల్లభరాయుడుగారిలా బయల్దేరి వాళింటకుపోతూవుంటే, ఆ పిలక గగన సీమల్లో సంచారంచేస్తూవుంటే, క్రొత్తగా మొదటి సంవత్సరంలో చేరినవాళ్ళ దగ్గర్నుంచి, ఫైనలియర్ల వరకుఅప—మగా అన్న విచక్షణభేదం లేకుండా అంతా నమస్కారాలు చల్లించి భక్తితో త్రోవ యిచ్చేసేవారు కొందరు భక్తగణంలోనివారు అతడ్ని అక్కడే నిలేసి శ్లోకాలూ స్తోత్రా తెలియనివి చెప్పించుకుని మరీ వదిలేవారు

అహోబలరావు రామానుజాలవారి మతానికి హృదయాన్ని అంకితం చేశాడు విష్ణుచిత్తీయము అతడు తలక్రిందపెట్టుకు నిద్రపోయే గ్రంథం అహోబలరావు విశిష్టాద్వైతికూడా—పరబ్రహ్మైక్య తను దచ్చినా దప్పగోడు చరిత్రకారులు కొంత కుంది కాలేజీలో చదువుకునే రోజుల్లో అహోబలరావుకి 'ప్రపన్నాఖ్యుడు' అనే గౌరవ నామం వున్నట్లు కూడా చెబుతారు అతను అన్ని తరగతుల్లోను ఉత్తమశ్రేణిలోనే వచ్చాడు. కాని ఆనర్సులో సెకండ్ క్లాసు. అక్కడే వచ్చింది గట్టి చిక్కు, విశిష్టాద్వైతం కొంపతీసింది.

ఆచార్య శివశంకరరావుగారు ఎప్పుడో చెప్పారు, అహోబలరావు ఎంత సూపర్ స్టిషస్ మనిషంటే అతను వకుళాభరణస్వామి శివ శివా! అనిగాని, హర హరా! అని గాని ఎవరైనా అన్నట్లయితే చెవులు రెండూ మూసుకుని వినపడనంత దూరం పరుగెత్తుతాడని ఆయన ఒకరోజు స్వయంగాపిలిచి 'నాపేరేమిటి చెప్పు'ని అడిగాడు 'హరిహర' అని చెప్ప వచ్చాడు అహోబలరావు ఆరుసార్లు కానీ నూరారు కానీ వేయి సార్లైన నామోచ్చారణచేయ వచ్చాడు. అతను తిరునామాన్ని తీర్చి దిద్దితే యమ్. యమ్. యాం రైలుపెట్టెమీది పట్టి వర్ధనాలకన్నా ఎక్కువ స్పష్టంగా గోచరించేది చివరకా విశిష్టాద్వైతమే అతిడి ఫస్టుక్లాసు కతన్ని దూరంచేసి మరీ వదిలింది. ఐతే యూనివర్సిటీకల్లా ఫస్టుగా రేంకులో నిల్చే వలసినవానికి ఫస్ట్ క్లాసు రాకపోగా, మెడపట్టుకు గెంటితే సెకండ్ క్లాసు గుంపులోకొచ్చి పడ్డట్లు తెలియగా ఆ తెలిసినరోజుల్లోనే అహోబలరావును గంజికావిడేసి రైల్లో ఎక్కించాల్సినంత పనయింది తరువాత కొద్దిరోజులకిగా జరిగింది కాన్వొకేషను. అప్పటికి ఫస్టుక్లాసు రాలేదేమా అన్న విచారం మానవుడ్ని పట్టుకు వదల్లేదు ఉద్యోగం దొరికాక యిప్పుడావిచారంమాయమైంది దానిస్తానేలోకంలో బ్రతకటానికి జీవితయాత్రను సరిగా వెళ్ళబుచ్చటానికి ఒక యూనివర్సిటీడిగ్రీలే చాలవని ఎన్నో మరువులు మెలకువలు మాయలు మోసాలు కుతంత్రాలు నేర్చుకోవాలని లేకపోతే అధోగతి అన్నది విశ్వయమే! అని తేలింది

అలివేలు దీపం వెలిగించుకొచ్చి—'ఇంకా యిక్కడే కూర్చున్నారేం? ఏ కాయకుపో లేదా—' అని ఆశ్చర్యంతో అడిగింది.

'ఇటురా కూర్చో' అలివేలు మాట్లాడకుండా వచ్చి కూర్చొని, 'ఎందుకండీ అంత దిగాలుపడి పోయి కూర్చున్నారు యింట్లో యీనాటి మీ అమ్మమ్మ యేమన్నా జ్ఞాపకొచ్చిందా!' అని కొంగు చాటు చేసుకుని నవ్వింది అహోబలరావు అలివేలిని చూస్తూ—

'ఇక మనం అమ్మమ్మనే జ్ఞాపకం చేసు కుంటూ కూర్చోవాలి.'

'ఏం అలా అంటున్నారు?' అని తన చేతిలోకి అతడి చేయిని తీసుకుంటూ అంది

అంత అందమైన కళ్ళల్లోకి చూస్తూ—'నేను చెప్పలేను చెప్పి నీ మనసుకూడా పాడుచేయలేను' అన్నాడు సంశయంగా

'నా మనసు మీ మనసులాటిది కాదుగా' అంది అలివేలు

'ఏమైనా పాడవుతుంది ఎందుకు చెప్పటం?'

'చెప్పకపోతే వాచుకోండి రెండి భోంచేద్దాము'

'నా ఆకలి లేదు నువ్వు తిన'

'మీరు తినకుండా నే చెప్పానన్నా తిన్నానూ?'

'ఇవాల్టికి తిందూ— నా మనసు బాగులేదన్నానుగా'

'ఏవిటి ఆ విజయ అన్న అమ్మాయి ఏమన్నా చేసిందా?' అలివేలు నవ్వు నాపుకుందుకు యత్నిస్తూ ప్రక్కకు తిరిగి అంది

'ఏమిచెయ్యాలో అదచేసింది ఏనా అమ్మాయి నవనలసిన పనేముంది మన ప్రారబ్ధమే అట్లాగుంది తయనేం చెప్పటం లేదనీ, యీాయన మకు అక్కర్లేదంటూ డిప్యూటేషను వెళ్లారు ఉద్యోగం వుంటుందో ఊడుతుందో తెలీదు ఇటువంటప్పుడు అన్నం యెట్లాసయిస్తుంది చెప్పు?'

'నోస్—యింతేనా!' అంది అలివేలు

'ఏం యిది చాలదా?'

'అదికాదండీ—మీా కెందుకు కోపం ఉద్యోగ్యం వెయ్యటం కష్టంగాని తియ్యటం అంత తేలికకాదు'

'ఓహ్హో—నీకు బాగా తెలుసు'

'అబ్బ! నాకు తెలుసండీ. మీాకేం భరవా లేదు వచ్చి భోంచెయ్యండి'

'నేను తన్ను చాలాసార్లు అవమానించటానికి ప్రయత్నించినట్లు ఆ అమ్మాయి రిపోర్టులో వ్రాసింది' అన్నాడు దిగులుగా

అలివేలు గది ప్రతిధ్వనించేట్లు నవ్వి— 'మీారా—మీారు నిజంగా అటువంటిపన్లు చేశారా?' అంది.

'నే చెప్పొద్దూ చెయ్యలేదు. చెయ్యను.'

'అవమానించటానికి ప్రయత్నించటం అంటే'

'నాకొంద— నే చెప్పొద్దూ ఆ అమ్మాయి ముఖంలోకి చూసి నవ్వదన్నా నవ్వలేదు'

'మీారు నిజంగా అట్లాచూసి నవ్వివుంటే కథ యింతవరకూ రాక నేపోను'

'అలివేలూ—ఏవిటే వేళాకోళం? యిది ఎటువంటి సమయం—రేపు మనం ఎక్కడ తలదాచుకోవాలి' ఆ ఆలోచన వచ్చేసరికి బుర్ర పగిలిపోతల వంటే—'

'ఏవిటండీ—బుర్ర పగిలేది? నిజంగా తన్ను అవమానించే ప్రయత్నాలు మీారు చేస్తున్నట్లు ఆ అమ్మాయి వ్రాసిన రిపోర్టు నాధారంచేసుకొని మీా మీాద చర్య తీసుకుంటారనా?'

'నో తప్పకుండా'

'అప్పుడు చక్రం అడ్డువెయ్యలేనో'

'ఏవిటి నువ్వా' అన్నాడు కుర్చీలోంచి లేచి అహోబలరావు

'అవును—నేనే ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళినా ఆపితేం చూపి గల్పుకవస్తాన మీా కోసం నేను ఏద చెయ్యలేను?' అహోబలరావు 'ఈ నా చేయి పట్టుకో—' అలివేలు తలుపులు తెరిచివచ్చి 'అందివ్వండి' అంది 'ఇదుగో— అమ్మయ్య యిప్పుడు కుర్చీలోంచి లేచాను ప్రాణం ఎంత తేలిగ్గా వుంది.' వంటయింట్లోకి నడుస్తూ 'ఉంటుంది మీాకు నిజంగా ఆపిల్ల అంటే అంత భయమేమిటండీ?'

'భయం కాకపోతే—ఆ అమ్మాయిని రెండు చెవులూ పులిమెయ్యమనా, గోడకుర్చీ వేయించమనా ఏమిటి నీ అభిప్రాయం?'

'అంతకన్నా ముఖ్యమైన శిక్షే వుంది గట్టిగా రెండు చేతుల్లోకి తీసుకుని నలిపేసి వుంటే ఆ అమ్మాయి యిట్లాటి పెంకెపన్లు ఎప్పటికీ చెయ్యకుండా వుండేది!'

పీట వాల్చుకుని కూర్చొంటూ 'ఆ పని నేన్నే చెయ్యాలనా—'

అలివేలు కంఠం ఎత్తిపట్టుకుని 'నిజంగా మీారే ఆ పని చేసివుంటే నా కెంత గర్వంగా ఉండేదని.'

'ఊరికే పైకంటావు నేను చెయ్యలేని చెయ్యి లేదని తెలుసు గనక '

అలివేలు నవ్వి 'అందరికి మల్లే అమాయకనవనా—ఒక్కొ నాటికి వనను మీ రా పని చెయ్యండి మళ్ళీ ఆ అమ్మాయి '

'భ ( నేనవ్పుడగ్గర్నుంచి లేచిపోతాను మళ్ళీట్లా మాట్లాడావంటే '

'మాట్లాడను లెండి ఈ పచ్చడి కల్పుకోండి యిది మీ కిష్టమని చేశాను '

పచ్చడి నాలుక్కి రాసుకుని 'నీ చేయి దివ్య మైన రుచుల్ని పుట్టిస్తోంది వుండు నా బుజంమీద చెయ్యేస్తా వేమిటి? అదుగో వాళ్లిటో కిటికీలోంచి చూస్తున్నారు '

'పోండి. ఎవరూ లేరు అంతా అబద్ధం ఇవ్వాళ నేను మడికట్టుకోలేదు తెల్సా ' చిత్తం గ్రహించా నన్నాడు అహోబలరావు చందమామ వెన్నెలలు విరియించాయి సన్నజాజులు నవ్వనై

## 8

తెల్లారి లేస్తూనే 'యీవాళ నన్ను మాట్లాడించకండి మీ పన్లు మీరు తెవుల్చుకోండి న ఊ వస్తున్నాయ్ ఇంటికి తాళంవేసి మధ్యాహ్నం అలా వెళ్లివస్తాను కొంచెం పర్మిషను యిస్తారా!' అంది అలివేలు

'విషయం చెప్పు' అన్నాడు టూత్ బ్రష్ తిరగేసి తల బరుక్కుంటూ—

'అసలు విషయం ముందు చెబితే కథ ఎప్పుడన్నా రక్తి కడుతుందీ!' అంది కాఫీకోసం కుంపటంటిస్తూ అలివేలు

'ఇప్పుడు నువ్వు నాకేవిటి కథ చెప్తావ్!'

'మంచికథ అనగా అనగా ఒక అబ్బాయి వున్నాడు ఆ అబ్బాయి ఒక మంచి వాడూనైన అమ్మాయిని సైకిలు మీంచి పడగొట్టాడు. అప్పట్నించి వాళ్ళ మనస్సులో రాగద్వేషాలు రాజు కొంటూనైన్న.' అహోబలరావు పోయమంగా— 'నేను నువ్వు చెప్పేకథ వినదల్చుకోలేదు. నీకు ఆ కథలో సంబంధంలేదు.'

'సంబంధం లేదంటే మీకు ఉద్యోగం వూడుతుంది.'

'ఏకే యింతకి నువ్వేమిటి చెయ్యదల్చుకున్నావు ఇల్లిల్లూ తిరుక్కుంటూ విరాళం వసూలు? నా అవస్త నేనేదో పడ్తాను కావలిస్తే తమాషాగా పత్రం వ్రాసియిస్తాను మిచ్చేందుకు నీకు పుణ్యముంటుంది—ఎక్కడికీ వెళ్ళొద్దు '

'అవకసరంగా మీరు ఆ అమ్మాయికి తమా పణపత్రం వ్రాసియిచ్చి మర్నాడు మీరా కాలేజీలోనే పాఠం చెప్పదల్చుకొన్నారా? అట్లా ఒక్క నాటికి జరగటానికి వీల్లేదు నేను వెళ్లి మీ విజయను కల్సుకుని మాట్లాడివస్తాను మీ తరఫున నాకు పకాల్తి యివ్వమని ప్రార్థిస్తున్నాను ఎందుకు ఘోరంగా ఆలోచిస్తున్నారు? యేమిటీ సంశయం?'

'ఏమీ లేదు బ్రహ్మదేవుడు నన్నే భార్యను చేసి నిన్ను భర్తనుచేసి వుంటే ఎంత బాగుండి పోయేది అని '

అలివేలుకి కోపమొచ్చి యింట్లోకి వెళ్లి పోయింది తరువాత వాళ్లుమాట్లాడుకోలేదు అరగంట పేపు అలివేలే ఆ యుద్ధాన్ని రాజీలోకి తెచ్చే ఉద్దేశంతో 'ఇదుగో, మిమ్మల్నే, మన యీవా దనలో కూరల మనిషి కేక వినిపించుకోలేదు కూరలుటంటి బజారుకెళ్లి ఎట్లా తెస్తారో చూస్తాను!' అంది అహోబలరావు పంచెపుచ్చుకు వీధిలో కొచ్చి 'ఎట్లా తెస్తానో చూస్తుందిట నాకేమి అంత లోకజ్ఞానం తక్కువా?' అంటూ మార్కెటు వరకూ సాగిపోయాడు విసా విసా ఇట్లా యిలా గమకున్నాడు ఏదన్నా హెచ్చు తిక్కలకస్తే అలివేలు తిప్పకుండా దెప్పుతుంది కూరలవాళ్లు తనది క్రొత్త మొహమని ధరలెక్కువ చెబుతారో, తప్పుడు తూకాలు తూస్తారో—అట్లాటి వేషాలు తన దగ్గిరా? హనుమంతుడిముందు ఎవరన్నా కుప్పి గంతులు వెయ్యగలరా? ఇట్లా అనుకున్నప్పుడు చొరవచుకొచ్చిన ఆవేశంతో ఎదురుగుండా కని పిస్తూన్న ఒకటి రెండుకూరల దుకాణాలప్రక్క నుంచి కాలిసంచీ నలుగురి కళ్ళనిపించేలా ఊపు తుంటూ ఒకసారి నడిచాడు అమ్మకం జోరులో— జేబైపునుంచి గోతాంక్రిందకు డబ్బులు, నోట్లు, వెళ్లినట్టి వస్తూండగా అటువంటి మంచి రద్దీలో కేర గాస్లు గంపలమీదకు యీ గల్లా మునుగుతూన్న ప్పుడు, లేచి 'రండి' అని అహోబలరావును ఎవరు

గద్దాలకు నవ్వురాని హాస్యాలు భోజనాదికాలు పూర్తిచేసుకుని కేళ కొందరమ్మాయిలప్పుడే ముస్తాబులకు చివరితీర్పులిచ్చే సమయం విజయకు గుండెల్లో గుబులొచ్చిపడింది. రేపు తనకా కాలేజీతో ఋణం తీరిపోతుందని తెలియని అహోబలరావు చివరి ఉపన్యాసంతోను వినటానికి వెళ్ళాలి. వెళ్లి అక్కడ కూర్చోటానికి తనకెంత యమునలాటి కఠినహృదయం కావాలి రేపు అతను అలోలక్ష్మీ అని ఉద్యోగం పోయి యేమవుతాడు అతని క్రొత్త సంసారం కాకులకి గ్రద్దలకి అవుతుంది ఆ కాకులూ గ్రద్దలూ ఎవరు? విజయగుండె దడ్డనజారినట్లయింది

కాలేజీకి వెళ్ళటంకోసం తీసిన పుస్తకాలు బల్లమీద గిరాటువేసి చేతుల్తో ముఖాన్ని కప్పుకుని కూలబడిపోయింది కుర్చీలో విజయ కిటికీలోంచి క్రిందకు చూస్తే బజారుగోడను చార్లవేసి వుంచిన కుక్కుటుక్కైన లేడీసైకిలు 'క్రోధం బహు చెడ్డ వస్తువు సుమా' అని హెచ్చరిస్తోంది విజయ దిగాలుపడ్డ ముఖంతో అటూ యిటూ తిరుగాడుతూండటాన్ని గమనించిన దమయంతి 'కాలేజీకి టైము కాలేదుటే—లేచి అన్నానికి రా' అని వంటింట్లోంచి కేకేసింది విజయ లేచి వంటయింటి గుమ్మంలోకొచ్చి 'ఈవాళ కాలేజీకి ఎల్లా వెళ్లను? వెళ్ళలేనే అక్కా—' అంది కాలితో నేలను రాస్తూ సరిగ్గా యిదే సమయానికి విజయ తల్లి చిన్నకూజాబిందెను నీళ్ళతో సహా ఎత్తి భుజాన వేసి లోనికి రొప్పుతూవచ్చి 'అదే—అదే అది వచ్చిందే—యింట్లో ఎవరూ లేరే ఎల్లాగ బాబూ!' అని కంగారుగా యిటూ అటూ చూసింది దమయంతి చెరగు మీదకు లాక్కొని వీధిలోకొచ్చింది జనకాలే విజయ మెల్లిదిగా అడుగులో అడుగేసుకుంటూ కిటికీలోంచి ముందుకు చూసింది.

గేటు తోసి తగించి వస్తూ అలివేలు 'క్రొత్త చుట్టాన్ని ప్రసాదరావుగారి మరదల్ని పరిచయం చేసుకుందామని వచ్చాను' అంది

దమయంతి 'రండి' అంటూ ఎదురుగా వెళ్లి 'మీవారు కాలేజీలో లెక్చరరు గదూ' అని చేయి పుచ్చుకుని పెట్టమీదనుంచి నడిపించుకెళ్లింది విజయ తల్లి భంగారుగా వెనకనుంచి విజయను జబ్బ పుచ్చుకు లాగుతోంది లోనికొచ్చేయమని. విజయ తల్లిని విదల్చుకొని హాలులోకి వచ్చి పచ్చటి పసిమి రంగుఛాయతో మెరుస్తున్న అలివేలు రూపాన్ని తీర్చిదిద్దినట్లు కట్టిన ఆమె కెంపురంగు చీరను, ముఖాన్ని శుభసంపత్కరచిహ్నంగా దిద్దుకుంగళ్ళరంగా కనుపిస్తున్న కుంకుమను, ఆశ్చర్యంతో చూడసాగింది.



దమయంతి 'ఈ అమ్మాయి మావారి శిష్యురాలు' అంటూ పరిచయం చేయబోయింది. అలివేలు 'గట్టి శిష్యురాలే—విజయ కదూ మీ పేరు. మీరే కాలేజీలో పని చేస్తున్నారనుకొని మావారు పొరబడి ఒక క్లాసు వదిలేసారట నిజమేనా?' అంది నవ్వుతూ అలివేలు

విజయ 'నిజమే ' అంటూ దగ్గరగా వెళ్ళి ఆమెలోకి చూడసాగింది అలివేలు దేనికోసమో వెతుకుతూన్నట్లు చూసి 'ఏరిమీ అమ్మగారేరి? వారి యెడల కొంచెం దురుసుగా ప్రవర్తించాను క్షమించమని అడగాలి' అంటూ లేచింది

అప్పటికి విజయతల్లి నొట్ట పోయినబిందెను మెల్లిగా వంకరలు తీరుస్తోంది అలివేలు దవ్వున ఆవిడ రెండు చేతుల్ని పట్టుకుని 'పిన్నిగారూ! చిన్నవాళ్లను మీరు క్షమించాలి అప్పుడు కొంచెం దురుసుగా ప్రవర్తించినమాట నిజమే ఇప్పుడు మీ స్నేహం కోరివచ్చాను'

విజయ తల్లి క్రిందు మీదై 'హా హా హ్హా!' అని మాత్రం అనగలిగింది దమయంతి 'మాయిల్లు చూద్దురుగాని రండి' అంటూ వంట యింటిలోనికి తీసుకుపోయి పీటవేసి కూర్చోపెట్టి పుట్టింటా రేపూరో అన్నీ వాకబులు చేయ ప్రారంభించింది తన పుట్టినిల్లు రాజమండ్రి అనీ తన తండ్రి హైస్కూల్లో మాస్టరనీ అన్నీ చెప్పాక విజయకేసి తిరిగి 'మిమ్మల్ని మాట్లాడించటం ఎట్లాగో నాకు తెలియడం లేదమ్మా ఎందుకనంటే నాకు వచ్చినచదువు చాకలిపద్దుల వరకే—అంతే ఇవ్వాళ మీరు బడికిపోలే నట్లుంది వంటింటి నా మొహం! కాలేజీ అనాలికా హోను'

విజయకీమాటు నవ్వు వచ్చింది నిజంగా. 'వొంట్లో ఏమీ బాగాలేక వెళ్లలేదండి' అంది.

దమయంతి కాఫీ తెచ్చియిచ్చింది విజయ దొడ్డోదని పూలుకోసుకొచ్చి 'యివియివి తీసుకోండి' అంది అలివేలు కొంచెం గంభీరంగా 'అమ్మా నేను నిజంగా నిన్నొకటి యాచించటానికి వచ్చాను ఆతిథ్యాల్ని స్వీకరించటానికి రాలేదు కాని మీ మంచి మనస్సులతో యిస్తే అది ఎట్లా కాదనను?' పూలందుకుంది దమయంతి 'ఎందుకండీ అట్లా అంటారు? అదిచిన్నపిల్ల దానికేం తెలుసు?' అలివేలు నవ్వి 'ఇప్పుడీమె యెంత చిన్నపిల్లో యింతకన్నా వక్కిరట్ల పసిపిల్ల డొకడున్నాడు మాయింట్లో అతని చేష్టలవల్ల మాకున్నా కష్టం నష్టాలు కలిగితే మన్నించమని అడగటంకోస వచ్చాను. అతనకేమీ తెలియదు. నాకు తెలియనిది

ఆయనకు తెలిసినదల్లా అచదునే' అని విజయ రెండుచేతులూ పుచ్చుకుని 'యీ చిన్న అక్క కోర్కెను మన్నించరా' అని అడిగింది

## 10

కాలేజీనుంచి 'అదరా బాదరా' యింటికొచ్చే సరికి గుమ్మానికి పెద్ద తాళం వొకటి వేసివుంది అహోబలరావుకి అటువంటి సమయంలో మొగుడనే వాడికి ఎంత కోపం వస్తుందో అంత కోపం వచ్చింది ఐతే ఆ కోపం ఎట్లాగన్నా బహిర్గతం కావాలి? మరోక అసందర్భం ఏమిటంటే 'తను ఎక్కడికీ కదల వద్దని వార్నింగ్ యిచ్చాడా? అప్పటికి తన మాట తిరుగుతిరిగి వెళ్లిపోయింది అహోబలరావుకి బాగా తెలుసు తను అనుకున్న పని అలివేలు చేసితీరుతుందని ఆ వాళ్ళ కొంపకు పడిపోయివట్టుంది వెళ్లి ఏమని చెప్పివుంటుంది తన భర్త శుద్ధ తెలివితక్కువ వెధవనీ, తనే మహా గడుసుదాన్ననీ చెప్పివుంటుంది ఇవన్నీ చెప్పి ఆ అమ్మాయిని రిపోర్ట్ను ఉపసంహరించుకోమని అడగటానికే వెళ్లివుంటుంది ఎంత అవమానకరమైన పని! ఈ భూప్రపంచకంలో మొగుడనే వాడి అజమాయిషీలోవున్న ఆడది చేయకలవినపను లేదా మట్టికి బైలుదేరింది ఛీ! సుప్రసిద్ధ కాలేజీ లెక్చరరు అహోబలరావు పరువంతా మంటలో కలిసిపోయింది అయిపోయింది—యింకా కాలేజీ లెక్చరర్ పదవి ఏమి? ఇహ ఎల్లుండో మీటింగ్ వస్తుంది ఎందుకొచ్చిన బ్రతుకు? ఛీ! రేపు యీ వూళ్లో ఏ ఆధారాన్ని నమ్ముకుని వుండటం? అతని కళ్ల ముందు భూమి రోడ్డు రోడ్డుమీద మనుష్యులు అంతా గిరగిరా తిరుగుతున్నారు డబ్బు లేక అగచాట్లు పడే పేదాది అసంఖ్యాక భారతప్రజల హీన చరిత్ర పుటలు అతని మనఃఫలకాన గబగబా కదుల్తున్నాయ్ కేవలం హైన్యమే అతని కళ్ళముందు తాండవమాడివుంటే పరవాలేకపోయేది అటువంటి హీనస్థితి తనకు వచ్చేసినట్లే—వచ్చి ఎంతో కాలమై నట్లే ఫీలయ్యాడు అప్పుడిక అలివేలు తన చెప్పు చేతుల్లోంచి కట్టలు త్రెంచుకునే ప్రమాదకరమైన వస్తువులా అతనికి గోచరించింది 'విజయేరా అమ్మాయీ!' అన్నట్లు చింతచెట్లు జడలు విరబోసు కుంటున్నాయి చీకట్లు ముసురుతున్నాయ్ అహోబలరావు పళ్లు పటపటా కొరికాడు ప్రతిఅతేక మెత్తిపోతోంది గుమ్మంలో చతికలబడి గుడ్లు పెద్దవిచేసుకుని మనస్సు ఆక్రాంతం చేసి చూడబోగాడు అటు వంటివాడికి మాత్రం యేమి అన్తుంది? ఎదురుగుండా రిక్షా ఆగటం అందులోనుంచి మనుష్యులు తన వైపుకు రావటంకూడా అతనికి తెలియదు బాగా దగ్గర పావచ్చి తలుపుతాళం తీస్తుంటగా తెలివొచ్చింది అహోబలరావుకి ఆ మనిషి అలివేలులా గమనించి పూచిపుచ్చుకు లెంపకాయ కొట్టాడు 'అమ్మా!' అని అలివేలు గోడమీదకు త్రాలింది గోడనున్న మేకు కణతలకు తగిలి గాయమేర్పడింది ఇది గమనించని అహోబలరావు 'ఎక్కడికెళ్లావే—రాక్షసీ! వెళ్ళొద్దన్నా నా—అని మళ్లీ చేయెత్తాడు వెనక నుంచి అతని ఎత్తినచేతిని ఎత్తినట్లే ఒక అమృత హస్తం గట్టిగా పట్టుకుంది

అప్పుడు అహోబలరావు ఆ అమృతహస్తాన్ని తనవైపుకు త్రిప్పుకుని కళ్లలోకి కళ్లు పెట్టిచూశాడు విజయ గప్పున చేయివదిలేసి 'విజయా' అని పక్కకు గెంతాడు గుమ్మందగ్గర కూలబడ్డ అలివేలు కుడిచేత్తో కణతపొత్తుకుంటూ—'ఇక పరిహాసం చాలించండి మాస్టార్లు రెండవసారు అవమానించదల్చుకున్నారా? వచ్చి తలుపుతీసి దీపం వెయ్యండి '

అహోబలరావు కిక్కురు మనకుండా తాళం తీసిలోపల ప్రవేశించి లైటు వేశాడు అలివేలు చెంపమంచి నెత్తురు కారుతోంది విజయకోపంగా మాస్టారికేసి చూసి 'నేను వెళ్లిపోతాను అక్కయ్యకు తలకు కట్టు కట్టుకో' అంది అలివేలు చేయిపుచ్చుకుని 'మరోమాటు మా సంసారాన్ని మాద్దువుగాని కాని వొక్క రాత్రి వెళ్లలేవు దయచేసి మీ రామెను యింటివరకూ దిగబెట్టి రారూ? ఏమిటి అట్లా చిన్న బుచ్చుకున్నారే విల్వొని నాకు దెబ్బ తగిలిందనా—యీవాళ నా కెంత ఆనందంగా వుందని ఈ బాధను నెమ్మంతో పొయ్యుంగా అనుభవిస్తాను వెళ్ళండి' అని ప్రతిమాలింది

అహోబలరావు విజయను వెంటబెట్టుకొని వెళ్తున్నాడు విజయ యింక వుండబట్ట లేక యింటి దాకా వెళ్లాక 'మాస్టారూ—అతిని మిమ్మల్నెంత యిదిగా ప్రేమిస్తోందో మీకు తెలుసా?' అని అడిగింది. 'అనాటనుకు విజయా ప్రేమ ఎట్లాటిదో నాకిప్పటికి తెలీదు' అన్నాడు విజయ అతని ముఖానికేసి తేరి పారచూసింది. అప్పటికే అతని ముఖం చెరువయి చెంపలన్నీ తడిపిపోతున్నాయి.

---

నాటిక:

# నిరంతరజ్యోతి



శ్రీ వేలూరి సహజానందం

కథకుడు

"ఈ జగంబు సర్వమేమిటి యేమిటి? *
యేమి యీ జగం బిదెల్ల నెల్ల?
ఎవ్వరేని యిందు తెలిసినవారున్న
విస్తరించి నాకు చెప్పరన్న"

మనుష్యుడీ ప్రశ్నను యుగ యుగాలనుంచి అడుగుతున్నాడు మనుష్యుడు కాలిడిన ప్రతిచోట ఈ ప్రశ్న ప్రతిధ్వనిస్తుంది నిబిడమైన అజ్ఞానాంధకారంలో ఈ ప్రశ్న, ఈ సత్యాన్వేషణే నిరంతర జ్యోతి గ్రీసులో సుమారు 2000 ఏళ్ల క్రితం ఈ జిజ్ఞాసతో ఉత్తేజితుడైన సోక్రటీస్ సంఘాధికారుల ఆగ్రహానికి గురి అయాడు న్యాయసభలో సోక్రటీస్ పై అభియోగం తెచ్చారు

ఒకరు సోక్రటీస్ నిరీశ్వరవాది

(పాజ్)

ఇంకొకరు తరతరాలనుంచి వస్తున్న పద్ధతులను విమర్శించి, అవహేళన చేసి, యువకులను భ్రష్టులను చేస్తున్న సంఘ విధ్వంసకుడు.

సోక్రటీస్ పౌరులారా నాపై అభియోగం విన్నారు ఇది కేవలం అయథార్థం నేను నిరీశ్వరవాదిని కాను

(పాజ్)

ఒకరు: బజార్లలో ప్రతివానిని నిలబెట్టి, వానికి జ్ఞానంలేదని నిరూపించటమే వృత్తి పెట్టుకున్న నిరీశ్వరవాదివి

సోక్ర నేను యువకులను దుర్బోధ చేస్తున్నానని నాపై నేరం మోపారు స్వార్థం కోసం ఆస్తిపాస్తులకోసం కాలం వృథా చేయకండి మీ ముఖ్యకర్తవ్యం మీ అంతరాత్మలను శుద్ధి పరచుకోటం ఇదే నేచేసే ప్రబోధం ఇది దుర్బోధా చెప్పండి

ఒకరు నీవు నిరీశ్వరవాదివనే మా ఆరోపణ

సోక్ర ప్రవర్తనవలన ఈ అభియోగానికి అంగబలం కలగదు మీ దేవతలను కాక వేరు దేవతలను పూజిస్తున్నాననా లేక నిరీశ్వరవాదాన్ని ప్రబోధిస్తున్నాననా మీ ఆరోపణ నేను నిరీశ్వరవాదినికాను కాని బుద్ధిని వినియోగించమని నాబోధ (పాజ్) మీ తీర్పు నాకు విధించినా, నా జీవితాన్ని మటుకు నేను మార్చుకోను

ఒకరు అంతులేని అహంకారం

సోక్ర నా ప్రశ్నలవలన, చర్చలవలన తమ అజ్ఞానం బైటపడుతోందని నా వ్యతిరేకులు నన్ను న్యాయసభలోకి తెచ్చారు.

మరొకరు: సోక్రటీసు మర...కు విధింపబడింది విషపానం

(పాజ్)

సోక్ర ఈ తీర్పు నాకు ఆశ్చర్యంకాదు అత్యంత కష్టమైన పని మృత్యువునుంచి తప్పించుకోటం కాదు అన్యాయానికి దూరంగా ఉండటం నన్ను చంపినందువలన, మీ జీవితాలను విమర్శించేవారికుండి తప్పించుకోవచ్చునని మీ రనుకోవచ్చు కాని అది సాధ్యమూకాదు గౌరవప్రదమూ కాదు. ఇతరులకు హాని కల్గించి, వారిని నిర్వీర్యులను చేయటంకాదు సరైన మార్గం తమను తాము బాగుపరచుకోటం సత్యమైన మార్గం

మిత్రులారా, మళ్ళీ ఎన్ని శతాబ్దాలకో ఇలాంటి మనిషి జన్మించటం. ఏమి అంతస్సు.. ఆ ముఖంలో రవ్వంతకూడా విచారంలేదు. ఈ దీపమూరాక, మనం కబోదులం, కబోదులం.

సోక్ర మిత్రుల కొకమాట. సత్యవంతునికి కీడు జీవితంలోనూ వాటిల్లదు. మృత్యువుతోనూ

* వేలూరి శివరామశాస్త్రిగారి 'ఏకాకి' నుంచి.

వాటిల్లదు. దేవతలతన్ని విస్మరించరు. నా వ్యతిరేకులం దూలంగా నాకేమీ కాని జరిగిందని భావించకండి నాకు మంచి చేయాలనే ఉద్దేశ్యం వారికి లేకపోయినా, వారు నాకేమీ హాని చేయలేదు.

మిత్రులు బిడ్డలున్న తండ్రి అన్యాయకు రాలు భార్య వీరికతి ఏమికావు?

సోక్ర నా పుత్రులు పెరిగి పెద్దయాక, ధర్మంమీదకన్న సంపత్తుమీద నా రెక్కువ మక్కువ చూపిస్తే వారిని శిక్షించండి బాధించండి ఈ ఉపకారం మీరు చేస్తే నాకూ, నా సంతానానికి మంచిచేసినవా రవుతారు.

ఒకరు విచారణ ముగిసింది మీ రిక వెళ్ళవచ్చు!

మిత్రులు సోక్రటీస్

సోక్ర మనకు వీడ్కోలు సమయం వచ్చింది ఎవరిదారిన వారు వెళ్ళక తప్పదు నేను మరణించటానికి మీరు జీవించటానికి. ఏది ఉత్కృష్టమో ఈశ్వరుని కెరుక

(పాజ్)

సోక్ర క్రిటో అప్పుడే వచ్చావు?

క్రిటో అవును ఇంకా సాంతం తెల్లవారలేదు

సోక్ర జైలుకావలాదారి నిన్ను రానిచ్చాడా?

క్రిటో: అతను నన్నెరుగును

సోక్ర మరి నన్ను లేపకుండా కూర్చున్నావేం?

క్రిటో ఇట్టి విషమసమయంలో కూడా నువ్వు ఇంత ప్రశాంతంగా నిద్రపోవటం నాకు ఆశ్చర్యం అట్టి పవిత్ర నిద్రను భంగం చేయదలచుకోలేదు

సోక్ర: ఈ వార్ధక్యంలో మృత్యువుకు చూసి విచారించకూడదు

క్రిటో: నీకన్న ముదుసళ్లు కూడా ఇలాంటి సమయాల్లో ఖేదం పొందకుండా ఉండలేరు

సోక్ర: నిజమే మరి. నువ్వెందుకు వచ్చిందీ చెప్పలేదు.

క్రిటో. నేనిదివర కడిగిన కోరికే మళ్లీ అడుగుతున్నాను. సోక్రటీస్.. జైలునుంచి నువ్వు పారిపోవాలి.

సోక్ర: క్రిటో

క్రిటో. అవును సోక్రటీస్.. నీవు చనిపోతే పూడిలేని హానిని పోగొట్టుకోటమే కాక, ప్రజల ఆగ్రహానికి గురవుతాను

సోక్ర ప్రజల ఆగ్రహానికి

క్రిటో అవును నిన్ను, నన్ను ఎరుగని ప్రజలు నన్ను నిందిస్తారు. డబ్బు ఖర్చు పెట్టటానికి ఇష్టం లేనందువలన నిన్ను రక్షించలేకపోయానని, నేను నిర్లిప్తుడుగా ఉన్నానని వారు అంటారు

సోక్ర క్రిటో

క్రిటో అంతకన్న అవమానం ఉందా? స్నేహితుని, అందులో నీలాంటి స్నేహితుని ప్రాణం కన్న నాకు ధనం ఎక్కువా? పారిపోవలసిందని నేను నిన్ను కోరినట్లు, నీవు తిరస్కరించినట్లు వారికి తెలియదు చెప్పినా వినరు

సోక్ర క్రిటో జనాభిప్రాయంగురించి భయపడద్దు సత్పురుషులు ఈ సంఘటనను సరిగానే అర్థం చేసుకుంటారు వారి మాటే ప్రమాణం

క్రిటో సోక్రటీస్.

సోక్ర క్రిటో రానున్న మృత్యువునుంచి తప్పించుకొని ఎలాగో ఎక్కడో తల దాచుకుని జీవించమని నీ కోరిక.

క్రిటో అవును

సోక్ర కాని కేవలం జీవించటమే ప్రధానం కాదు అమూల్యమైనది కేవల జీవితం కాదు స్వచ్ఛ జీవితం క్రిటో అధికారులను శాసనాన్ని మోసపుచ్చటం అయుక్తమైనదని మనం ఆ అపకార్యం చెయ్యకూడదు అవునా

క్రిటో కాదని ఎలా అనగలను?

సోక్ర మనను బాధించినవారిని కూడా మనం బాధించకూడదు

క్రిటో అవును

సోక్ర: ప్రతీకారచింతను త్రోసిపుచ్చాలి.

క్రిటో అవును

సోక్ర ఈ పలాయనచింత వింతటితో విరమించు.

క్రిటో: ఇందుకు నే చెప్పగలిగిందేమీ లేదు. సోక్రటీస్..

సోక్ర : కాబట్టి . క్రిటో జైలేర్పుడు నన్ను విడిచిపెట్టు దైవం ఏదారి చూపితే, అదే నాకు పూలబాట..

జైలరు సోక్రటీస్

సోక్ర జైలర్ . రా నాయనా . రా

జైలర్ : ఇక్కడకు చాలామంది వచ్చారు. కాని మీలాంటి సాధువు వింతవరకూ ఈ సంకెళ్లు తాకలేదు చేసంటే మీకు కో పం

సోక్ర నువ్వంటే నాకు కోపం !

జైలరు కోపం లేదని నాకు తెలుసు ఇక్కడ ఉండేవాళ్ళకు మామూలుగా చేసంటే చాలా కోపం నన్ను తిట్టుతారు శపిస్తారు

సోక్ర నీపై కోపం అనవసరం నీవిధి నువ్వు నిర్వర్తిస్తావు

జైలరు అధికారుల ఉత్తరువుల ప్రకారం విషమిచ్చే కఠోర కర్తవ్యం నాది ఆ దోషం నాది కాదు ఇతరులది

సోక్ర అది గ్రహించకే నీమీద కోపప డటం

జైలరు ఈ చీకటిగుహలో చిక్కు కు పోయిన మాలాంటి వాళ్ళకు వెలుతురు చూపించటం కోసమే భగవానుడు మిమ్మల్ని ఇక్కడకు పంపింది దొంగలను, హంతకులను, వంచకులను బంధించే సంకెళ్లే మిమ్మల్ని కూడా బాధిస్తున్నయ్

సోక్ర ఈ కారు రాళ్ళమన్య మీ హృద యాలుకూడా పాషాణాలు అవుతాయని అంటారు కాని . నే నా మాట నమ్మను నే నిక్కడకు వచ్చినప్పటినుంచి చూస్తూనే ఉన్నాను ఆ గోడచాటుగా వెళ్లి నువ్వు దుఃఖించటం

జైలరు అవును సోక్రటీస్ మాలో మాన వత్వం నశించటం సత్యమే కాని మీ ముఖ ప్రస న్నత, మీ వర్చుల ప్రబోధం వ్యతిరేకులంటే మీ కున్న సహనం ఇవన్నీ నక్షత్రాలై ప్రకాశిస్తుంటే మా చీకటిగుండెల్లో కూడా వెలుగు నిండుతుంది ఓ ప్రభూ ఇదివరకు ఎంతో మందిని మృత్యు ద్వారం వద్దకు తీసుకువెళ్లాను కాని వాటన్నిటికీ క్షమిం చలేపోయినా ఈ సారికి క్షమించు.

సోక్ర : ఇందులో నీ దోషం లేదు. నీ అప రాధం లేదు.

జైలరు : ఓ అంతర్యామీ.. ఆ పవిత్రమైన పెదవులు తాకినప్పుడు ఈ విషాన్ని అమృతం చెయ్యి. సోక్రటీస్ . జరుగనున్నదాన్ని క్షమతో సహిం చాలి.. మరి నాకు సెలవు

సోక్ర : క్రిటో విషం తయారైతే,పరిచార కుని తెమ్మను.

క్రిటో ఎందు కంత తొందర ? సోక్రటీస్.

సోక్ర ఎవ్వరది క్రిటో ఆ ఏడ్పు

క్రిటో నీ ఇల్లాలు పిల్లలు సోక్రటీస్

సోక్ర : ఆఁ ఆఁ సహనం వహించాలి. దేవగృహంలోకి వచ్చే ముందు ఈ అపస్వరాలు స్వర్గంలో వినబడకూడదు

భార్య పాపిష్టిరాలిని ఉన్నంతకాలం మన శ్శాంతి లేకుండా కొష్ట పెట్టాను

సోక్ర ఎందుకా ఆవేశం

భార్య అవును సంసారానికి నిప్ప్రయోజ కుడవని కత్తిన నోరు పెట్టుకుని అరిచేదాన్ని కాని కాని ఏది వీధిన వాడ వాడన ధనికులు. దరిద్రులు, యువకులు, వృద్ధులు, పాపులు, పుణ్యా త్ములు మీకై ఘోషిస్తున్నారు

సోక్ర విలపించకు విలపించకు

భార్య : ఇంతటి విశ్వపురుషుని ఇంట్లో పెట్టు కుని, ఇన్నాళ్లూ అవమానించాను అందుకే ఈ ఘోరశిక్ష నాకు విషమకన్న దాహకమైన ఈ శోకాగ్ని నన్ను

సోక్ర పిల్లలు చూడు ఎలా బెదురు తున్నారో వాళ్లు భయపడుతారు.

భార్య అవునిలాంటి తల్లిని మాని భయ పడరూ ! క్షమించండి ఈశ్వోధ కదేతుపలకమనం .

సోక్ర నేను జీవించినన్నాళ్లు, నీకు జ్ఞాన ప్రబోధం చేయలేకపోయాను సంఘటనలూ ఊరికే రావు నీ అంతరాత్మ మేల్కొంది. ఈసమయంలో అంతకన్న నాకు కావలసిందిలేదు ఈ ఒక్క క్షణం యుగాలకు సమానం వెళ్లు పిల్లలను తీసుకో వెళ్లు .

భార్య ఎక్కడకు ! ఎందుకు ? నాకు నేనే విషపాత్ర . నాకు నేనే విషం పదండి. నాయన ల్లారా పదండి. శ్రీలోకానికి నా ప్రార్థన... ఇంక ఈ మహాపరాధాన్ని మరెవ్వరూ మాకు చెయ్యకండి...

(పాజ్)

సోక్ర క్రిటో చెప్పావా పరిచార కునికి

క్రిటో సోక్రటీస్ సూర్యుడింకా పడమట కొండలపైనే ఉన్నాడు. చాలామంది ఆలస్యంగా విషం తాగటం నే ఎరుగుదును

సోక్ర ఎందుకు ?

క్రిటో అధికారులు ఆదేశించాక కూడా, విందులారగించి, తాగి, ప్రియులతో కాలక్షేపం చేయటం నే నెరుగుదును కాబట్టి తొందరపడవద్దు వ్యవధి ఉంది

సోక్ర అవును. క్రిటో వాళ్ళలా చేయటంలో తప్పేమీ లేదు ఆలస్యం చేసినందువలన ఏదో లాభిస్తుందని వారి ఆలోచన వాళ్లను నే ననుసరించటం యుక్తం కాదు ఒక క్షణం ఆలస్యంగా విషం తాగినందువల్ల ప్రయోజనం ఏమీ లేదు కాబట్టి నే చెప్పినట్టు చెయ్యి అదిగో జైలరు వస్తున్నాడు

జైలరు : సోక్రటీస్ ఇదిగో విషపాత్ర—విషం తాగాక, కాళ్లు బరువెక్కేంత వరకూ నడవాలి తరువాత పడుకోవాలి అప్పుడు విషం పని చేస్తుంది

సోక్ర సరి ఏది ఈ ఇటివ్వు ఆ విషపాత్ర

క్రిటో ఇతర మిత్రులు సోక్రటీస్ నీ అమృత కంఠంలో హాలాహలం

(నిట్టూర్పులు, దుఃఖారావాలు)

సోక్ర మిత్రులారా ఏమిటీ నిట్టూర్పులు దుఃఖం ఇలా! దురపిల్లుతారనేగా ఆడవాళ్ళను ముందు పంపింది. ప్రాణి ప్రశాంతంగా చనిపోవాలి ప్రశాంతంగా ఉండండి

క్రిటో అలాగే సోక్రటీస్ మనశ్శాంతిని భగ్నం చేయవద్దు అనే అదేమిటి కూలం కున్నాడు సో క్రటీస సోక్ర .

సోక్ర క్రిటో క్రిటో

క్రిటో ఏమిటి ? సోక్రటీస .

సోక్ర . క్రి...టో..

క్రిటో చెప్పు . సోక్రటీస్

సోక్ర : క్రిటో అస్క్లీపియస్ నాకు ఒక కోడి నిచ్చాడు అది అతనికి తిరిగివ్వలేదు నేను ఇంత వరకు .

క్రిటో : సరే.. ఇప్పుడెందుకు ఆ సంగతి

సోక్ర కాదు క్రిటో అలా మరచిపోకూడదు ఇచ్చేస్తావా అతనికి కోడిని

క్రిటో ఇస్తాను

సోక్ర గుర్తుంచుకుంటావా?

క్రిటో తప్పక సోక్రటీస్ ఇంకేమైనా నీ అభిమతం

(పాజ్)

* ఓ జగత్పతీ! ఎవ్వరనీ జగాన నీ ఎరుక లేక లోకము నించినారె ఏటికి యీ యత్రువులు నీదు సృష్టి యందు

కథకుడు సోక్రటీస్ నుంచి జవాబు రాలేదు. ఒక జిజ్ఞాసువు అస్తమించాడు అతను కోటి వారికి జ్ఞానమార్గము చూపగా, వా రతనికి మృత్యు ద్వారం చూపించారు కాని జ్ఞానయాత్ర మృత్యు ద్వారం వద్ద ఆగదు అది అమర యాత్ర

*    *    *    *

ఒకడు అసురుల కాలమెప్పుడో అనుకున్నాం

ఇంకొకడు గ్రామ గ్రామం భయంలో అట్టుడికి పోతోంది అంగుళిమాల చక్రవర్తి వస్తున్నాడంటె, యోజనాలదూరంలో భూకంపంలో లాగా ప్రజలు కంపిస్తున్నారు

ఒకరు ఇలాంటి కిరాతకుని బుద్ధభగవానుడు మారబోవటం ఈ శాంతి దేవుని ఆ రాక్షసుడేం చేస్తాడో

ఇంకొకరు బుద్ధభగవానుడు ఆ దురాత్ముని మారబోవును అయ్యయ్యో ఆ ప్రేమస్వరూపుని అహింసాత్మకుడేం చేస్తాడో

బుద్ధుడు అంగుళీ మాలాలంకృత చక్రవర్తి శుభం

చక్రవర్తి : ఎవరది ? నా దర్బారున ఈ కాషాయములకు తావులేదు.

బుద్ధు కాని నా హృదయమున ఎట్టి అసూయకు తావున్నా లేదు.

* తెలరాటి చంద్రశేఖరంగారి 'గతేమకు'నుంచి

చక్ర: ఈ నటన చాలవద్దు వృథా.. ఇట్టి మాయ మాటలతో నన్ను మోసపుచ్చలేవు

బుద్ధు: వంచనకు విరోధిని నేను. ప్రభూ సత్యానికే నా ప్రణామము

చక్ర: సత్యమని మిథ్యయని

బుద్ధు: మీరు సత్యానికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు మీరు సల్పుతున్న హింస మీ మానవత్వానికి కళంకము

చక్ర: ప్రతిపక్షులను నాశంచేసిన వీరాధి వీరునితో నువ్వు మాట్లాడుతున్నావని తెలుసుకో వెంటనే నువ్విచటనుంచి నిష్క్రమించటం మంచిది లేదా

బుద్ధు: భయానికి అపరిచితుడు బుద్ధుడు

చక్ర: ఏమి నీ అహంకారము ఈ ఖడ్గముతో

బుద్ధు: సంకోచ మెందుకు నా హృదయము మీ ఖడ్గము నాహ్వానించుచున్నది

చక్ర: ఏమిటి? నా కనుల కేదో కాంతి

బుద్ధు: మరల ఆలోచన ఎందుకు? ఇదిగో నా శిరస్సు

(పాజ్)

బుద్ధు: ఇదేమి ప్రభూ ఒక సామాన్య భిక్షుకుని పాదాలపై మహాచక్రవర్తి, భటు లేమను కొంటారు సామ్రాట్

చక్ర: ఇవి పాదాలు కావు. జ్యోతిబింబాలు

బుద్ధుడు: నేను భిక్షుకుణ్ణి ప్రభూ!

చక్రవర్తి: కాదు. విశ్వదాతవు నువ్వే ప్రభువు నీవు! ఏది ఆ విమలనయనాల నొకసారి చూడనిమ్ము స్వచ్ఛదర్పణములై నా వికృత స్వరూపాన్ని నాకు చూపిస్తున్నాయి. క్షమించు నా అత్యాచారం

బుద్ధుడు: అదిగో అటు చూడు కళింగ ప్రాణు లెలా ప్రణాములై నిలుస్తున్నారో

చక్రవర్తి: వారి శతకోటి కంఠాలనుంచి వెలువడే ఆక్రందనలకన్న పెక్కు రెట్లున ప్రతిధ్వనిస్తున్నది అంతరాత్మయొక్క దుఃఖారావము..

మెదలోని అంగుళీయాల అగ్నికణాలలై అణువు అణువును దహిస్తోంది ఈ హింసోన్మాదానికి మార్గం ఏదా ప్రభూ!

బుద్ధుడు: బౌద్ధజగమున కావులేని ప్రాణి లేదు. ఏ గడపవద్దనైన తిరస్కార ముండు గాక కాని కరుణాదేవిఇంటివద్ద ఆహ్వానము తప్ప తిరస్కారము లేదు అహింసా పరమో ధర్మః, ఇదే జీవిత పథం

* "ఆ లుంబిని పుణ్యారామంబున
వెలసిన యీ విమలజ్యోతికి,
నిరతము వెలుగు నీ హృదయంబున
జయమని ప్రణుతి ఓ జగమా!
జన్మవ్యాధి జరామృత్యువుల
దారగ ద్రోలెడు బాటను దెలిపిన
కరుణామయుడు శ్రీ గౌతమ దేవుని
చరణము లంటవె యో జగమా!
శ్రీ మహాత్మ శ్రీమూర్తికి జేజే!
అష్టాంగిక పథవర్తికి జేజే!
ధర్మచక్రప్రవర్తక! జేజే!
కర్మచక్రనివర్తక! జేజే!"

* * *

మొదటి వ్యక్తి: ఏమిటా కోలాహలం

రెండవ వ్యక్తి: పరుగులెత్తుతున్న జనం ఎవ్వరు

మూడవ వ్యక్తి: ఎవ రా సైనికదళం

4 వ వ్యక్తి: అదా ఇదెక్కడి చిత్రమన్న పురుటిళ్ల దూరి పసిబిడ్డల దంపుట

5 వ వ్యక్తి: శిశుహత్య ఎవ్వరి రాజశాసనా

6 వ వ్యక్తి: బిగ్గరగా అనకు

8 వ వ్యక్తి: పల్లెపల్లెన శిశువుల దంపటమే వీరి సాహసకృత్యం

4 వ వ్యక్తి: హెరోడు ప్రభువు చేసిన కఠోర ఆజ్ఞ

8 వ వ్యక్తి: తను మరణశిక్ష విధించిన జీసస్ తిరిగి జన్మిస్తాడని అతని భయం అందుకనే కళ్లు తెరవని పసిపాపలను సైతం చంపిస్తున్నాడు.

(సైనిక కోలాహలం విశ్వజ్ఞం పసిపిల్లవాని ఏడ్పు )

ఆకాశమునుండి శుభం- శుభం.. పరమ పవిత్ర సమయాన [illegible]

* వేలూరి చంద్రశేఖరంగారి 'కాంచనమాల' నుండి [illegible]

ఒకడు: ఈశ్వరపుత్రుడనని చెప్పుకొంటున్న ద్రోహి

న్యాయాధికారి: ఇతనేనా ఈశ్వరపుత్రుడు

ఒకడు: పలుచోట్ల ఇతనిదే చేస్తున్న దుర్బోధ

అందరూ: ఈ మహాపరాధానికి శిక్ష మరణమే

ఒకడు: పైలేట్! రాజద్రోహి ఇతడు

పైలేటు: ఎవరితడు? ఇతని అపరాధ మేమిటి?

అంతా: జాతిని తన బోధలతో భ్రష్టు పరుస్తున్నాడు. చక్రవర్తి సీజరుకు సుంకం చెల్లించవద్దని వారిస్తున్నాడు

ఒకడు: ఇతడు తానే ఈశ్వరపుత్రుడని చెప్పుకుంటున్నాడు యూదుల చక్రవర్తినని విర్రవీగుతున్నాడు

ఇంకొకరు: అది అన్యాయం అసత్యారోపణ తాను ఈ రాజ్యానికి ప్రభువునని ఎప్పుడూ చెప్పుకోలేదతను అతని సామ్రాజ్యము ఈ లోకాలకు చెందినది కాదు అంతరాత్మల అనంత సామ్రాజ్యమునకు అతను ప్రభువు ఇదీ నిజం ఇదీ సత్యం

పైలేటు: సత్యమంటే ఏమిటి?

(నిశ్శబ్దం)

పైలేటు: ఇతనిలో నాకు దోషమేమీ కనపడడంలేదు

అందరు ప్రజల నుద్రేకపరచి, సంచలనం తెస్తున్నాడు

పైలేటు: అన్నట్టు ఇవ్వాళ ఉత్సవపు రోజు కదూ! మరి ఈనాడు ఒక నిర్బంధితుని విడుదల చెయ్యాలికదూ ఈ యువకుడిని

అందరూ: వద్దు, వద్దు ఇతన్ని విడుదల చెయ్యవద్దు బారబ్బాస్ దొంగల నాయకుడు అతడు ఎరిగున్న దొంగ ఇతడు అభూత వ్యక్తి! బారబ్బాస్‌ను విడుదల చెయ్యండి.

పైలేటు: ఇతన్నేం చేసేది?

అందరూ: శిలువమీద మరణం అదే తగిన శిక్ష. (ఉద్రేకపు గొంతులతో)

* * *

పైలేటు: శిలువమీద మరణం. ఏం చెయ్యను లేకపోతే అటూ! ఘోరశిక్ష!



అంతా: శిలువమీద మరణం. ఈశ్వర పుత్రునికి మరణశిక్ష

ఒకడు: కృశించిన ప్రేమమూర్తి. శిలువ మోయలేక పోతున్నాడు

ఇంకొకడు: మనందరమూ చేస్తున్న ఈ మహాపాపానికి రక్తాంత ప్రాయశ్చిత్తము. నేను మోస్తాను శిలువను

* * *

ఒకడు: మరి రెండు శిలువలున్నవి

ఇంకొకడు: ఇద్దరు దొంగలకు కూడా ఇవ్వాళ మరణశిక్ష

ఒకదొంగ: ఈశ్వర పుత్రుడుకూడా మన దగ్గరకే వచ్చాడు ఓ ఈశ్వరపుత్రుడా, నువ్వే ఈశ్వర పుత్రుడివయితే, నిన్ను రక్షించుకుని, మమ్మల్ని కూడా రక్షించు

రెండవదొంగ: ఛీ, సిగ్గులేదురా నీకు, మనం చేసిన పాపకృత్యాలకు ఈ శిక్షలు మనకు సహజమే కాని ఇతను ధర్మమూర్తి ప్రేమమయుడు ఓ ప్రభూ, నువ్వు నీ సామ్రాజ్యంలో అడుగు పెట్టినప్పుడు ఈ పాపిని కూడా గుర్తుంచుకో!!

కొందరు: ఈశ్వర పుత్రుడు, విమోచకుడట, అయితే ఆ ఈశ్వరుడు వచ్చి, ఈ కొడుకుని రక్షించడేం?

ఆకాశవాణి: ఓ విశ్వేశ్వరా, వీరు విరోధులు కాని వారిని క్షమించు ఇదే అతని కోర్కె. వారు అమాయకులు. వారేం చేస్తోందీ వారికి తెలియదు

* * *

హింసా పిపాసి మనిషి
జనహింసా పిపాసి మనిషి!
పరహింసా పిపాసి మనిషి!
ప్రేమమూర్తులను
హననము చేసే
ద్వేషాంధుడరో మనిషి!
సత్యమమరము, ప్రేమ అమరము!!

కథకుడు: ఎవరు, మన విమోచకులలో వారిని హింసించడం మన సంప్రదాయం... కాని మహాత్ముల సందేశం అమరమైనది లేకుంటా

దీపాన్ని ఆర్పుకొని, మళ్లీ ప్రజలు వెలుతురుకోసం వెతు క్కుతారు

*ఎంతకాలమ్మునుండియో యాంచుచున్న
వెలుగుపాడ తెంచి తూరుపు వీధియందు
విక్రమించి జగంబెల్ల నాక్రమించె
విశ్వపద్మంబు రేకులు వేయువిచ్చె

ఒకరు ఎవరిది ?

ఇంకొకరు ఎవరది ఒంటరిగా, నిర్భయంగా కీకారణ్యంలో వెళ్లేది ? చేతిలో చిరు ఆయుధం కూడా లేకుండా ?

ఒకరు వీరికి తనవు మబ్బులేని నిర్మలసుఖం, ఏదో బ్రహ్మ తేజస్సు ! వనమృగములకన్న హింసాత్మకమైన ప్రవృత్తులావేశించిన జనసమూహముల మధ్య ఎలా నడచి పోతున్నారు

ఒకరు దూసిన కత్తుల మరల ఒరల నిడు చున్నారు—వెలిగించిన జ్వాలలను మరల చల్లా ర్పుతున్నారు

ఇంకొకరు చూడుడు చూడుడు ఇది భ్రాంతా ? నిజమా ? క్షత్రియులపై కత్తులు దూసు కున్న కతిపులు ఆ మహాత్ముని నీడలో కౌగలించు కొనుచున్నారు

ఒకరు ఆహా ! ఎన్నియుగాలకీ పృథ్విపై ఈ పవిత్ర పాద చిహ్నాలు

హంతకుడు ప్రేమయను పేరిట, జరిగిన అవమానములకు తలొగ్గును నే ఈ మహాత్మునకు దేశాని కరిష్టము ఈ వార్ధక్యంలో కూడా తన వర్ధ అద ర్శాన్ని విడవాడని ఈ వృద్ధుని రంగంలోంచి తొల గించటం నా విధి.

అందరూ మహాత్మునికి అభివందనాలు

జై జై జై

హంతకుడు ఓహ్; ఎంతమంది వందలు వేలు. లక్షలు అశ్రువాహినులన్నీ ఇదట సము ద్రమై, ఈ వృద్ధుని ముంచివేయగలవని భ్రమించాను. కాని తను అశ్రువులతో ఆ పాదములను కడుగుతు న్నారు

---

*వేలూరి శివరామ శాస్త్రిగారి 'ఏకావళి' నుంచి.

స్త్రీలు మహాత్ముని నేత్ర ద్వయమునుంచి కరుణావాహినిపొంగిపొరలుతోంది. పతితులం అవమానితులం ఆర్తులం మా జోహార్లు మహా త్మునికి

హంతకుడు వీరి ఆక్రోశమేమైనది ? వీరి భగ్న హృదయాల విషపూత్కారమేది ? ఈతను ఇంద్ర జాలికుడు వారి మతులను వారు విస్మరిస్తున్నారు

అందరూ మహాత్మునికి అంజలులు ! ఇట్లు దహనమైనవి అస్త్రాలు మాతులైరి కాని ఓ భగవంతుడా ! ఈ పుణ్యాత్ముని మాకు దక్కనివ్వు

హంతకుడు ఎవరి దైన్యం, కష్టాలు నన్నీ ఘోర, అపరిక్రమ్య కృత్యానికి పురికొల్పుతున్నాయో, వారే ఏడ్పులాడి, కన్నీరు కుడుచుకొని, అతని పాదధూళి చల్లుకుంటున్నారు ఈ లక్షల మందిలో నాకేసి ఒక్కరూ తిరగరు

అందరూ అదిగో మహాత్ములు వస్తు న్నారు ఇప్పటికే కొంచెం ఆలస్యమైంది

కొందరు వుండండి నిశ్శబ్దంగా వుండండి

హంతకుడు ఆహ్ ప్రభాత సూర్యునిలా కాదు అస్తమయ సూర్యునిలా ఏమి తేజస్సు కావచ్చు దివ్యతేజస్సు ఆహా ! నా చేతులు పట్టు సడలినవి ఏమిది ప్రణామము మహాత్మా మీ కాలస్యంగా వస్తున్నారు మీ సమయం దాటింది

(పిస్తలు పాట్ల చప్పుడు)

అందరూ ఆ! ఆ! ఏమిటీ ఘోరం

కొందరు మహాత్ముని హత్య!

ఒకరు ఎవరు ఎవరు ఈ హత్య చేసింది?

ఒకరు ఎవరా దౌర్భాగ్యుడు?

హంతకుని తల్లి · బిడ్డా! ఏం చేశావు నువ్వు?

(విచారపు, ఏడుపు గొంతుకలు)

కథకుడు హంతకుల నిరంతర భ్రమ హత్యతో భావాన్ని చంపగలమని ఈ దుశ్చింతకు లోనై తమ జీవితాలను తామే కలుషితం చేసుకుం టారు ఆ వెలుగును ఆర్పామనుకుంటారు కాని ఒక్క దిక్కున వెలుగుతున్న ఆ జ్యోతి యొక్క ప్రకాశము ఆకాశమంతటా పదిదిక్కులా వ్యాపిం

-చింది. ఇదివఱకు ఈ లోకం బింబంపైన చూడని, కళ్లు కోటానుకోట్లు ఇప్పుడీ జ్యోతి వెలుగులో చీకట్లను పోగొట్టుకుంటాయ్

సూర్యచంద్రాదులూ
వెలుగునంటాక
ఆరిపోనీజ్యోతి,
అమర, నిర్మలజ్యోతి,
అదిగదిగో అంతరాకాశ వీధిలో
ధృవతారలా వెలుగు సత్య నిర్మల జ్యోతి
జ్ఞాన అన్వేషణ సే
నిత్య, నిర్మల జ్యోతి!

* * *

విభిన్న భావుకులారా! హింస నవలంబించి, ఇంక మానవ చరిత్రను రక్తసిక్తం చెయ్యకండి వచ్చింది, వెలుగుయుగం తరలింది తమోయుగం... అదిగో బుద్ధవాణి!!

"అహింసా పరమో ధర్మః"

(ఆల్ ఇండియా రేడియో సౌజన్యంతో, జనవరి 80న లేదీన మద్రాసు రేడియో నుంచి ప్రసారితమైన నాటిక)



# ఉగాది వందనము

★

శ్రీ పెనుమర్తి కామేశ్వరరావు

ముందు లుండిన నేమి మురుపొప్పు లావణ్యశోభతో నిచ్చె గులాబికన్న
దంపతీ ప్రేమలో భావైక్యమును దెల్ప విరియబూచెను తోట విచికిలమ్ము
కోకిలానీకపు గొంతు చెఱను బాప కల్లవామృతమును బట్టె మావి
ప్రణయగీతమ్ములు పాడుచు మధుపూరసుమముల ముద్దాడి చొక్కె నళులు
త్రిభువనోద్దీపకుఁడు ప్రకృతిని వరించి కొలువు దీర్చె వసంతుఁడీ తెలుగుభూమి
సాంద్రవైభవయశులు, నిస్తంద్రయశులు-ఆంధ్రుల కుగాది కుతుకపు చంద్రమయ్యె!

నేలు సేయగఁబోయి కాళగళుని కంటివేడి మాడిన రతిప్రియుని సేవ
అమృతమ్ముకొఱకు క్షీరాబ్ధిని మథియించి కరకరులగు సురాసురుల తీరు
విప్రబలంబున వృద్ధిపొందిన బలిఁ బాతాళమున కంపు వటువు ప్రతిభ
బడుగు కుచేలుని యిడుములు వాపిన దీనబాంధవుని దాతృత్వమహిమ
తెలుఁగు దేశాన నెల్లెడ వెలుఁగుచుండఁ గలిగె నందన సంతోషకలితయగుచు
ఎల్ల ప్రజకు సౌఖ్యము నావహిల్లఁజేసి తల్లియై ప్రోచు సుతుల సంపుల్ల మతిని

జీవితమ్మున తీపియు చేదు కలిసియుండు ననుమాట జ్ఞప్తియం దుండుకొఱకు
వేపపూల పచ్చడిఁ దిని పూషవయసు బాలబాలిక లుత్సాహపూల నూఁగ!

భారత భారతీచరణపంకజముల్ భజియించు సత్కళా
ధీరులఁ బెంచునందనల తీరున నందముఁ గ్రుమ్మరించుమా!
కూరిమినందనా! సుగుణకోమలభావుకు లాంధ్రపుత్రులన్
చేరుసుగూర్చి మమ్ము గరుణించుము మంచితనమ్ము బెంచుచున్.

పోటరులైన యాంధ్రులకుఁ బాత్రు పతీర్ణము, నైన్యలాభమా
ఖేటమునై, సమిష్టికృషికిఁ బలియై, మహాంధ్ర రాష్ట్రమున్
పాటిలలేదు స్పర్ధలకు భాజనమై, తమలోనఁ దాము గ
య్యాటము లాడుకొగలుగ అందనిమ్రాని ఫలమ్ము గాదొకో!

స్వార్థరహితులు, మహితస్వవ్రతులు, హితులు రాజకీయ ధురంధరులై జనాళి
ప్రేమఁబొందఁగ నైక్యత బెంచుకొనుఁడు, రాష్ట్రము లభించు, పారతంత్ర్యమునశించు!
నందన సంవత్సరమా! వందనమును గొని మహాంధ్రవత్సలవై యా
ంగము నొసగెడి రాష్ట్రము బొందగ దీవించు మమ్ము! భూషింత్రు జనుల్.

---

# జగన్నాథపండితరాయలు

## విద్వద్వాగ్గేయకారుడు

★

శ్రీ కోవ వెంకటరాయశర్మ

మనము సామాన్యముగ బూర్వుల గుణ దోషముల దెలిసికొని సమదృష్టితో వానిం దెలిసికొనలేక పోవుటయు, మన యిప్పటి స్థితికి సంబంధించిన కార్యకారణ సంబంధ మరసి దానిం దొలగించుటకు దగు సాధనాంతరముల నన్వేషింపకుండుటయు,—గారణములుగా బ్రసిద్ధపురుషుం డగు జగన్నాథ పండితరాయల గుఱించి తెలిసికొనజాలకున్నారము

ఇమ్మహాభాగుడు విరచించిన 'ప్రాణాభరణ' మను గ్రంథమునం గల—

"తైలంగాన్వయ మంగళాలయ మ
హాలక్ష్మీ దయా లాలిత,
శ్రీమ త్పేరమభట్ట సూను రని
శం విద్వల్లలాటం తపః
సంతుష్టః కమలాధిపస్య కవి
తా మాకర్ణ్య తద్వర్ణనం,
శ్రీమ త్పండితరాజ పండిత జ
గన్నాథో వ్యధాసీ దిదమ్"

"పాషాణా దపి పీయూషం
స్యందతే యస్య లీలయా
తం వందే పేరుభట్టాఖ్యం
లక్ష్మీకాంతం మహాగురుమ్"

—అను ప్రస్తావములబట్టి పండితరాయలు లక్ష్మీదేవి—పేరుభట్టుల గర్భశుక్తి ముక్తాఫలంబని తెలియందగును వెలినాటి బ్రాహ్మణుడు 'ఉపద్రష్ట' గృహనామముగా గలవాడు గోదావరీ మండలములోని 'ముంగండ' అగ్రహారము నివాసము అనగా 'కోనసీమ' వాస్తవ్యుడు

ఇతడు జ్ఞానేంద్రు నొద్ద నుత్తర మీమాంసను, ఖండదేవు నొద్ద పూర్వమీమాంసను, మహేంద్రుని దగ్గఱ న్యాయ వైశేషికములను, వీరేశ్వరుని దగ్గఱ వ్యాకరణమును—అభ్యసించి సర్వవిద్యాపారంగతుం డయినట్టు 'రసగంగాధర' మందలి—

"శ్రీమద్ జ్ఞానేంద్రభిక్షో రధిగత
సకల బ్రహ్మవిద్యాప్రపంచః,
కాణాదీ రాక్షపాదీ రపి గహ
నగిరో యో మహేంద్రా దవేదీత్,
దేవా దేవా ధ్యగీష్ట స్మరహర
నగరే శాసనం జైమినీయం,
శేషాంకప్రాప్త శేషామలభణి
తి రభూ త్సర్వవిద్యా ధనోయః"

—అను వాక్యముంబట్టి విదితము కాగలదు ఈ విషయమున నితడు 'భామినీ విలాసము' లో—

"ఖంధః పరిమిత మంధః పిబతి
పరా కుంభసంభవోంభోధిం,
అతిరిచ్యతే సుజన్మా కశ్చి
జ్జనకం నిజేన చరితేన"

—అని వ్రాసియుండుటవలన, బట్టినంత జలమునే కుండ త్రాగునదియు, గాని కుండయం దుద్భవించిన యగస్త్యుడు సముద్రము నంతను నాపోశనము బట్టినాడనియు నటులనే లోకములో నొకానొకడు తన నిస్తుల ప్రతిభా వ్యుత్పత్తులచే దండ్రి నధిగమించునదియు,—తెలియం దగియున్నది. ఇతని "రస గంగాధరము"న వీరత్వ, పాండిత్య, కవితా కూరత్వములు మాత్రమే గాక ధర్మశాస్త్రము, సర్వదర్శనములు,—ఇవి యవి యననేల అన్ని విషయములు సెలయేళ్లవలె బయలువాఱి వచ్చి పడినవి పాండిత్యమును బ్రస్తావించునపుడు "రస గంగాధర" మందలి

"అపి వక్తి గిరాంపతిః స్వయం
యది తాసా మధిదేవతాపి వా
అయ మస్మి పురో హయానన
స్మరణోల్లంఘిత వాఙ్మయాంబుధిః"

—అను వాక్యము లక్ష్యసిద్ధిగా నగపడుచున్నది. ఇక కవితా వీరత్వమును.

"ఆమూలా ద్రత్నసానో ర్మలయ
వలయితా దాచకూలా త్పయోధే,
ర్యావంతః సంతి కావ్యప్రణయన
పటవస్తే విశంకం వదంతు,

మృద్వీకా మధ్య నిర్యన్మసృణ
రస ఝరీ మాధురీ భాగ్య భాజాం,
వాచా మాచార్యతాయాః పదమను
భవితుం కోస్తి ధన్యో మదన్యః ”

—అను వాక్యము పరమ ప్రామాణ్యముగా నుటంకింపబడినది. ఇప్పండితాఖండలుడు 'ఢిల్లీ వల్లభ పాణి పల్లవ తలే నీతం నవీనం వయః'—అని చెప్పికొనుట వలన నూనూగు మీసాల నూత్న యౌవనమందె కవిశేఖరుండును పండితాగ్రణియు నయ్యెనని యూహింప నగుపడుచున్నది

ఇతడు ప్రౌఢ నిర్భర వయః పరిపాకమున భారత రాజధాని యగు 'ఢిల్లీ' నగరమునకుం జనెను. 'ఆగ్రా' నగరము సైతము మొగల్ చక్రవర్తులకు రాజధానీ నగరముగా నుండియుండెడిది. షాజహాన్ చక్రవర్తి వైభవము పశ్చిమ దేశీయులను మిఱుమిట్లు గొల్పుచు, విభ్రమము పెందించుచు, మణిముక్తా ప్రవాళాది వినిర్మితంబు లయిన జలజంతువులతో నిండిన సువర్ణరజిత జలప్రవాహంబులును, నదీనదంబులును, భారత రత్నాకరంబున లీన మగుచుండుటను జూచి తుష్టహృదయు లగుచుండిరి. కాగా, ఇక పండితరాయల హృదయమును గూడ నవ్వైభవ దీధితు లాకర్షించి కొన్నవనుటయం దబ్బురం బేమి?

ఇ వ్విచక్షణుడు 'ఢిల్లీ'కి జేరుకొని యచట దర్బారులో సమ్మాన సత్కృతుల నందుట కయి 'అజ్మీరు' (Ajmer) వెడలి ఫారసీ భాష నేర్చికొనుట యగత్యమని తలచి బద్ధ కంకణుండయి యచిరకాలముననే యా భాషయందు ప్రవీణు డయ్యెను. షాజహాన్ చక్రవర్తియొక్క కొల్వుకూటమున పండితరాయలునకు ప్రవేశము గల్గినతోడనే చక్రవర్తి ప్రేరణమున మహమ్మదీయ మత మవలంబించిన యొక్కనితో ధర్మశాస్త్రార్థ చర్చ పండితరాయల కొనగూడినది. కాగా, ఇతడు దన వాక్చాతుర్యము చేతను, దర్క కౌశలము వలనను, షాజహాన్ చక్రవర్తితో యత్యిష్టమైన పరిచయము గల్గించుకొనజాలెను

“ఆసఫ్ విలాసము”లోని

“అథ సకలలోక విస్తార విస్తారిత మ
హోపకార పరంపరాధీన మానసేన,
ప్రతిదిన ముద్యదనవద్య గద్య పద్యాద్యనేక
విద్యా విద్యోతితాంతః కరణైః
కవిభి రుపాస్య మానేన, కృతయుగీ
కృత కలికాలేన, కుమతి తృణజాల సమాచ్ఛా
దిత వేదపథమార్గ విలోకనాయిత సము
ద్దీపిత సుతర్క దహనజ్వాలా జాలేన,
మూర్తిమతేవ నవా శాసథఖాన మనః
ప్రసాదేన, ద్విజకులపేశా హేవాక
క్రియా వాఙ్మనః కాయేన, మాధురకుల
సముద్రేందునా, రాయముకుందేనా
దిష్టేన, సార్వభౌమ శ్రీ షాజహాఁ ప్రసాదిత
పండితరాజ పదవీ విరాజితేన
తైలంగ కులావతంసేన, పండిత జగన్నాథేన,
ఆసఫ్ విలాసాఖ్యయ మాఖ్యాయికా
విరమీయత సేయ మనుగ్రహేణ సహృదయానా

మా మనుదిన ముల్లాసితా భవతాత్ ”—అను పంక్తులు రాయముకుందుని ద్వారమున ముఖ్యమంత్రియగు 'ఆసఫ్ ఖాన్' దాక పరిచయభాగ్యము బొందినట్టును, ముఖ్యమంత్రియు చక్రవర్తి దర్శనము దనకు జేయించి తత్రాపి యాస్థాన విద్వాంసునిగా జేయుటయే గాక 'పండితరాజ' అను బిరుదమును గూడ దన కిప్పించినట్టును,—దెలుపుచున్నవి. అంతియ కాక ఆసఫ్ ఖాన్‌కు హిందీ సంస్కృతిభాషలలో అధికాదర ముండి విద్వత్కవుల పెక్కురకు నాశ్రితకల్పతరువుగా భాసిల్లెననియు, వారిని హృదయమున వైదిక ధర్మజిజ్ఞాస కలిగినదనియు గాగా, దన యాశ్రితులగు విద్వాంసులచే వైదికాచార్య విషయములలో దెలుపుగా శాస్త్రార్థముల జేయించుచుండెడి వాడనియు, మాధురుడయిన రాయముకుందుని ద్వారమున 'ఆసఫ్ ఖాన్' యొక్కయు వతనివలన 'షాజహాన్' చక్రవర్తియొక్కయు ననుగ్రహ విశేషముల సంపాదించుకొనిన జగన్నాథునకు 'పండితరాజ' బిరుదము లభించినదనియు, 'ఆసఫ్ విలాస' మను గ్రంథ మతని యనుగ్రహము గల్గుటకయి వ్రాయబడినదనియు,—సూచియగు చున్నది

'జగదాభరణము—ఆసఫ్ విలాసము' అను గ్రంథముల యొక్క పర్యాయమే చదివినయెడల షాజహాన్ చక్రవర్తి కొల్వుకూటములో హిందీ సంస్కృతముల కాదరాభిమానములు, ఉత్సాహ ప్రోత్సాహములు, గల్గుటకు 'దారాశికోహుడును ఆసఫ్ ఖానుడును' ముఖ్య కారకులని తెలియగలదు. 'దారా' నూట యెనిమిది యుపనిషత్తుల పారసీక భాషయందు 'సిర్ర అక్బర్'— అను పేరితో ననువదించినాడని యౌరంగజేబు చరిత్ర రచించిన 'మహమ్మద్ షాకీ' యను నతడు 'మాసిర్ ఆలంగిరీ' యను గ్రంథమున “మొదటి నుండియు నౌరంగజేబునకు దారాశికోహు నెడ మిక్కిలి గోపము. ఏలయన, దారాశికోహుని హృదయము హిందూమతము మీదను హిందూమత గ్రంథముల పైనను బ్రేమాదరములు గలదియై యుండెను. కాగా, నతడు చక్రవర్తి వ్యాధిపీడితుడై యుండగా విగ్రమ

"నేను
లక్స్ టాయ్‌లెట్ సబ్బుతో
నా చర్మమును రక్షించుకొంటాను"
అని మంగళం
చెప్పుచున్నది




*మనోహరమైన సువాసనతో కూడిన ఈ తెల్లటి శుద్ధ సబ్బుతో మీ చర్మమును మనోహరముగానుంచుకొనండి!*

సినీమా తారలకు సౌందర్యము నిచ్చు సబ్బు

శకము 1715వ వదియగు క్రీ శ 1658వ సంవత్సరమున స్వయముగ సాహాయ్యమునకై చక్రవర్తి యొద్దకు పోదలచినాడు" (ఔరంగజేబు నామా, 82వ పుట) అని వ్రాసినాడు

ఇట్టి స్థితిలో దారాశికోహు నభివర్ణించుచు 'జగదాభరణ' మను గ్రంథమును పండితరాయలు వ్రాసినాడు గదా! తత్రాపి పండితరాయలు మహా దాశ్రయము నంది తన లోకోత్తర పాండిత్యమును ప్రకటించి విశ్రుతశాలి యయ్యెననుట సునిశ్చితము

ఆసఫ్ ఖాన్ 'నూర్జహాన్' చక్రవర్తినికి సోదరుడు కైగా, తన కొమార్తెను జహాంగీరు కొమారుడైన 'ఖుర్రమ్' అను వానికిచ్చి పెండిలి యొనర్చినాడు. కతిపయ దినంబులకు ఈ 'ఖుర్రమ్' అనువాడు 'షాజహాన్' అను పేరితో నత్యంత వైభవముగ భారతసామ్రాజ్య చక్రవర్తియై చరమదశయందు తన కొమారునిచే నిర్బంధింపబడి కృశించి కృశించి యంగలార్చి చనిపోయెను. "ఆసఫ్ ఖాన్" జహాంగీరు చక్రవర్తికి ముఖ్యమంత్రిగా వ్యవహరించుచు నతడు బ్రదికి యుండగనే 'బులాకీ ఉరఫ్ దావర్ బక్ష్' అను వానిం దిలుకంబనిచి జహాంగీరు చక్రవర్తి మరణింపగనే వానిం గద్దె నెక్కించెను. కారణ మేమన, ఆ తరుణమున షాజహాన్ దక్షిణాపథమున నుండుటవలన ఢిల్లీ నగరమునకు వైళంబ మగిడివచ్చుటకు వలనుపడమి యటుండనిచ్చి రాజా జగత్ సింహుడను మొదలగు వారు రాజపుత్రసరదారులతో నూర్జహాన్—ఆసఫ్ ఖాన్ ల నిర్బంధించుటకయి లాహోరునకుం బోవుచు 'బనారసీ' యను హిందూ వార్తాహరు రహస్యముగ 'ఖుర్రమ్' ను పిలచికొని రమ్మని దక్షిణమునకు బంపినారు. విక్రమశకము 1684 కార్తిక బ 14 లు నాడు జహాంగీరు చక్రవర్తి 'లాహోరు' లో చనిపోగా, ఆ విషయ మాపాటునల నాటి యాదివారము నాడు 'ఆసఫ్ ఖాన్' తన మేనల్లుడైన 'శహార్యారు'ను బట్టి కొని గ్రుడ్లు పీకించి మార్గశీర్ష బ 5 వ ఆదివారము నాడు 'బనారసీ' యను హిందూ వార్తాహరు 'జూనేరు' దుర్గమునకుం జని 'ఖుర్రమ్'ను గలసికొని తనకిచ్చిన యుత్తరముతో జరిగినవృత్తాంతము దెలిపి, వెనువెంటనే యుత్తరాపథమునకు బయల్దేరి నర్మదానదిని దాటునప్పటికి మార్గశీర్ష 5 నాడు 'మేవాడు' నుండి 'శహార్యారు' ఓడిపోయినట్టివన్న వృత్తాంతము 'ఖుర్రమ్' కు దెలిసినది. మాఘ బ 8 గురువారము నాటికి 'అజ్మీరు' చేరినారు యాదివారము నాడు 'ఖిదమత్ పరస్తఖాన్' ద్వారమున 'ఖుర్రమ్' అను నతడు 'శహార్యారు' ను, 'బులాకీ' ని, వాని సోదరుని, 'దానియాల్' అనువాని కొమాళ్ళ మువ్వురను—బరిమార్పవలసినదని 'ఆసఫ్ ఖాన్' కు లేఖ వ్రాయగా, దానిం గన్నుల కద్దికొని రాజాజ్ఞ రామాజ్ఞ యని యెంచి మంగళవారము నాటికి అతని కోర్కె నెరవేర్చినాడు. బ 12 గురువారము నాటికి 'ఖుర్రమ్' ఆగ్రానగరమునకుబోయి మఱి పదిదినముల కావలవచ్చు సోమవారమునాడు భారతవర్ష మహాసామ్రాజ్య సింహాసనాసీనుడై "అబుల్ ముజఫర్ శహాబుద్దీన్ ముహమ్మద్ సాహెబ్ కిరానిసాని షాజహాన్ గాజీ"—అను బిరుదమును బ్రకటించుకొనినాడు

దీనివలన చక్రవర్తి యాసఫ్ ఖానునకు నతనితోడివారికి నెంత కృతజ్ఞుడుగ నుండెడివాడో పోల్చికొందురుగాక!

విక్రమశకము 1685 ఆశ్వయుజ శు 6 నాడు కాశీనగరము నుండియు, 'తిరహుత్' నుండియు, నరుగుదెంచిన యుద్దణ్డ బ్రాహ్మణులకు దర్బారున ప్రభుసందర్శన లాభ మొదవించి, వారిని పరిచయము చేయుచు, చక్రవర్తితో "ఇవ్విప్రులు భిన్న భిన్న కవిత్వమతులు పదుగురు చెప్పిన పది శ్లోకముల నొక్కసారి విని వెంటనే చదువుదురు. వీరా శ్లోకముల చెప్పుడును గని విని యెఱుంగనివి కాదు! ఇంతియ కాదు ఆ పదిశ్లోకములలోని యభిప్రాయమును గైకొని మఱి పదిశ్లోకముల రచించి వినిపింతురు. కావుననే వీరి నేకసంథాగ్రాహు లనియెద" రని "యాసఫ్ ఖాన్" మనవి చేయగా, విద్యావినోదియైన చక్రవర్తి యాతురము నంది వారి విద్యాకౌశలమును బరీక్షించి, యాశ్చర్యమునంది, యొక్కొక్కరికి సాలుతోడీలను వేయి రూపికలను, బహూకరించి, వారిని దృప్తుల గావించి, పంపినాడు

ఇవ్విధముగ దర్బారులో నప్పుడప్పుడట్టి విద్యావినోదములు జరగుటయు, తత్రాపి విద్వత్సత్కారములు చేయుటయు—జరుగుచుండెడిది. కనుకనే పండితరాయ లవ్విషయమును సూచించుచు "ప్రతిదిన ముద్యద్దుద్యద్గద్యపద్యాద్యనేకవిద్యా వినోదైః కాంతిఃకరతైః కవిభిరుపాస్యమాన సేవ"—అని వ్రాసినాడు.

తన యెడ 'యాసఫ్ ఖా' నగపఱచిన దృక్పథమునకు జాపిన యాదరాభిమానములకు, చేసిన సాహాయ్యమునకు—కృతజ్ఞతను దెలుపుట కయ్యడి కాబోలు పండితరాయలు కవిసంప్రదాయమున శ

రిక్త మయ్యెను అతని నభివర్ణించుచు 'ఆసఫ్‌విలాస' మను గ్రంథమును విరచించుటయం దద్భుతం బేమి? 'రసగంగాధరము' లోని—

"సుధేవ వాణీ వసుధేవ మూర్తి
 స్సుధాకర శ్రీ స్సదృశీ చ కీర్తిః,
పయోధి కల్పా మతి రాసఫేంద్రో
 ర్మహీతలే ఒన్యస్య న హీతి మన్యే"
"యుక్తం సుమాతే గిర మాసఫేంద్రా
 తదాశ్రితానాం యద భూ ద్విపాకః,
ఇదంతు చిత్రం భువనావకాశే
 నిరాశ్రయా ఖేలతి తస్య కీర్తిః"

అను శ్లోకములందు 'ఆసఫ్ఖాన్' వర్ణనము గలదు షాజహాన్ కాశ్మీరమునుండి 'బంధరు'నకు వచ్చినాడు కాశ్మీరపర్వతశ్రేణి యందు దీనిపట్టన మున్నది ఈ ప్రాంతమున హిందూమహమ్మదీయు లొండొరులు సంబంధ బాంధవ్యముల జరపుకొను చుండెడివారు హిందువులు దాము పెండ్లి చేసికొన్న మహమ్మదీయ కన్యలు సనిపోయినపుడు దహించు చుండిరి ముసల్మానులు దాము పెండ్లి చేసికొన్న హిందూ వనితలు సనిపోయినచో వారిని ఖనన మొనర్చు చుండిరి ఇవ్విషయము వినుకలిరైు షాజహాన్ చక్రవర్తి యంగీకరించక హిందువులు మహమ్మదీయ మతావలంబులు కానంతవఱకు వారి యిండ్లలో మహమ్మదీయ స్త్రీలుండరాదని యాజ్ఞాపింపగా, వారటి జమీన్దారు 'జోగా' అనువతడు సకుటుంబముగ ముసల్మానయినాడు చక్రవర్తి యిప్పనికి సంతోషించి యతనికి 'రాజా దౌలతమంగు' అని పేర్వెట్టినాడు

అటనుండి చక్రవర్తి పాంచాలము (*Panjab*) నకు వచ్చునప్పటికి ముసల్మానులు హిందువుల పయి నేరారోపణ మొనర్చిరి ఆ విషయమును విచారింపవలసిన దని గుజరాత్ దేశస్థుడయిన 'షేకు మహమూద్' అనువానితో జెప్పగా, వతడు తగిన కారణములు దొఱకగనే జెప్పెదనంది మహమ్మదీయ స్త్రీలను హిందువులనుండి వేర్పఱచి, మసీదు భూముల నిర్ధారణచేసి, మరల వానిం గట్టించుట కయి హిందువుల దగ్గఱ జుర్మానా వసూలుచేసి చక్రవర్తితో జెప్పినాడు 'బంధరు' లో వశివిధ్భటను హిందువులు దామువేసికొన్న మహమ్మదీయ స్త్రీల కయి స్వమతమును విడనాడిరి అటుల చేయనిచో నట్టివారినుండి మహమ్మదీయ వనితలు లాగికొనబడిరి చక్రవర్తి పాలిత దేశ మందంతను ఈ యుత్తరువే చాటింపబడి పాలింపబడినది యవనస్త్రీలు పెక్కురు హిందువుల నుండి బలాత్కరింపబడి వారికి 'నిక్కా' చేసి మహమ్మదీయులకు పెండ్లిగా నీయబడిరి"—అని "ముల్లా అబ్దుల్ హమీద్" అను నతడు విక్రమశకము 1691-నాటి వృత్తాంతమును వ్రాయుచు నుల్లేఖించి యున్నాడు దీనింబట్టి మహమ్మదీయ స్త్రీలను హిందువులు వివాహమాడుట దేశమందంతను జరుగు చుండెనని గ్రహింపనగును

చక్రవర్తి దాసీజనములో నొకర్తుక పేరు లవంగి ఆమె చక్కనిచుక్క దానిం బండితరాయలును, బండిత రాయలు దానిం,—జూచినతోడనే యొండొరులు ప్రేమపాశ నిబద్ధులైరి 'కాని చక్రవర్తి యనుజ్ఞలేనిదే యొకరి నొకరు గూడుట, సంభాషించుకొనుట,— సమయమొందుండెను ఒకనాడు పండితరాయలును జక్రవర్తియు మహలులో చదరంగ మాడుచుండగా, రాయలు దప్పిగొని జలాభిలాష నగపఱుపగా, జక్రవర్తి సైగచేయ, లవంగియే బంగరు కలశముతో నీ రర్పటుకొని గాగా నిగానియను చక్రవర్తి మనంబు వారుణీ ప్రభావ కతంబున వప్పగు మత్తిల్లి యనేక విధంబుల రాజసభావంబుల దుహోద్భలక మహోద్భవ లవంగి యా భావముల మరింత ఉపోద్బలకముగ, సుదీప్తములుగ, జేసినది చివరి ఆ సమయమునకే చక్రవర్తి లవంగి పండితరాయల హావభావ విలాస వికారములం దెలిసికొని ప్రసన్నహృదయుండయి లవంగి నున్నయటుల వర్ణింపుమని పండితరాయలతో ననగా, నతడు తోడనే

"ఇయం సుస్తనీ మస్తకన్యస్త కుంభా,
కుసుంభారుణం చారుచేలం వసానా
సమస్తస్య లోకస్య చేతః ప్రవృత్తిం,
గృహీత్వా ఘటే న్యస్య యాతీవభాతి"

—అని చదివినాడు కాగా, లవంగి లజ్జచే దల వంచుకొని కనుల మూసికొనినది చక్రవర్తి సంతోషించి పండితరాయలను నీ కోర్కి యేమి? యని యడుగగా, రాయలు చక్రవర్తి మనస్తత్త్వమును వారుణీ ప్రభావమును గనిపట్టి

"న యాచే గజాలిం న వా వాజిరాజిం
న విత్తేషు చిత్తం మదీయం కదాచిత్
ఇయం సుస్తనీ మస్తకన్యస్త హస్తా
లవంగీ కురంగీ దృగంగీ కరోతు"

"యవనీ నవనీత కోమలాంగీ
శయనీయే యది నీయతే కయా వా
అవనీతల మేవ సాధు మన్యే
నవనీ మాఘవనీ సుఖస్య హేతుః"

"యవనీ రమణీ విపద శ్శమనీ
కమనీయ తమా నవనీత సమా
ఉహి ఊహి వచో ఒమృత పూర్ణముఖీ
స సుఖీ జగతీహ యదంక గతా."

—అను మూడుశ్లోకముల జదువగా, రసజ్ఞుడు, సహజ విలాసి, యగు చక్రవర్తి యౌదార్యమును మదిరాదేవి యా సమయమున మఱింత వికసింపజేసినది. లవంగి పండితరాయలు శృంగార రసమునయందోలలాడుటను గనిపట్టియు, వారి హావభావ విలాస విభ్రమముల విలోకించియు, హృదయ కుహరము నుండి వెలి కుద్గమించుచున్న కల్పన నణచిలో బాలక చక్రవర్తి వంటనే నవనీత కోమలాంగియగు లవంగిని పండితరాయల కొసంగినాడు. కావుననే కాబోలు 'రస గాంగాధరము'న

"మహోత్కృష్టస్య పరోఽవధి ర్నిజగృహం
గంభీరతాయాః పితా,
రత్నానా మహమేక ఏవ భువనే
కోవాఽపరో మాదృశః
ఇత్యేవం పరిచింత్య మాస్మ సహసా
గర్వాంధకారం గమో,
దుగ్ధాబ్ధే! భవతా సమో విజయతే
దిల్లీ గరా వల్లభః"

—అని పండితరాయలు షాజహాన్ చక్రవర్తి గౌరవప్రపత్తిని జాటినాడు. అంతటో నూరకొనక

"భూమీనాథ! శహాబుదీన! భవత
స్త్రైలోక్య గుణానాం గణై
శ్శేతస్స్వాత భవత్ప్రపంచ విషయే
వాస్తీతి కిం బ్రూమహే
ధాతా నూతన కారణై ర్యది పున
స్సృష్టిం నవాం భావయే
న్నన్వ్యా దేవ తథాపి తావక తులా
దేశం దధానో నరః"

"సృష్టిం సృష్టికృతా పురా కిల పరి
త్రాతుం జగన్మండలం
త్వం చండాతప! నిర్దయం దహసి య
జ్జ్వాలా జటాలైః కరైః
సంరంభారుణ లోచనో రణభువి
ప్రత్యాహ కామోఽనునా
జానీహో భవతా సహాస్త విది
తో దిల్లీ ధరా వల్లభః"

"సురాణా మారామా దివా రుధిరి
రుంరుఝానిల హతిః
వశేయం ప్రాఖేంద్రా యది తదభి
లో వందతి జనః
కిమీ భిర్వా కార్యం శివశివ! వి
శేషేణ వికలై
శ్శిరంజీవ న్నాస్తా మపి ధరణీ
దిల్లీ వరపతిః"

—అనియు గీర్తించినాడు. ఇప్పండిత శిరోమణి మనోరమా వ్యాఖ్యానము పయి 'మనోరమా కుచమర్దనమ్' అను ఖండన గ్రంథమును రచించి దాని యందను వంతను జెఱచినాడు. ఇప్పనివలనం గూడ నాకాలపు విద్వాంసు లనేకు లత్యసూయపడి పండితరాయలను స్వధర్మభ్రంశకునిగా దలచి సంఘమునుండి బహిష్కరించినట్లు చాటించిరి. కాగా, పండితరాయలు దర్పముచేతను, నమ్రతచేతను, నచ్చజెప్ప యత్నించినాడు గాని వృథ యయ్యెను. అంతమాత్రన నదాసీను డయినం బ్రయోజనము లేదని తలచి కాశీ నగరమున మణికర్ణికా ఘట్టమున నేబది రెండవ సోపానము పయిం గూరుచుండి "నే నొకవేళ యవనకన్నియ లవంగిని పెండ్లి యాడుటవలన పతితుడ నయితినేని భగవతి యగు గంగాభవాని నన్నుద్ధరింపకుండు గాక! లేదని నే జేసిన పని ధర్మబద్ధమై నేను పవిత్రుడ నే యౌదునేని వీరందఱు జూచుచుండగనే గంగాభవాని యిటకు వచ్చి నన్నుద్ధరించు"నని ప్రతిజ్ఞవట్టి సుశ్రావ్యముగ 'గంగాలహరీ' స్తోత్రమును బఠింప నారంభించి యొక్కొక్క శ్లోకము చదువునప్పటికి గంగాభవాని యొక్కొక్క మెట్టెక్క యేబదిరెండవ శ్లోకము చదువునప్పటికి పూర్తియాటతో ఓసే భాగీరథీ జల ముప్పొంగి పండితరాయ దంపతుల స్పృశించి నిర్దోషు లని లోకమునకు చాటి వంటనే దిగిపోయినది. బహిష్కృతు లయ్యును భాగీరథీ జల సంసర్గముచే బునీతు లయి పండితరాయలు తేజరిల్లెను.

మందాకినీ ప్రవాహము వోలె మందాక్రాంత వృత్తములలో మహాకవి కాళిదాసు రచించినట్లుగనే పండితరాయలు 'గంగాలహరిని' శిఖరిణీ వృత్తములలో భాగీరథి శయ్యగా వ్రాసె. వినూత్న పంథను ద్రొక్కి యధికతర ప్రసిద్ధికి పూర్వపర్యకు డద్యావ చిదానందానుభూతి పొంది ంచుట కావ్యముయొక్క పరమావధి. ఇయ్యనుభూతి గలిగించిన యతిడు దాని ననుభవించియుండవలయును. కావుననే కావ్యమున గవిని జూడగల్గుదు మన్నారను. 'గంగాలహరి' యితివృత్తము గంగాస్తవమే!

"తవాలంబా దంబ
స్ఫుర దలఘు గర్వేణ హాసా
మయా సర్వేఽవజ్ఞా
సరణి మథనీతా స్సురగణాః,
ఇదా నీ మౌదాస్యం
భజసి యది భాగీరథి, తదా
నిరాధారోహా! రో
దిమి కథయ కేషా మిహ పురః?"

—అను శ్లోకమున దల్లిబిడ్డల స్వచ్ఛందమైన బాంధవ్యమును రసపరిణతి నందించినాడు

"అపి ప్రాజ్యం రాజ్యం
   తృణ మివ పరిత్యజ్య సహసా
విలోలద్వానీరం
   తవ జనని, తీరం శ్రితవతాం
సుధాతః స్వాదీయః
   సలిల భర మాతృప్తి పిబతాం
జనానా మానందః
   పరిహసతి నిర్వాణ పదవీమ్ "

—అను శ్లోకమున 'చతురంభోధి పరీతమైన ధరణీచక్రంబు శాసించు వారల్లయును దమ సామ్రాజ్యమును గడ్డిపోచగా నెంచి నీ యొడ్డు చేరికొని వారు అమృతముకంటె మధురాతి మధురమైన నీ నీరముల ద్రావిన వారి యానందము నిర్వాణసిద్ధి నపహరించుచున్న' దని తన గంభీర రసానుభవమును బ్రతిబింబించు శబ్దమయమైన యాకృతి గల్గించినపుడు వర్ణనాలంకారములు పర్యవసన్నము లయినవి

"స్మృతం సద్యః స్వాంతం
   విరచయతి శాంతిం సకృదపి
ప్రగీతం య త్పాపం
   ఝుటితి భవతాపం చ హరతి,
ఇదం త ద్గంగేతి
   శ్రవణ రమణీయం ఖలు పదం
మమ ప్రాణ ప్రాంతే
   వదన కమలాంత ర్విలసతు "

—అను శ్లోకమున భాగీరథీదేవిని కంఠమునెత్తి పాడికొనిన పాప పంకిలము, సంసార తాపాలు, తొలగిపోగలవనియు, ఈ నీ శ్రవణరమణీయమైన నామము ప్రాణోత్క్రమణ సమయమున రసనాగ్రమున దాండవించుగాక! యనియు, దన తీవ్ర వాంఛ నుద్దీపిత మొనర్చి యున్నాడు

"నయ త్యుచ్చై ర్యైన
   రపి గలితభైర్య రభవితం
నయన్నిమ్నం జీవానాం
   ప్రసరతి మనో వా గవసరః
నిరాకారం నిత్యం
   నిజ మహిమ నిర్వాసిత తమో
విశుద్ధం య త్తత్త్వం
   సురతటిని త త్త్వం న విషయః "

—అను నీ శ్లోకమున వస్తువును దన భావమునకు నాలంబన మొనర్చి విశ్వమయము గావించి విశ్వము నారాధించినాడు.

"ఖలః కో వా కో వా
   ద్రవిణ మదిరా ఘూర్ణిత దృశాం
మహీపాలానాం నానా
   తరుణతర ఖేదస్య నియతమ్
మయై వాయం మంతుః
   స్వహిత శతహాంతు ర్జడధియో
వియోగ స్తే మాత
   ర్య దిహ కరుణాతః క్షణ మపి "

—ఈ శ్లోకమున దల్లి కడంగట బిడ్డ యెంత యమాయకముగా బ్రాశేయపడినదియు చేటలెల్ల నెుసర్చినాడు అంతియకాక రాజుల రాజరికము నెంతగా సేవగించి కొనియెనో, పశ్చాత్తాప మెంత వడిసెనో, విదితము కాగలదు

"అనాథ స్స్నేహార్ద్రాం
   విగలిత గతి పుణ్యగతిదాం,
పత న్విశ్వో ద్ధర్త్రీం
   గద విదలిత స్సిద్ధ భిషజం,
సుధాసింధుం తృష్ణా
   కులిత హృదయో మాతర మయం
శిశుః సంప్రాప్త స్త్వా
   మహ మిహ విదధ్యాః సముచితం "

—అను శ్లోకమున సనాథుడు స్నేహార్ద్రురాలిని, గతిలేనివాడు పుణ్యగతిని జూపు తల్లిని, వ్యాధితుడు సిద్ధవైద్యుని దాహాతురు డమృత ప్రవాహమును, జేరుకొన్న యట్లు బిడ్డనైన నన్ను జేరదీసి యాదరించ వలసినదని భాగీరథీ తల్లి నర్థించినాడు

"శ్వ వృత్తి వ్యాసంగో
   నియతి మథ మిథ్యా ప్రలపనం
కుతర్కే ష్వభ్యాసః
   సతత పరపైశున్య మననం
అపి శ్రావం శ్రావం
   మమతు పున రేవం గుణగణా
ఋతే త్వత్ కో నామ
   క్షణమపి నిరీక్షేత వదనం "

అను నీ శ్లోకమున 'కుక్కవోలె బ్రతిరాజు నొద్దకు దిరుగుచు' వారు పాఱవైచిన కబళమును దినుచు, వ్యర్థముగ దినముల గడిపికొనుచు, బ్రలపించుచు నసత్యపు దర్కాసుల సాగించుచు, నన్యుల కపటపు బలుకులతో నిరంతరము సంభావించుచు,—వ్యర్థుడ నయితిని నీవు తప్ప నాకు దిక్కెవ్వరు తల్లీ!' యని తన యాతనమున రాజపథిలలో శాండిత్య ప్రదర్శన మొనర్చి చాటుమాటున ధనదుదాంధుల చేతులలో నెన్ని యవమానముల బొందినాడో, వారందఱ ననవరతముగ స్తుతించి యిపుడు కించ

వహించుచున్నాడో, తన యాత్మగౌరవము నిలిపికొనుటకయి యెంతగా బరిదేవించినాడో,—యెఱుగ నగుచున్నది

"కిం యంతః సంత్యేకే
    నియత మిహలోకార్థ ఘటకాః,
పరే పూతాత్మానః
    కతిచ పరలోక ప్రణయినః,
సుఖం శేతే మాత
    స్తవ ఖలు కృపాంతః ప్రచరయం,
జగన్నాథః శశ్వ
    త్త్వయి నిహిత లోకద్వయ భరః"

అను శ్లోకమున గొందఱిలోకమునందె యేవియో ఘనకార్యముల నిర్వహించుటకయి పాటుపడుచుందురనియు, మఱికొందఱు పవిత్రాత్ములు పరలోకము పయి దృష్టి బఱపుచుందురనియు,—నీ దయావీక్షణమున సుఖియలోకముల భారము నీయంద నిలిపి యీ జగన్నాథుడు నిశ్చింతగా సుఖముగా నిదురించుచున్నాడనియు,—'అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ' యన్నట్లు భాగీరథీదేవి యందె యితడు లీనమయినవాడు అంతితో దృష్టిపథసేత న్నుద్ధరింప వలసిన సమయ మాసన్నమైనది భగవతీ! యని—

"జగన్నాథ స్యాయం
సురధుని! సముద్ధార సమయః"

అను శ్లోకమున వివరించియున్నాడు అంత వైభవమును, ప్రసిద్ధిని,—గాంచిన పండితరాయలింత దీనాతిదీనముగా విలపించినాడే యని యచ్చెరువు గొల్పుచున్నది దీనింబట్టి తెలుగువాండ్రలో కరుణారసము వెల్లి విరియుచున్నదని తెలియంగలదు కరుణారసమునకు ప్రసిద్ధియైనదగు భవభూతి యాంధ్రుడే గదా!

ఇప్పండిత శిరోమణి విరచించిన 'జగదాభరణము' లో 'దారాశికోహు' మహోత్సవుని వర్ణనము గలదు "ప్రాణాభరణము" న కామరూప దేశాధిపతి యగు ప్రాణనారాయణుని వర్ణనము గలదు ఈ గ్రంథమున నేఁబదియాఱు శ్లోకములు మాత్రమే కలవు చక్కని అలంకారములతో నమ్మహారాజ వీరత్వము దాతృత్వము లోనగు గుణగణము అభివర్ణింపబడినవి ఈ గ్రంథము ముద్రితమే! 'రసగంగాధరము' లో నున్న—

"దిక్షేత్ర ఇవ వాసవః కరయుగో విష్ణుర్వివ
ద్వితీయ ఇవ చంద్రమాశ్శ్రితవపు ర్మనోభూ రివ
వరాకృతి రివాంబుధి ర్గురు రివ ప్రభూ మాగతో
మతో నిఖిల భూమి సైర్గణితి కోఽపి భూమీపతిః"

—అను శ్లోకము నాలవపాదము కొనమున్న అంతరములకు బదులుగా 'కామరూపేశ్వరః'— అని మార్చి 'ప్రాణాభరణము' నందు చేర్పబడియెను. ఈ ప్రభువునకును, పండితరాయలకును, సంబంధ మెట్టుల కుదిరెనో తెలియకున్నది

ఇక 'భామినీ విలాసము' నాల్గువందల యెబ్బది యేడు సూక్తుల గ్రంథము నవరసభరితము. తన ప్రియభామిని యగు లవంగిస్మృతి విషయమున ఈ నిరుపమాన సంగ్రహ మీతడొనర్చెనని చెప్పబడుచున్నది ఇయ్యది మహాకవి చమత్కార కవితకును, భాషా సౌలభ్య సౌకుమార్య సందీప్తికిని—ఇది యొక యుత్కృష్ట ప్రదర్శన గ్రంథమని చెప్పదగును ఈ గ్రంథము చివర—

"దుర్వృత్తా జారజన్మానో
హరిష్యన్తీతి శంకయా,
మదీయ పద్యరత్నానాం
మంజూషైషా మయాకృతా"

—అని వ్రాసికొని యున్నాడు

"శాస్త్రాణ్యాకలితాని నిత్యవిధయః
    సర్వేఽపి సంభావితా
దిల్లీవల్లభ పాణిపల్లవ తలే
    నీతం నవీనం వయః
సంప్రత్యుజ్ఝిత మాసనం మధుపురీ
    మధ్యే హరిస్సేవ్యతే
సర్వం పణ్డితరాజ రాజతిలకే
    నాకారి లోకోత్తరమ్"

—అని యితడు వ్రాసికొనుటవలన పండితరాయల ధర్మపరాయణత, ప్రకృష్ట శాస్త్రాధ్యయనము, ఢిల్లీశ్వరు నాశ్రయలాభములు, మాత్రమే కాక ఆయన చిరకాల జీవి యనియు—ముదుసలితనమున మధురా నగరములో గడపె ననియు—తెలియవచ్చుచున్నది ఇతని 'చిత్రమీమాంసా ఖండనము' 'రసగంగాధరము' నను గ్రంథములు సాహిత్యోపాసకులకు విపుల ప్రియరత్నములు 'చిత్రమీమాంస' లో 'రసగంగాధరము' పైని గావింపబడిన యాక్షేపములకు పండితరాయలు లెస్సగా ప్రత్యుత్తరించినాడు.

"నిర్మాయ నూతన ముదాహరణానురూపం,
కావ్యం మయాత్ర నిహితం న పరస్య కించిత్,
కిం సేవ్యతే సుమనసాం మనసాపి గంధః,
కస్తూరికా జననశక్తి భృతా మృగేణ!!"

అని యితడు చేసిన ప్రతిజ్ఞ యెంత భావగర్భితమైనదియో వినుడు.

లోకమున కాంతించిన తర్వాత పండితరాయలు మధురా నగరమున మిత్రుడు నోయిచే యన్న విచారము ముప్పిరిగొని విరాగియై నివసించె నని 'భామినీ విలాస' మందలి

"అపహాయ సకల బాంధవ చింతా
ముద్వాస్య గురుకుల ప్రణయమ్
హా! తనయ! వినయశాలిని! కథ
మిహ పరలోక పథికో౽భూః?"

—అను శ్లోకము అవగత మొనర్చుచున్నది. ఔరంగజేబు అన్యాయ్యముగా 'దారాశికోహు'ను జంపించిన తర్వాతనే విచారావృతుండయి పండితరాయలు 'ప్రాణాభరణము'ను భావకావ్యముగా విరచించినట్టు లగపడుచున్నది. మచ్చున కొకటి

"త్వాం సుందరీ నివహ నిష్ఠుర ధైర్య గర్వ
నిర్వాపణైక రసికం సమరే నిరీక్ష్య,
కా వా రిపు క్షితిభృతాం బత రాజలక్ష్మ్యః
స్వామి ప్రతత్వ మపరిస్ఖలితం బభార?"

—అనగా సుందరీ ధైర్యమును జాఱవోలు రసికత్వ ముండిన నిన్ను యుద్ధమున జూచి యేవరి రాజలక్ష్మి పాతివ్రత్యమును నిలిపికొనిన దని యర్థము 'దారా' సాహిత్యవేత్త, తత్త్వవేత్త, శాంతిప్రియుడు. 'సుఫీ' మతాభిమాని ఛాందోగ్య మీతని భోగ్యము ఇట్టి ప్రసిద్ధ పురుషునిపై పండితరాయలకును, పండితరాయలపై 'దారాశికోహు'నకును,— అభిమాన ముండుటలో నబ్బురం బేల?

ఔరంగజేబు వలన 'షాజహాన్' చక్రవర్తి పదచ్యుతు డయినందునను, దారాశికోహుడు పరలోకగతు డయినందునను,—ఆ కాలమున ఢిల్లీ ధరావల్లభుని పేరోలగంబున సంస్కృతభాషకును, హిందీ భాషకును సత్పండితులకును,—క్షీణదశ పట్టినదని చెప్పక తప్పదు

విక్రమ శకము 1691 కార్తిక బ 9 నాడు 'షాజహాన్' చక్రవర్తి సవారీ కాశ్మీరమునుండి మరలివచ్చునప్పుడు 'బంధరము'న నిలచినది ఆ కాలమున పండితరాయలతో పాటు సంస్కృత కవిత్వము—హిందీ కవిత్వము,—చెప్పగల మగన్నయు, సంగీతము పాడగల ప్రజ్ఞాశాలియు, కృతుల వ్రాయగల నేర్పరియు— భారతవర్షమున మఱియొకడు లేడు అక్కాలిన చక్రవర్తి యీతని సత్కృతులచే దన్పియుండుటచే 'లాహోరు'నుండి 'బంధరము'నకు వచ్చి చక్రవర్తిని జూడగలిగెను

చక్రవర్తి కాశ్మీరము పోవునపుడు రాయలను కొన్ని క్రొత్త "ధ్రుపదములు" వ్రాయవలసిన దని యాజ్ఞాపించి సేవ ముగిసి వచ్చునందాక "లాహోరు" నందె యుండవలసిన దని చెప్పె నందువ వారి యాజ్ఞ నాదరించికొని పం(డెండు 'ధ్రుపదములు' క్రొంగ్రొత్త రాగములలో ఢిల్లీ ధరావల్లభు పేరను బూర్తి యొనర్చి వచ్చి చక్రవర్తి కీగా, నతడు ఆ 'ధ్రుపదముల' నన్నిటిని బహు జాగ్రత్తగా పరిశీలించి, పసందు సేసి, యుబ్బి తబ్బిబ్బయి, కౌగిటం గ్రుచ్చుకొని, ముహూర్తకాల మెడ లేకుం గకయ యుండి,—యూతల దెలివి దెచ్చికొని, దర్బారుసేసి, నిండు పేరోలగంబున పండితరాయలచే వాక్కృతుల బాడించి, పండి నాయకులతో వారిని దూచి, యా ద్రవ్యము నాల్గువేల రైదు వందలును పారితోషికముగ నతనికే యొసంగి, గౌరవించి నాడు

అంతియకాక ఈ య్యాషేకము జరిగిన కొన్ని నాళులకు ననగా విక్రమశకము 1693 శ్రావణ బ త నాడు ఆ మ్మహా విద్వద్వాగ్గేయ కారుడు క్రొత్తగా రచించిన యొక గ్రంథమునకు గాన్కగా చక్రవర్తి యొక యేనుగు నొసంగి, దాని నెక్కుటకు నీవ యర్హుండవని ప్రశంసించి గతోత్సవ మొనర్చి, మిగుల సత్కరించినాడని "ముల్లా అబ్దుల్ హామీ" యను నత డుల్లేఖించి యున్నాడు ఇట్టి సత్కృతులు విద్వల్లోకమునకు, ద్రావిడ సంగీత ప్రపంచమునకు,—జరగినట్టులే యని తలంపవగును కావునచే యీ విద్వద్వాగ్గేయకారుని యశస్సు మిన్నంటె

"జేతే దేశే విపణీషు తథా
చత్వరే పానగోష్ఠ్యా
మున్మత్తేన భ్రమతి భవతో
వల్లభా కాంత కీర్తిః"

—అనినట్టు యూలయూలల వ్యాపించినది ఇతని పేర గాశీక్షేత్రమున నొక ఘట్ట మేర్పడినదనియు, నేటికిని యాచోట నొకవాడు ఆ బాలగోపాలము ఆ ఘట్టమున యూగి యీతని 'గంగాలహరి'ని బఠించుచు, నితని స్మృతి పథమునకు దెచ్చికొని యానందించి వెడలుదు రనియు, జనశ్రుతి కలదు

ఈ పండితశ్రేష్ఠునకు విద్వద్వాగ్గేయ కారునకు నతులొనర్చి సెలవు గైకొనుచున్నాడను.

# ఎన్నిక ఉబలాటం



శ్రీ జి యస్ సూరి

ప్రొద్దుకూకేసరికి మా బృందం వాళ్లు అందరూ క్లబ్బు డాబామీదికి చేరుకున్నారు తలా ఒక కేను కుర్చీలో చేరగిలబడ్డారు

"వెనక నల్లులు కొస్తడి ఛి ఛీ అయినా వీటి ముఖాన కొట్టకూడదూ ?" అన్నాడు కుర్చీని చేతి కొద్ది దరుస్తూ మీసాలనాయుడు

"మరేమీ ఫరవాలేదులే, కావలసినంత కళే బరం పెంచావు," అన్నాడు చెట్టియారు

"అతికాయులూ మహాకాయులూ ఒకరి కొకరు తీసిపోరులే ఇంతకూ పార్టీ ఎప్పుడురా ఇవ్వటం ?" అన్నాడు కాస్తుల్లభాయి

"ఈ టిపినీది గంగా నమ్మకు మాటిమీదే లోకం ఎవరు పిలుస్తాడా, ఎవరికొంప తీతామా అని తప్ప మరో ఆలోచనలేదు గదా మనవాడికి !" అన్నాడు తొండమాన్

"ఎవరు ఎవరికిరా పార్టీ ఇస్తున్నదీ ?" అని అడిగాడు డాక్టరు టింగన్

"ఓహో, నీ వీ మధ్య ఊళ్ళో లేవు గాదూ ! మన కొత్త ఎం ఎల్ ఏ గారికి చెట్టియారు విందు చేస్తాడట," అన్నాడు మీసాలనాయుడు

"చెప్పవేంరా చెట్టియార్ ? చేగోడీలు తప్పక చేయించుసుమా !" అన్నాడు డాక్టరు టింగన్

"ఒక చేగోడీలు ఏమిటిరా ! ఎన్ని అయినా చేయిస్తాడు ఇదంతా మన వాడి వ్యాపారానికి పెట్టుబడే గా !" అన్నాడు కాస్తుల్ల భాయి

"ఇంతకంటే అసలు వీడే ఎలక్షను నిలబడి వుంటే బాగుండేది ఇతరులకు అక్రయిందకుండా లకారాలకు లకారాలు చేర్చి పారేసేవాడు," అన్నాడు మీసాలనాయుడు

"ఇప్పటికైనా మించిపోలేదు. అప్పర్ హౌసుకు నిలబడితే సరి మనిష్ని కూడా కొంచెం ఆదుకో వచ్చు," అన్నాడు తొండమాన్.

"మనవాడికి పై అంతస్తులో సీటా ఖాళీ ! తప్పకుండా నిలబెడవలసిందే," అన్నాడు కాస్తుల్ల భాయి

"ఏడిశావులే అంత తెలివితేటలుంటే పట్టభద్రుల సీటుకు నిలబడరాదూ పల్లభద్రయ్యావు ?" అన్నాడు చెట్టియారు

"మా మామయ్యకూడా ఇట్లాగే అనుకుని చెల రేగాడులే" అన్నాడు డాక్టరు టింగన్

"అవును లోయ్ అన్నట్లు నీవు ఈమధ్య కావ్యం వేసింది అందుకే గామా ! చెప్పరా గొడవా," అన్నాడు మీసాలనాయుడు

మే మందరం కుర్చీలను దగ్గరకు లాక్కున్నాము సిగరెట్టు వెలిగించి కథ ప్రారంభించాడు డాక్టరు టింగన్

"కామయ్యపంతులు మా మేనమామ, కరణం గారి వంశోద్ధారకుడు అట్టే దండయాత్రలు కొట్టకుండా చదువు పూర్తిచేసి జిల్లాకోర్టు లాయరుగా నాక్కు తగిలించాడు మామాను ప్రాక్టీసు పెట్టిన కొద్దికాలానికి కరణంగారు పరలోకానికి ప్రయాణం కట్టాడు ఇరవై ఎకరాల మాగాని పొలం, సుమ్మడి కాయ అంత కొట్టం మా మామయ్యకు సంక్రమించినవి రెక్క ఆడితేనేగాని డొక్క ఆడదనే భయం లేనందువల్ల ప్లీడరీకానికి కరిణీకపు శాస్త్రం తోడు చేసి ప్రాక్టీసు సాగించాడు వారసత్వపు దావాల స్పెషలిస్టు అయినాడు కేసుకు కావలసిన పెట్టుబడి యావత్తూ మావాడే పెట్టి, గెల్చిన ఆస్తిలో సగానికి పైగా కబళించివేసేవాడు

ఆ ఊరిలో బుడేసాహెబ్ అనే తోళ్ల వ్యాపారస్తుడు ఒకడు ఉండేవాడు ఆయన యుద్ధపు రోజులలో ఒకసారి పెద్దఎత్తున సరుకు ఎగుమతి చేశాడు. దారిలో స్టీమరు మునిగిపోయింది. షిప్పింగ్ ఇన్సూరెన్సు కంపెనీమీద దావా వేయవలసి

వచ్చింది మా మామయ్యే ఆయనకు ప్లీడరు వెళ్ళ పేచీలన్నీ చేసి అసలుకు మించిన మొత్తానికి డిక్రీ పొంది పైసలతో సహా వసూలు చేశాడు యుద్ధపు హడావుడిలో బ్యాంకిలో దాచటానికి సాహేబు గారు భయపడి నమ్మకంమీద ఆ డబ్బును మా మామయ్య దగ్గర నే ఉంచుకున్నాడు ఇంతలో బుజే గారికి మక్కా చూసిగావాలనే బడా కోరిక కలిగింది మావాడు ఆయనను స్వయంగా వెంటబెట్టుకుని బొంబాయిదాకా వెళ్ళి బోటు ఎక్కించి వచ్చాడు సాహేబుగారు తిరిగి వస్తూ ఉండగా ఏడెన్‌లో కలరా తగిలి అసలైన మక్కాయాత్రకు ఉడాయించాడు ముప్పయివేలరూపాయిలు మా మామయ్య గొజ్జెలో జీర్ణమైపోయినవి

ఇట్లా ఉంటూఉండగా ఎన్నికల అలజడి బయలుదేరింది మువనష్టపు డబ్బు ఇంత ఉన్నది గదా ఒకచేయి మాతామని మా వాడికి దుర్బుద్ధి పుట్టింది చాలకాలంనుంచీ ఆయనకు ఆస్థాన జ్యోతిష్కుడుగా ఉంటే సిద్ధాంతి గారిని పిలిపించాడు చక్రం చేతికి ఇచ్చి రాబోయే రెండుమూడు మాసాలలో తన భవిష్యత్తు తేల్చిచెప్పమన్నాడు

సిద్ధాంతిగారు మాటల సందర్భాన్ని బట్టి మా వాడి కోర్కెను కనిపెట్టాడు ఒక కాగితంనిండా కూడికలు తీసివేతలు చేశాడు పంచాంగం అటూ ఇటూ తిప్పాడు క్షణం కళ్ళు మూశాడు

"పంతులుగారికి ఇప్పుడు రాజ్యాధిపతి దశలో లాభాధిపతి భుక్తి నడుస్తున్నది," అన్నాడు సిద్ధాంతి

"ఎట్లా వుంటుందంటారు?" అన్నాడు మా మామయ్య

"చెప్పడానికేం! చాల యోగప్రదంగా ఉంటుంది"

"అంటే ఇంకా డబ్బు సంపాదిస్తాననటారా?"

"ఇక్కే కాదు. పదవి జడ్జీ కావచ్చును లేదా"

"ఇప్పుడు జడ్జీసంగతి ఎందుకులెండి రాజకీయంగా యోగిస్తుందేమో చూడండి. శాసనసభా ప్రవేశం"

"అదే చెప్పబోతున్నాను. వృద్ధపారాశరిలో." అని రెండు శ్లోకాలు చదివి అన్వయించి చెప్పాడు.

"అయితే ఏదో ఉన్నదన్నమాట"

"నిస్సంశయంగా గురువు కదలాలి"

"త్వరగా కదిలింతురూ"

"వచ్చేనెల పదిహేనో తేదీన మిత్రనవాంశలోకి వస్తాడు ఆపైన శని వృషభంలో సంచారం"

"అయితే కూలినా ఫరవాలేదంటారు"

"ఫరవా యేమిటండి జైమినిగూడా చెప్పాడు తప్పదు"

"ఎం ఎల్ ఏ అయినా నా, కోటలో ప్రవేశించా ననుకోండి అయితే నామినేషన్ వేయడానికి ముహూర్తం పెట్టండి"

సిద్ధాంతిగారు సుముహూర్తం నిశ్చయించారు

ముహూర్తం అయితే సులభంగా నిశ్చయమయిందిగాని ఏ పార్టీ టిక్కెట్టుమీద నిలబడటమా అనేది క్లిష్టసమస్యగా పరిణమించింది పూర్వపు ఎన్నికలనుబట్టి మాస్తే పూచీకుల్లను గూడ నిలబెట్టి గెలిపించగలిగినది కాంగ్రెస్ పార్టీ అని స్పష్టంగా కనబడ్డది అటువంటప్పుడు ఇంతగావు లావురు పంతులును కళ్ళ కద్దుకొని తీసుకుంటారనే ఆశే ధీమా తెచ్చుకున్నాడు ఎకాయెకి హైకమాండువారిని ఆశ్రయిస్తే తంటా వస్తుందేమోనని ప్రాంతీయపు లోకమాండును ఆశ్రయించాడు

లోగడ తాను అనేకమార్లు కాంగ్రెసు ఫండుకు బహిరంగంగాను, ప్రచ్ఛన్నంగాను ఎన్ని విరాళాలు ఇచ్చిందీ ఏ కరువు పెట్టాడు ఎంతమంది ఛోటా నాయకులకు రైలుటిక్కెట్లు కొనిపెట్టిందీ జ్ఞాపకం చేశాడు పర్మిట్ వ్యాపారస్తులను కోర్టులలో ఎంతమందిని ఆదుకున్నదీ జాబితాలు చదివాడు పార్టీ ఫండుకు పాతికవేలదాకా ముట్టచెపుతానని విన్నవించాడు కాని ప్రయోజనం లేకపోయింది "నీవు చదువుకున్నవాడివి కావటంవల్లనూ, ఈ నియోజకవర్గంలో అల్పసంఖ్యాకమైన కులానికి చెందినవాడవు కావటంవల్లనూ, పార్టీ ఎన్నికలలో హైకమాండుకు అండగా ఉంటున్న ఒక ముఖానాయకుడికి ఇదివరకే వాగ్దానం జరిగిఉన్నందువల్లనూ, నీకు సీటు మంజూరుచేయుటకు మహాత్మాగాంధీ వరప్రసాద సర్వోదయ సూత్రాలు అనుమతించవు" అని నిష్క

య్యను పిలిచి "ఈ ఎలక్షను తేలిపోయేవరకూ కోర్టు దస్తావేజులు మూలపెట్టి ఉంచు అక్కౌంటు వ్యవహారా లన్నీ చిట్టిపంతులుకు ఒప్పగించాను మిగతావి వాయిదా వేశాను ఇప్పటినుంచీ పూర్తి అయే దాకా అన్ని ఏర్పాట్లు భారమూ నీదే ఖర్చు ఎక్కువాతక్కువా అని సంకోచించవద్దు తిమ్మిని బ్రహ్మినిచేసి నన్ను ఒడ్డున పడవేయాలి" అన్నాడు

"మీరు తలచుకుంటే అదెంతపని పంతులు గారూ! ఈ ఎన్నిక ఒక లెఖ్ఖా? దేవుడు మేలు చేయాలిగాని లేపు ఈపాటి కీలా మినిస్టరు అయి పోరూ!" అన్నాడు మల్లయ్య

మా మామయ్యా ఎన్నికలకు సంబంధించిన చట్టాలనూ రూల్సునూ అతిజాగ్రతతో పరిశీలిం చాడు. నామినేషన్ ఫారాలు ఒకటికి నాలుగు తెప్పించాడు అమృతహస్తులని పేరుబడ్డ వ్యక్తులచేత వాటిమీద సంతకాలు చేయించాడు. ఓటర్ల జాబితాలు విడివిగా కాని వాటినిబట్టి వార్డువార్డుకూ, వీధి వీధికీ ప్రత్యేకంగా లిస్టులు తయారు చేయించాడు

మా మామయ్య అనేక లిమిటెడ్ కంపెనీలకు డైరెక్టరుగా ఉంటేవాడు ప్రభుత్వంతో కంట్రా క్టులు ఉన్న ఒక కంపెనీ డైరెక్టరుపదవికి రాజీ నామా ఇచ్చి ఆ సంస్థతో తెగతెంపులు చేసు కున్నట్లు అధికార రీత్యా పత్రం పంపమని వ్రాసి పంపాడు పత్రికలకు ప్రకటనలు ఇచ్చి పత్రికా విలేఖరులకు విందుచేశాడు

ఇంతలో సిద్ధాంతిగారు పెట్టిన ముహూర్తం సమీపించింది కాని ఇంకా తన డైరెక్టరు పదవి రద్దు అయినట్లు అధికారపత్రం రాలేదు టెలిగ్రాములు, ట్రంకుఫోనులు మారుమోగి పోయినవి. చివరకు మల్లయ్యను స్వయంగా మద్రాసు వెళ్లి రమ్మన్నాడు. ఆరోజు ఉదయం 11 గంటలు మొదలుకుని 11-30 గంటల లోపుగా నామినేషన్ వేసితీరాలి అని దైవజ్ఞుడి హుకుం పాపం మల్లయ్య రైలు దిగి ఆల స్యంగా రావటాన పత్రం అందేసరికి 12 గంట లయింది. కాస్తలో మించిపోయింది ఏమిటిలే అని మనసుకు తృప్తిచెప్పుకుని జన్మలో మొదటి తడవగా రాహుకాలం జరుగుతూ 12-15 కు నామినేషన్ ఫారాన్ని అధికారికి దాఖలు చేశాడు.

అయినా ముహూర్తం కొంచెం దాటిపోయి నందుకు మావాడు ఆదుర్దాపడి సిద్ధాంతిగారిని పిలి పించి కర్తవ్యం చెప్పమన్నాడు సిద్ధాంతిగారు తల పంకించి, పెదవులు కంపించి, వేళ్లు ఝాడించి, నవగ్రహశాంతిచేసి స్వర్ణదానం చేయమని సలహా ఇచ్చారు కర్మకాండ యావత్తూ యథావిధంగా జరిపించాడు మా మామయ్య"

ఈ కథ చెప్తూవుండగా చెట్టియార్ మా అందరికీ డ్రింక్సు తెప్పించి ఇచ్చాడు డాక్టర్ టింగన్ ఇంకొక సిగరెట్టు ముట్టించి కథను తిరిగి అందుకున్నాడు

"ఎన్నికల తేదీ సమీపిస్తున్నకొద్దీ మా మామ య్యకు వేడి ఎక్కిపోయింది ఫిలింకంపెనీవాళ్లు తమ మహోజ్వల చిత్రరాజాన్ని విడుదలచేసే ముందు జరిగించే హంగామామాదిరి ఎన్నికల ప్రచారం నడిపించాడు ప్రతిగోడమీద చేటలంత అక్షరాలతో చాటంత పోస్టర్లను అంటించారు. ఇది చాలక తెల్లని ప్రహారీలమీద నల్లని తారు అక్షరాలను చిత్రించారు నడిరోడ్లమీద సున్నంతో వ్రాయించారు రోజా జీతాలమీద క్యాన్వాసర్లను నియమించారు పాత గ్రామఫోను హారన్లు పట్టుకుని "ఓటు ఎవరికి? కామయ్యపంతులుకు," అని అరిచేందుకు కుర్ర కారును ఏర్పాటుచేశారు. ఒక మోటర్వాన్లో లౌడ్స్పీకర్లను అమర్చారు. ప్రతిచౌకులోను కొందరు అతి ప్రఖ్యాతగాయకుడిచేత పాటలు పాడించారు. సక్కతిప్పుకోకుండా మాట్లాడగలిగినవాళ్లు మా మామ య్యను పొగడుతూ గంభీరోపన్యాసాలు చేశారు. వీధినాటకాలు ఆడించారు. పేరంటం చేయించారు.

ఎల్లుండి ఎన్నిక అనగా మా మామయ్య పూర్తిగా కైపులో ఉద్రేకంలో ఊగిపోతున్నాడు మల్లయ్య నురుగులు కక్కుతున్నాడు గంటకొకసారి మావాడిదగ్గరకు వచ్చి తోటపాలెం ముఠా నాలుగు వందల ఓట్లనూ అయిదువందల రూపాయలకు ఫైనల్ చేసేశాను అంటేవాడు అతను మొత్తని పేటలో ఏడు వందల ఓట్లనూ వెయ్యిరూపాయిలు సెటిల్ చేసి నాను అంటేవాడు. ఖర్చు అయితే అయింది ఘనట్ బండిగా కమ్మకురా అని మా మామయ్య ప్రోత్స హించేవాడు.

మావాడుకూడ స్వయంగా తన కారులో రాత్రీ పగలు అనక తిరిగాడు ఏ గూడెంలోకి వెళ్లినా, కారు ఆగగానే ఒకడు ముందుకు వచ్చి "పంతులుగారూ! ఈ వార్డు అంతా మాదే అనుకోండి. అనవసరంగా మీరు రాపోకండి వస్తే అవతలివాళ్లు వచ్చి పేచీలు పెస్తారు అంతా మేము చూసుకుంటాము తమరు దయచేయండి" అనేవాడు కాఫీ ఖర్చులకు ఒక కంద కాడిచేతిలో పారేసి మా మామయ్య చిరునవ్వుతో మరొక చోటికి బయలుదేరేవాడు

ఇక తెల్లవారితే ఎన్నిక అ సాయంత్రంతో గంద్రగోళం అంతా సద్దు మణిగింది రాత్రియావత్తూ మా మామయ్యకు కునుకుపట్టలేదు గదిలో పచారు చేస్తూ తెల్లవార్లూ చుట్టలు తగలేస్తూనే ఉన్నాడు తెల్లవారుఝామున నాలుగు గంటలకు గుమాస్తా మల్లయ్య వచ్చాడు

"ఏం మల్లయ్యా! సిచుయేషన్ ఎట్లా ఉన్నది?"

"ఫస్టుగా ఉన్నది పంతులుగారూ కాశీ సాహెబ్ గారు నాలుగువేల ముస్లిం ఓటర్లను పెద్ద మసీదులో రాత్రినుంచి హాజరు పెట్టాడు పోలింగ్ బూతులు తెరవగానే వడగళ్లవాన మాదిరి ఓట్లను కురిపిస్తానన్నాడు లింగసిగుంటనుంచి, సోమర్లపాలెం నుంచి, పెట్లదిబ్బ నుంచి ముఠాలు ముఠాలుగా బయలుదేరి వస్తున్నారు," అన్నాడు

"ఇతర ఆరేంజిమెంట్లు ఎట్లా ఉన్నయొయ్యా?"

"పంతులుగారూ! మల్లయ్యమతిమరుపు మనిషి. కాదంటారేమో ఊళ్లో ఉన్న బండ్లనూ, టాక్సీలను అన్నిటినీ బుక్ చేసి వార్డువార్డుకూ పంపించాను బళ్లు దొరకక ఇతర పార్టీలవాళ్లు ముక్కున వేలు వేసుకుంటున్నారు" అన్నాడు

"జాగ్రత్త మల్లయ్యా! బళ్లు మనవని తెలిస్తే ఎలక్షన్ కేసు అవుతుంది సుమా!" అన్నాడు మామయ్య

"నే నేమీ వ్యవహారం తెలియనివాణ్ణిటండి పంతులుగారూ!" అన్నాడు మల్లయ్య

మల్లయ్య వెళ్లిపోగానే స్నానాదులు పూర్తి చేసి సూర్యోదయం కాకముందే ఆంజనేయస్వామి దేవాలయానికి వెళ్ళాడు ఇంత సింధూరంబొట్టు పెట్టుకుని కారులో ప్రతి బూత్ దగ్గరా సిచుయేషన్ తెలుసుకుంటూ తిరగటం మొదలుపెట్టాడు. అన్ని స్టేషనులలోను మా పార్టీ ఏజంట్లు ప్లీడరుగుమాస్తాలే గెలుపు మనదేనండీ అన్నారు జంకూ గొంకూ లేక

మధ్యాహ్నం మళ్ళసరికి మా మామయ్యకు విపరీతంగా తలనొప్పి బయలుదేరింది కారులో కూర్చునే ఓపిక కూడ లేకపోవటంవల్ల ఇంటికి పోయి ఆస్ప్రి వేసుకుని నిద్రపోయాడు. అట్టే గొడవలేమీ లేకుండా ఓటింగు ముగిసింది

మూడవరోజు సాయంత్రానికి ఓట్లను లెక్కపెట్టటం పూర్తి అయింది పోటీలోకి కూడా రాని కమ్యూనిస్టు అభ్యర్థి పదిహేను వేల మెజారిటీతో గెలిచాడు మా మామయ్యకు డిపాజిట్ పోయింది.

ఆ రాత్రి భోజనాలుచేసి మా మామయ్యా, నేను, మల్లయ్య, సిద్ధాంతిగారు వసారాలో కూర్చుని ఉన్నాము

"ఖర్చు అంతా లెక్క చూశావా మల్లయ్యా" అన్నాడు మామయ్య

"చిత్తమండి. ఇరవై ఏడు వేల అయిదు వందల పై చిల్లర అయింది" అన్నాడు మల్లయ్య.

"ఓటుకు యాభై పైన అయినట్లుందే" అన్నాను నేను

"అయితే ఏమిరా నేను పట్టుబట్టి ఓడించదలచుకున్న మూడు పార్టీలు ఓడిపోయినవి నేను గెలిస్తే నేమి, ఓడితే నేమి?" అన్నాడు మా మామయ్య

అప్పటిదాకా మాట్లాడకుండా కూర్చున్న సిద్ధాంతిగారు గొంతు కొంచెం సవరించుకొని "ముహూర్తం మించకుండా నామినేషన్ వేసిఉంటే పర్యవసానం ఇట్లా ఉండకపోను, పంతులుగారూ," అన్నాడు.

"అంతేనంటారా సిద్ధాంతిగారూ! ఏమో తెలిదండి చెప్పలేము గురుడు కదిలాడు కాబట్టి ఇక ఇట్టే సంగతి మాకాం" అన్నాడు మామయ్య

అనగానే లేచి నిలబడ్డాడు డాక్టర్ టింగన్. మేమూ లేచాము. కొంపలకు బయలుదేరాము.

(ఇందులో వ్యక్తులు, ఘట్టాలు, కల్పితాలు ఎవరినీఉద్దేశించి వ్రాయబడినవి కావు-రచయిత)

# శూన్యానికి 

శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

ఇంతదాక
మా ఊహకు సరిగా అందని
శూన్యం!
ఏ ఉనికీ లేని మనికి!
కాదిత్వం రూపుగొనకముందే
నిలిచిఉన్న ఆదిత్వం!
సర్వం నశించిపోయినా
నిలబడి ఉండే
అనశ్వరత్వం!

* * *

నీలో
ఒక అత్యల్ప ప్రభాగం
జగత్తులో సృష్టిద్దామని
తన విజ్ఞానాన్నంతగానో వెచ్చించి
యత్నించి ప్రయత్నించీ
సాఫల్యం పొందలేదు మానవుడు—
మాటిమాటికీ నిను స్మరించినా
మనుజుని ఊహకు
నీస్థితిలో ఒక అత్యల్పపు గతిమటుకే
స్ఫురించుతుంది—
అతిబలవంతపు నీ శక్తిని ఎంచిన
మహాశక్తిదో
పెకలించింది బృహద్విద్యుచ్ఛక్తి లేదేనో
నీ శూన్యాంతఃప్రాంతం పట్టిన
పట్టును విడగొట్టా—
నిన్నే ఎరుగని మేమూ
మహాశక్తి నూహింపగగలమా!

* * *

మానవమేధకు
తెలిసిన కొలతలతో
ఎప్పుడు జనించినో
ఎప్పటింతంగొంటుందో
ఊహింపగసాధ్యపడని
కాలంపుట్టుక నీ నుంచే!
సృష్టినిగొన్న సమస్తానికీ
సాధారణ గుణమై ఉండేదేదో
అది
నీనుంచే సంజనితం!

* * *

నీనుండి ప్రసవించిన
కాంతికిరణగణమే
నీ రూపపు నీడలు
మా కనులకు కనపడనీయావు
నీ నిశ్శబ్దం నుంచే
ఉదయించిన శబ్దం
తన గందరగోళంతో
నీ ప్రశాంతి భంగపరుస్తున్నది
నీ సంతానంలో
పదార్థమున్నది
ఆకారం సాయంతో
వింతవింతగా
నాట్యం చేస్తున్నది
నీ రెక్కల నీడలలో
స్థలం, కాంతి, శబ్దం,
విద్యుత్తూ, ఆకర్షణశక్తి,
పదార్థం—
ఇంకెన్నో కలిసి తయారైన
విచిత్రపు సృష్టి సమస్తం
కాలం నాయకత్వమున,
తిల్లిని, నీ పైనే తిరుగుబాటు చేస్తున్నది!

* * *

సర్వానికి కాలం చేసే సాయం
వాటన్నిటినీ నీలోనికి
తుట్టతుదకు తరుమడానికే!
నీ కొనరించిన
ఈ ద్రోహానికి ప్రతిఫలముగ
చివరకు తానూ నీలోనే
లయమైపోవా నీ కాలం!

* * *

ఇంత జగంలో
వినాశానికందే అవకాశం
కనిపించని దానివి నీవే—
ఊహ్యాలకు అద్యంతాలగు
ఓ అనూహ్య శూన్యం!

—(*JOHN WILMOT* ఛవి)

# ఏకాంకిక

★

శ్రీ పీసపాటి వెంకటేశ్వర్లు

నాటకములు సమగ్రవికాసము పొందిన భారతీయ సాహిత్యరంగమునకు ఏకాంకికలు నూతనములు గావు. సంస్కృత సాహిత్యతత్త్వవేత్తలగు ఆలంకారికులు రూపకమును రూపకము లనియు ఉపరూపకము లనియు రెండువిధముల విభజించియుండిరి. అందు రూపకము దశవిధములుగను ఉపరూపకములు అష్టాదశవిధములుగను పునర్విభక్తము లయినవి. దశధావిభక్తము లయిన రూపకములలో నే మూడు, ఏకాంకికలయి యున్నవి.

(1) వ్యాయోగము (2) అంకము (3) వీథి

ఇందు వ్యాయోగము వీరరసప్రధానము. స్త్రీపాత్రల కిచట ప్రవేశము లేదు. క్వాచిత్కముగ నున్నను అతి స్వల్పము. అంకము మాత్ర మొకటియే యుండును. నాటక మంతయు నొక ప్రముఖమగు నభిప్రాయము ననుసరించి నడుచును. నాటకమునందలి సంఘటనమంతయు ఒక దినమునందు మాత్రమే జరిగినదిగ నుండును. నెలలోను సంవత్సరములలోను జరిగిన సంఘటనము ఏకాంకికయందు రచింపరు. ఏకాంకిక ప్రత్యేకతలలో నిది చాల ముఖ్యమయినది.

అంకము కరుణరసప్రధానము. భామినీశోక వర్ణన మిందు ప్రధానము. ఇది కూడ ఏకాంకికయే. నాటకీయవిషయము ఒక దినమునకు చెందిన ప్రముఖ ఘట్టము మాత్రమే అనుసరించును.

శృంగారరస ప్రధానము వీథి. విషయవికాసము ఏకదినపర్యాయియగు ఘటనా చమత్కారమున వృద్ధిచెంది ముగియును.

ఈ మూడును రూపకములయందలి ఏకాంకికలు. ఇక ఉపరూపకములయందలి ఏకాంకికలను విమర్శింతము.

అష్టాదశ భేదములను చెందిన యుపరూపకములయందు నిమ్నలిఖిత దశవిధ భేదములు ఏకాంకికలయి యున్నవి. (1) గోష్ఠి (2) నాట్యరాసకము (3) ఉల్లాప్యము (4) కావ్యము (5) రాసకము (6) ప్రేంఖణము (7) శ్రీగాదితము (8) విలాసిక (9) హల్లీశము (10) భాణిక

ప్రాచీన సంస్కృత సాహిత్యసాగరమును మథించిన అనేకులగు ఏకాంకికాలక్ష్యము లున్నవి. సుప్రసిద్ధములను కొన్నిటిని మాత్ర ముదాహరించుచున్నాను.

| | |
|---|---|
| (1) రైవత మదనిక | (గోష్ఠి) |
| (2) విలాసవతి | (నాట్యరాసకము) |
| (3) దేవీ మహాదేవము | (ఉల్లాప్యము) |
| (4) మేనకాహితము | (రాసకము) |
| (5) వాలివధము | (ప్రేంఖణము) |
| (6) క్రీడారసాతలము | (శ్రీగాదితము) |
| (7) బిందుమతి | (విలాసిక) |
| (8) కేళీరైవతకము | (హల్లీశము) |
| (9) కామదత్త | (భాణిక) |
| (10) సౌగంధికాహరణము | (వ్యాయోగము) |
| (11) శర్మిష్ఠాయయాతి | (అంకము) |

పాశ్చాత్యదేశములలో ప్రథమమున గ్రీసుదేశమునందు మాత్రమే నాటకము సంపూర్ణవికాసమును బొందియున్నది. భారతీయ నాటకములయందు కనుపించు సూక్ష్మవిశ్లేషణ యవన నాటకములయందు కానరాదు. "అరిస్టాటిలు" అను నతడు తన "పోయిటిక్స్" అను గ్రంథములో "నాటకములు, సుఖాంతము లనియు దుఃఖాంతము లనియు రెండు విధములు" అని మాత్రము పేర్కొనియున్నాడు. యవన (గ్రీసు) దేశీయ నాటకనిర్మాణదక్షుడగు "ఎస్కిలస్" అను నాతడు రచించిన నాటకము లన్నియు ఏకాంకికలే. ఎస్కిలస్ తరువాత "సోఫాక్లిస్" రచించిన నాటకములను కూడ ఏకాంకిక లనవచ్చును.

యవననాటక రచయితలు "సంకలన" (*Unity*) ను తమ నాటకములకు ముఖ్యలక్షణముగ నేర్పరచిరి. నాటకమంతయు (1) ఏకస్థానమునకు చెంది యుండుట (2) ఏకదినమునకు మాత్రము చెందిన సంఘటనను వర్ణించుట (3) ఒకే ముఖ్య విషయమునకు చెందియుండుట అను నీ భాగత్రయమును "సంకలన"మునకు లక్షణముగ వ్యాఖ్యానించియున్నారు. ఇట్లు వ్యాఖ్యానించుటకు కారణము "ఏకరాత్రియందున, ఏకరంగస్థలమున, సంవత్సరముల తరబడి బహు ప్రదేశములందు జరిగిన బహువిధ సంఘటన

లను ప్రదర్శించుట స్వాభావికమునకు విరుద్ధ"మని వారు శంకించుటయే కారణము

భారతీయ నాట్యకములయందు ప్రసిద్ధములగు ప్రవేశకము, విష్కంభము అనునవి యవననాటకముల గానరావు కనుకనే అంకవిభాగము లేకుండ సంకలనలక్షణములు మాత్రముగల నాటకము "ఏకాంకిక" యను నిర్వచనమున కర్హమగుచున్నది

## నవ్యప్రపంచమున ఏకాంకికా వికాసము

ఏకాంకికా వ్యాప్తి మొదట ప్రారంభ మయినది పాశ్చాత్యదేశములయందు ప్రథమమున దీని కున్న పేరు కర్టెన్ రైజర్ నాడు నాటక ప్రారంభమున సమాజదృష్టి నాకర్షించుటకు ఏకాంకికా ప్రదర్శనము జరుగుచుండెడిది తరుచుగ నిది హాస్యరస ప్రధానమయి యుండెడిది "ఫారస్" నాటక రంగస్థలియందు నాటకాంతమున ప్రదర్శితములయి, హాస్య రసప్రధానములగు "నకలు" అనువానితో దీనిని పోల్చవచ్చును 1918 వ సంవత్సరముముగిసిన ప్రపంచ మహా సంగ్రామానంతరమున పాశ్చాత్యదేశములయందు ఏకాంకికా వికాసము సంపూర్ణముగ జరిగినదని చెప్ప వచ్చును "గ్రేటు బ్రిటను"నందు 1924 నందు మిష్టర్ జె ఏవ్ షెరియట్ అనునతడు దీనిని ప్రారంభించెను ఆయన ఈ ఏకాంకికలను "అమెచ్యూర్" నాట్య జగద్వికాసమునకు పునాదులుగ నిర్మించెను తరువాత ఏకాంకిక రచనాప్రచారములు దినదిన ప్రవర్ధమానము లయినవి ద్వితీయ ప్రపంచ మహా సంగ్రామము జరుగుటకు కొంతకాలముముందు "బ్రిటిష్ డ్రామాలీగ్" ఒక నాటకస్పర్ధను ఏర్పాటు చేసినది ఈ స్పర్ధయందు 600 నాటక సమాజములు పాల్గొనినవి అధికముగ ఏకాంకికలు ప్రదర్శితము లయినవి తరువాత చలనచిత్ర ప్రారంభమున ప్రదర్శించుట కనువుగా పాశ్చాత్యులు ఏకాంకికా మార్గమున చిన్నచిన్న చలనచిత్రముల ననేకములను నిర్మించిరి

పాశ్చాత్యుల ఏకాంకికలను (1) "*One act play*" (2) *Sketch* (3) *Radio drama* అని త్రివిధములుగ విభజించవచ్చును. ఈ మూటియందును భేదము స్వల్పమయినను రచనాపద్ధతిమాత్రము సామాన్యముగ ఒకటిగనే యుండును

ఆంగ్లభాషాపుత్రులమగుటవలన మనకు ప్రతి విషయమునందును పాశ్చాత్యులే ఆదర్శప్రాయులుగ నున్నారు. ప్రస్తుత మా పాశ్చాత్యుల ననుసరించియే ఏకాంకికా రచనను మహారాష్ట్రీ, బంగాళీ, గూర్జర, ఆంధ్ర, హైందవ్యాది భాషలయందు సాగించుచున్నారు.

## ఏకాంకికా వికాసమునకు కారణములు

దేశ విదేశములయందు ఏకాంకికానిర్మాణము నకు ప్రోత్సాహము నొసంగు కారణములు రెండు. (1) దీర్ఘనాటక దర్శనమునకు కార్యాంతర నిమగ్ను లగు ప్రజల కవకాశములేకపోవుట, (2) విస్తృత ప్రచారము నందుచున్న "రేడియో"యందు కాల వ్యవధి పరిమితముగగల నాటకములను మాత్రమే వినిపించుట కవకాశ ముండుటయును నయియున్నవి.

## లేఖన శైలి

నటులకును, కథకును గల భేదమే సంపూర్ణ నాటకమునకును ఏకాంకికను గలదు

నాటకమునందు నాట్యకళా వికాసమునకు అవరోధమయిన సంకలనము ఏకాంకికా నిర్మాణమున ప్రధానత వహించును సంకలన లక్షణములుగ వ్యాఖ్యానింపబడిన మూడు విషయములలోను "ఏక కాలమునకు చెందియుండుట, ఏక విషయమునకు ప్రాధాన్య మొసంగుట" అను నీ రెండువిషయములు ఏకాంకికా రచనయం దతి ముఖ్యములు బృహదల్ప స్వరూపములు సమగ్రనాటకైకాంకికలయం దంతరమును గల్గించుటయందు ప్రముఖసాధనము లను కొనుట సమంజసము గాదు ఏకాంకికలు అల్ప రూపములయి యుండవలయునని నియమము లేదు అనల్పస్వరూపమును గూడ పొందియుండవచ్చును. అనల్పస్వరూపముగల ఏకాంకిక రేడియోయందు గాని లేక స్వల్పవ్యవధియందు గాని ప్రదర్శితమగుట కయోగ్యమయినను అది ఏకాంకిక అనియే చెప్ప బడును ఏకాంకికయం దనేక దృశ్యము లుండ వచ్చును గాని ఒక దృశ్యము ఈనాటికి చెందినదిగను, మరియొక దృశ్యము సంవత్సరమునకు తరువాత జరిగినది గను ఉండరాదు ఏకాంకికయందలి భిన్న దృశ్యములు ఆ కాలమునకు మాత్రమే చెందిన వివిధ ఘట్టముల ననుసరించి యుండవలయును "ఏక స్థలమునకు చెందియుండుట" అనునది అంత ముఖ్యము కాకపో యినను "ఏక కాలమునకు చెందియుండుట" అనునది చాల ముఖ్యము కొన్ని ఏకాంకికలయందు కాల నియమము బాధాకరమయిన తన్నివారణకు ఉపక్ర మోపసంహారములను కల్పింపవలయును. ఈ కల్పన "ఏక కాలమునకు చెందియుండుట" అను నియమమును నిల్పుటకును కాలనియమముగల స్థలమున నాటక సౌందర్యము నినుమడింప చేయుటకును పనికివచ్చును కనుక ఉపక్రమోపసంహారకల్పన తప్పనిసరియగు నని తలంపరాదు. కాలనియమముగల స్థలమున నీ కల్పన లేకపోయినను బాధలేదు గాని కాల నియమో ల్లంఘన జరిగినప్పుడు మాత్రము తప్పనిసరియగును ఉపక్రమోప సంహారోపయోగము నాటకారంభాం తములయందు మాత్రమే యుపయోగించుట స్వాభావిక

శ్రీమదాంధ్ర

# మహాభారతము

## ఉద్యోగపర్వము

వెల ఒకరూపాయి

ప్రకాశకులు:
**ఆంధ్రగ్రంథమాల**
నెం. 7, తంబుచెట్టివీథి, మద్రాసు 1.



సంపాదకుడు
శ్రీ వ్యాఖ్యామృతావర్షిత్ర
కలగ ఆంజనేయశాస్త్రి

మధ్యదృశ్యములయందు కాలనియమును పాటింపవలయును. రంగస్థలమునందు ఏకాంకికాప్రదర్శన జరుగునప్పుడు అందలి ప్రముఖఘట్టములకును ఉపక్రమమునకు లేక ఉపసంహారమునకును మధ్య సంఘటనములకొలది కాలభేద మున్నయెడల ఉపక్రమమును గాని ఉపసంహారమును గాని యవనికపై వ్రాసి ప్రదర్శింపవలయును అనగా ఉపక్రమమునకును ప్రముఖ దృశ్యములకును మధ్య కాలభేదమున్నప్పుడు ఉపక్రమమును నాటకారంభమున ప్రదర్శించుటచే పాఠకుడు దానిని చదివి తరువాత రాబోవు విషయము భిన్నకాలమునకు చెందినదని తలచును అట్లే నాటకాంతమున ప్రదర్శితమగు ఉపసంహారవిషయమున గూడ సంభవించును రంగస్థలమున యవనికపయి వ్రాయు పద్ధతి నవలంబించినటులనే రేడియోయందు వాగ్రూపమగు పద్ధతి నవలంబింపవచ్చును చలనచిత్రరూపమునందిన ఏకాంకికలు కొన్నిటియందు ఉపక్రమోపసంహారములు లిఖితపూర్వకముగ ప్రదర్శితము లగుచున్నవి వానిని చదువుటకు మన మభ్యస్తుల మగుటచే నవి ఎబ్బెట్టుగ కనుపించుటలేదు అట్లే రంగస్థలమునందును రేడియోయందును ఈపద్ధతి కొంత నూతనముగ నున్నను క్రమముగ మనము దాని కలవాటుదుము కాని ప్రాచ్య పాశ్చాత్య నాటక ప్రదర్శనములయం దీ పద్ధతి యమలులోనికి రాలేదు నాటకపఠన విషయమున నీ యుపక్రమోపసంహార విషయము వివాదగ్రస్తము కాకపోయినను రంగస్థల ప్రదర్శనమున నిది వివాదాకరమయినది పూర్వోక్త సరణి అనుసృతియగుచో నీ వివాదము పరిష్కారమగుననుటలో సందియము లేదు కాల సంకలనము ఏకాంకికల కత్యవసరమగుటవలన అది ఏకాంకికా వికాసమునకు విఘ్నకారి కారాదనుటకు పూర్వోక్త సరణి అవశ్యాచరణీయము

సంకలనద్వయ నియమబద్ధమగు ఏకాంకికా రచనయందు గమనింపతగిన యన్యవిషయములు కొన్ని గలవు

ఏకాంకికా రచన ప్రముఖవిషయము (*Idea*) కొకదాని ననుసరించియే సాగును అనేకఘట్టములను ప్రదర్శించినగాని విషయవికాసము జరుగదు సంపూర్ణనాటకప్రవర్తనమున అనేక భాగములను చేర్చి పలువిధములగు ఘట్టములను నిర్మించి నాటకమును జయప్రదముగ నిర్వహించుచున్నారు కాని ఏకాంకికయందు ప్రదర్శితమగు విషయము ఏకాంశవిశిష్టమగుటచే నాటకమున కనుసరింపబడిన పద్ధతి ఇచట నాదరణీయము కాదు మరియు నాటకమునందు విషయవికాసమునకును సమస్యాపరిష్కారమునకును నాట్యశాస్త్రప్రసిద్ధములగు పతాక, ప్రకరి, మున్నగు నుపకథలను ప్రదర్శించుట సంప్రదాయసిద్ధమయి యున్నది. కథాంశమొకటి మాత్రమే గ్రహింపబడు ఏకాంకికారచనయందు, ప్రకరి, పతాక, మొదలగువానికి తావకాశములేదు పాత్రనిర్మాణము లేకుండ కథ సాగదు గనుక పాత్రపోషణ కావలయును సంపూర్ణనాటకమునందు గూడ పాత్రలు ఎంత తక్కువగనున్న అంత చక్కగ పాత్రపోషణ జరుగుట కవకాశమున్నది అప్రధాన పాత్రపోషణ ముఖ్యపాత్రపోషణ కిచట సహాయమగును ఏకాంకికయందు మాత్రము ముఖ్యాముఖ్య పాత్రలు రెండును చాల తక్కువగ నుండవలయును. కారణ మేమన నాటకములోని కథను లేఖకుడు స్వయముగ చెప్పుట కవకాశము లేదు పాత్రల చేష్టలు, సంభాషణలు మాత్రమే కథాకథన సాధనములు పూర్ణనాటకమునందు సంభాషణ కెంతటి ప్రాధాన్యముగలదో ఏకాంకియందును నంతే గలదు

చక్కని విషయము విషయవికాసమునకను రూపములగు సంఘటనలు, సంఘటన ఫలప్రదమగుట కనురూపమగు కథ స్వల్పములగు పాత్రలు రమ్యమగు తత్పరిపోషణ, స్వాభావికములగు నభినయ సంభాషణలు మున్నగునవి ఏకాంకిక జయప్రదమగుటకు ముఖ్యసాధనములు

రేడియో నాటకములు వ్రాయునప్పు డొక విషయమును ముఖ్యముగ గమనింపవలయును "కేవలి జను" విశ్వవాస్తమగుచరకు రేడియో వినుటకు మాత్రమే యుపయోగించును కనుక శ్రవణమాత్రముననే హృదయాహ్లాదకరముగ విషయము గ్రాహ్యము కావలయును మిగిలిన విషయములు పూర్ణనాటకమునకును, ఏకాంకికకును సమానములు కాని ఒక్క విషయము "స్వాభావికత" మాత్రము అతి ముఖ్యము అస్వాభావికత పానకములోని పుల్లవంటిది గనుక స్వల్పమయినను నది దుస్సహమగును

సంపూర్ణనాటకమందలి స్వగతాదుల కెంత మాత్రమును ఏకాంకికయందు స్థానములేదు పద్య, కవిత్వ, నృత్యాగు లుపయుక్తములు గారాదు అనగా పూర్తిగ నిరాదరణీయములని యనుకొనరాదు సఫలకవిత్వమునకగల స్థాన మిచట లేదని యర్థము స్వాభావికతకు భంగము లేకుండగ సంపూర్ణ నాటకమున నీయబడు స్థానము ఏకాంకికలయం దీయవచ్చును కాని, పద్య, నృత్య, గీతాదులను గ్రుచ్చి యెత్తుటకు చోటీయరాదు ఏమయినను ఏకాంకిక స్వాభావికమగుట చాల అవసరము

కవి హృదయము ననుసరించి ఏకాంకిక ఒకప్పుడు ఆనందదాయకమును వేరొకప్పుడు ఉపదేశదాయకమును గావచ్చును ఇంతవరకు మనము చర్చించిన కళాసంవిధానము సమ్యక్ప్రయుక్తమయినను కాకపోయినను మానవ హృదయములను మహోన్నతాశయములకు గొనిపోవు ఏకాంకికయే సర్వశ్రేష్ఠమగును

# ఘటిక : ఘటికాస్థానం



శ్రీ వడ్డాది శ్రీరామచంద్రమూర్తి

దక్షిణభారతంలో విద్యావ్యాప్తికి తోడ్పడి, కాలగర్భంలో యిమిడిపోయిన పురాణ సంస్థలలో ఘటిక అన్నది ఒకటి. ఆర్యులు దక్షిణాపథంలో ప్రవేశించి తమ మతము సాంప్రదాయాలు, సంస్కృతి, వ్యాప్తి చేయడానికి, వారికి దేవాలయము, మఠము, ఘటిక అన్నవి మూడూ చాలా తోడ్పడ్డాయి. వీటిలో దేవాలయములు, మఠములు నిర్వహించిన పాత్ర, నిర్వహిస్తున్న పాత్ర చాలా మందికి తెల్సిన విషయమే. అవి సజీవములై నేటికి కూడా హిందువులలో చాలామంది జీవితాలతో అవినాభావమయిన సంబంధం కల్గివున్నాయి. కాని వీటి తోబుట్టువైన ఘటిక అన్న విద్యాసంస్థ మాత్రం కాలగర్భంలో యిమిడి పోవడంచేత, దానిని గురించి పాత శాసనాల బూజు దులిపే ఏ కొద్దిమందో తప్ప జన బాహుళ్యానికి దీనిని గురించి తెలియదు.

ప్రాచీన ఆంధ్ర శాసనాలలోనూ, కన్నడ శాసనాలలోనూ, "ఘటిక," "ఘటికాస్థానము," "ఘుడియారము" "ఘుడిశాని" అన్న పదములూ వాటి పర్యాయపదములైన ఘటికాశాల, ఘుడశాని, ఘుడిశాని, ఘుడియశాని మొదలయినవి తరుచు కానవసును. ఘటిక అన్న ఈ విద్యాసంస్థ ముఖ్యంగా దక్షిణ భారతంలో మాత్రమే వ్యాప్తి చెందింది.

ఈ పదముయొక్క అర్థముగురించి పండితులు వివిధమైన అర్థములు ఇచ్చియున్నారు.

పురాతత్వ వేత్తలలో ప్రసిద్ధి పొందిన *Mr Louis Rice*, ఘటిక అన్నది "గోష్ఠి," లేక "బ్రాహ్మణుల సభ" అనీ, 1 పాథక్ పండితుడు "పుణ్యతీర్థమనీ," 2 *Dr Kielhorn* "బ్రహ్మపురి"3 వంటిదనీ వివిధమైన అభిప్రాయాలు వెలిబుచ్చారు. *Dr Buhler* "ఒక గడియారవిశేషమనీ," 4 *Dr Barnett* సమావేశమునకు వీలగు భవనమనీ, 5 దీనిని నిర్వచించారు. శ్రీ భావరాజు వెంకట కృష్ణరావు గారు, 'ఘటిక' అన్న శబ్దము 'ఘటక' అన్న శబ్దమునకు పర్యాయ పదమనీ, అది కడక, కటక అన్న పదములకు సంబంధించినదనీ వ్రాసియున్నారు. 6 *Dr Hultzsch* మాత్రము దీనికి సరిగా 'కళాశాల' 7 అను అర్థము నిచ్చిరి.

ఘటిక అన్న ఈ పదమున కర్థము సంస్కృత నిఘంటువులలో దేనిలోనూ కూడా కానరాదు. ఆప్టే మాత్రము, ఒక రకపు ఆలయవిశేషమని అర్థము నిచ్చియున్నాడు. శబ్దరత్నాకరములో గాని, కిట్టెల్సు కన్నడ నిఘంటువులో గాని, దీని ప్రశంస కానరాదు. ఈ మధ్యనే ప్రచురితమైన సూర్యరాయాంధ్ర నిఘంటుకర్తలు మాత్రము, లోగడ ప్రకటితమైన చారిత్రిక పరిశోధ వ్యాసాలు పరిశీలించి, ఘట శబ్దమునకు 'గోష్ఠి,' 'సభ' అను అర్థమునిచ్చి, ఘటశాని శబ్దముగురించి వ్రాయుచూ ఘటికా అను విద్యాసంస్థ ఒకటి వుండెడిదని పేర్కొన్నారు.

ఇట్టి చరిత్రకారులను, పండితులను మభ్యపెట్టిన ఈ సంస్థ గురించిన కొన్ని వివరాలు ప్రకటించడమే యీ వ్యాస లక్ష్యము.

ఘటిక అన్న ఈ పదము, మొదటిసారిగా మనకు కదంబవంశ రాజన్యుడయిన కాకుత్స్థవర్మ తలగుంద శాసనములో కనిపిస్తున్నది. తలగుంద అన్న ఈ గ్రామము మైసూరుసంస్థానంలోని షిమోగా జిల్లాలోని షికార్పూర్ తాలూకాలో వున్నది. దీనిలో ఘటికాస్థానంగురించి చేసిన ప్రస్తావన వలన, తలగుంద శాసనదాత కదంబ కాకుత్స్థవర్మ పూర్వీకుడైన మయూరశర్మ, కాంచీపురంలో వున్న ఘటికాస్థానానికి, విద్యాభ్యాసము కొసమో, లేదా అక్కడవారిని జయించడంకోసమో, వెళ్లినట్లు తెలుస్తోంది. తలగుందశాసనం, లిపిస్వరూపాన్ని అనుసరించి *Mr Louis Rice* క్రీ. శ. 5 వ శతాబ్దము

---

1 *Mysore and Coorg by Louis Rice P 210*

2 *Do* ,

3 *Do* ,

4 *Ep Ind I, 276, 284.*

5 *Ep. Ind XIII. 327,*

6 *Early Dynasties of Andhra Desa P 208*

7 *Ep Ind XVIII, 57*

8 *Ep Ind P 34*

### కులంలేని పిల్ల

[సాంఘిక నాటకం]

పినిసెట్టి శ్రీరామమూర్తి ఆదర్శ నాట్యమండలి, పాలకొల్లు వెల రూపాయి పావలా

ఇది వర్ణవిభేదాలు కూడదని నిరూపించే నవన నాటకం రచయిత అక్కడక్కడ పాటలు కూడా ప్రవేశపెట్టారు పాపన్న పంతులనే చాందసుడుంటాడు అతని కుమారుడు సుదర్శనం సుశీల అనే కులంలేని పిల్లను పెళ్ళిచేసుకుంటానని పట్టు పడతాడు తండ్రి వల్లకాదంటాడు చివరికి కొడుకు తండ్రికి ఎదురుతిరిగి సంఘోద్ధరణాదర్శంతో తాను వలచిన పిల్లనే పెళ్లిచేసుకుంటాడు

ఇది ఇలా ఉండగా సుదర్శనం చెల్లెలు విమల సుదర్శనం భావమరిది వీరేశుని పెళ్లిచేసుకోవాలని అనుకుంటుంది

పాపన్న పంతులు కొడుకు చేసినది అంగీకరించి వట్టు వటించి, ఒకనాడు హఠాత్తుగా కొత్తగా పుట్టిన శిశువును హత్యచెయ్యబోతాడు కాని సుశీల అడ్డుకుంటుంది చివరికి కత్తిపోటువల్ల సుశీల చచ్చిపోతుంది ఇది జరిగిన తరవాత పాపన్న పంతులుకు పశ్చాత్తాపం వస్తుంది చివరికి విమలా వీరేశుల పెళ్లితో నాటకం ముగిసిపోతుంది

కథఅల్లికనుబట్టిచూస్తే నాటకం చివర ఇల్లాటి అఘాయిత్యం అక్కరలేకుండానే పంతులులో పరివర్తన తీసుకురావచ్చును మొత్తంమీద ఇల్లాంటి లోపాలు నాటకకథలో అంతటా కనిపిస్తాయి

పాత్రస్వభావాలను గురించిగాని లేక ఈ నాటకంలోని పాటలను గురించిగాని అంతగా వ్రాయవలసిందేమీ లేదు

ఈనాటకంలో ఒక్క సంభాషణలు మాత్రం కొంచెం చురుగ్గా చలాకీగా సాగిపోతూంటాయి ఈ వీటివల్లనే పాఠకులీ నాటకం కొసదాకా చదువుకుపోవడానికి వీలవుతుంది

---

### ప్రగతి

[నాటికల సంపుటం]

ఆచార్య ఆత్రేయ, ఉదయసాహితి, గవర్నర్ పేట, గుంటూరు వెలముప్పావలా

ఇది రెండు నాటికలసంపుటి. వీనిలో మొదటిది '*Progress*' అనే ఆంగ్లనాటిక మొదటి పది పేజీలు, చివరిపేజీ చదివినతరవాత వ్రాసినదని ఆచార్య ఆత్రేయ పీఠికలో తెలియజేశారు. రెండవది కావలావానిదీపం. ఇది హరీంద్రనాథ చటోపాధ్యాయ వ్రాసిన నాటికకు అనువాదం

ఒక శాస్త్రపరిశోధకుడు గట్టిపరిశోధన చేసి ప్రపంచం అంతా ధ్వస్తమవటంచేసే మారణాయుధంకనిపెడతాడు అచిరంగా ప్రపంచంలో యుద్ధాలు లేకుండా చేయ్యవచ్చునని అతననుకుంటాడు కాని అతని సోదరి శాంతి ఆ చేసేదిరాక్షస కృత్యమని నిందిస్తూ పరిశోధనాగారంలోని వస్తువులన్నీ విరజిమ్మి పారేస్తుంది ఇదీ ప్రగతిలోని కథ

ఈనాటిక చాలా మంచి నాటిక కాని అనువాదకులు యథాతథంగా అనువదించక పోవటంవల్ల తెలుగు నాటిక చప్పగా తేలిపోతుంది వీరికి పూర్వమే ఏ తరహాలో తెలియదుగాని శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారు దీన్ని అనువదించి ప్రదర్శించారు. ప్రదర్శనలోకూడా ఆనాటిక బాగా రక్తికట్టింది ఇల్లాంటి ఉత్తమనాటికలు అనువదించేటప్పుడు అనువాదకులు తగినంత శ్రద్ధతీసుకోకపోతే—చివరికి మూల రచయితకే అన్యాయం జరుగుతుంది

ఇక రెండోనాటికలో అనువాదం చురుకైన సంభాషణలతో సాఫీగా చక్కగా నడిచిపోయింది

---

### శైవ సర్వస్వము

పండిత ముదిగొండ కోటయ్యశాస్త్రి అయ్యవారు. ఈమని వయా దుగ్గిరాల, గుంటూరుజిల్లా వెల 2-8-0

ఇది శైవుల ఆచారవ్యవహారాలు, ధర్మాధర్మాలు, శైవవేదాంతము మొదలయిన విషయాలను గురించిన గ్రంథము రచయిత ప్రమాణపరిచ్ఛేదము అనేవిభాగంలో శాంభవదీక్ష స్వీకరించే విధానము, సప్రమాణంగా వివరించారు

దీనిలో రెండోవిభాగం ఆచరణాచారదీపిక దీనిలో రచయిత భస్మధారణాది విధానాలన్నీ విపులంగా వివరించాడు

అటుపిమ్మట శాంభవీయ ధర్మసూత్రావళి విభాగంలో శైవధర్మసూత్ర గ్రంథాలనుండి సేకరించిన ప్రామాణిక సూక్తులతో శైవధర్మాలనుగూర్చి చేసిన కూలంకష చర్చ కనిపిస్తుంది కాలాగివది చారిత్రికమైన శైవవ్యాప్తి అనే అధ్యాయము రచయిత దీనిలో సంగ్రహంగా శైవమతచరిత్ర వ్రాశారు

అయితే ఇది మొట్టమొదటే చేర్చిఉంటే పాఠకులకు ఈ గ్రంథం ఇంకా సులభసాధ్యంగా ఉండేది. మున్ముందు సంస్కరణల్లో కాలు మొదలైనవి



# ఆనందమయమైన గృహజీవనం

అతని ముఖం ఆనందములో ప్రకాశిస్తున్నది. ఆమె ప్రేమతో తయారు చేసిన 'టీ' ఒక గ్లాసు త్రాగడం అప్పుడే ముగించాడు. పగలల్లా ఆఫీసులో పనివల్ల వచ్చిన అలసట పూర్తిగా అదృశ్యమైపోయినది. ఇక ఇప్పుడు అతడు చేయవలసినది కులాసాగా భార్యతో కబుర్లు చెప్పడం పిల్లలతో ఆడుకోవడం.

ప్రతిసాయంత్రమూ ఒక గ్లాసుడు టీ తో భర్తను ఆహ్వానించి అతనిని ఆమె సేద దీరుస్తుంది. సుఖమయమైన సంసార జీవనం గడపడానికి అతనికి అంతకంటే ఏం కావాలి? ఉల్లాసాన్నిచ్చే మంచి 'టీ' తయారు చేయడం ఎంత సులభం! ఇక ఖర్చు విషయమా అదీ స్వల్పం. వ్యవధికూడ ఎక్కువ అక్కరలేదు.

సేద దీర్చే రుచికరమైన 'టీ' ని ప్రతి రోజూ త్రాగండి.

**మంత్ర శక్తి నిచ్చే పానీయం**

**"టీ" త్రాగండి**



సెంట్రల్ "టీ" బోర్డువారివల్ల ప్రచురింపబడినది.